# చతుర

నవంబరు 2008
రూ.10/-



సిహెచ్.వెంకటేశ్వరరావు

## మొగ్గ

వారెవ్వా!





## మూషికాల కచేరి

అసలు సిసలు
సంగీత కళాకారుల్లా
వివిధ వాద్యపరికరాల్ని
తమాషాగా పలికిస్తున్న
మూషికరాజాలు







హాస్యప్రియులకి అందమైన నజరానా!



త్వరలో...

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్టులో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

సంపుటి -31
సంచిక - 10
నవంబరు 2008
370వ సంచిక

# చతుర



ముఖచిత్రం : హర్షిత
ముఖపత్రాలంకరణ : రాజు, శ్రీకృష్ణ



పట్నంలో వింతలు చూడొచ్చని, హాయిగా కడుపునిండా తిండి దొరుకుతుందనీ నమ్మించి తెచ్చి, ఆ ఇంట్లో పడేసిన వారు ఎవరోకాదు.. సాక్షాత్తూ కన్నవారే! వాస్తవం తెలిశాక ఆ చిన్నారి కుంగిపోయింది.. అక్కడినుంచి తన జీవితం ఎన్నెన్ని మలుపులు తిరిగిందో తెలియచెప్పే

**సిహెచ్. వెంకటేశ్వరరావు**

## మొగ్గ

14 వ పేజీలో

బొమ్మలు:
ఆనంద్

ఆమె చర్మం నిగారింపు చూసి పాలరాతి శిల్పాలే సిగ్గుపడతాయి. పువ్వులు ఆ మృదుత్వం తమకు రాలేదేమని భగ్గుమంటాయి. ఆమె నవ్వును చూసి పూర్ణచంద్రుడే ముఖం మాడ్చుకుంటాడు. అందాల సీమకు అసలైన చిరునామాగా పేరెన్నికగన్న ఆ భామ మరెవరో కాదు.. బాలీవుడ్ అందాల తార కత్రినాకైఫ్! కుర్రకారును కైపెక్కించే ఆ ఇరవై అయిదేళ్ల సొగసరి ఆరోగ్యం, అందచందాల రహస్యాలివి....



# ఆరోగ్యం, అందం ఆమె పాదాక్రాంతం

బ్రిటిష్ తల్లి, కాశ్మీరీ తండ్రికి పుట్టిన ఎనిమిది మంది సంతానంలో ఏడుగురూ అమ్మాయిలే! వారిలో ఒకరు కత్రినా. తండ్రిని కోల్పోయిన దశలో ఆ కుటుంబం నరకాన్నే చవిచూసింది. ఇల్లు గడిచేందుకు సంపాదించక తప్పని పరిస్థితి ఎదురవడంతో పద్నాలుగేళ్లకే కత్రినా లండన్‌లో మోడలింగ్‌లో ప్రవేశించింది. తర్వాత బాలీవుడ్‌కి చేరింది. తొలిదశలో పెద్దగా ఆశావహంగా లేకున్నా గత ఏడాది ఆమె నటించిన నాలుగు సినిమాలు హిట్ అవడంతో ఆమె భారతీయ యువత గుండెల్లో తిష్టవేసుకుని కూర్చుంది. అందం, ఆరోగ్యం గురించి ఆమె ఏమంటోందంటే-

- ముద్దొచ్చేలా కనిపించడం, ఫిట్‌నెస్‌తో ఉండటమే అందం కాదు. ప్రతివారికీ అంతః సౌందర్యం అవసరం. అదే అన్నింటికన్నా విలువైంది. దీన్ని సాధించాలంటే నిష్కల్మషమైన మనస్సు కావాలి.
- మన ఆలోచనలు స్వచ్ఛంగా ఉంటే మన చూపుల్లో కాంతి తొణికిసలాడుతుంది. ఇది తెలుసుకోకుండా చాలామంది బాహ్యరూపానికి మెరుగులు దిద్దేందుకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. కానీ సహజసిద్ధ తేజస్సు లభించాలంటే అంతరంగ ఆరోగ్యం అత్యవసరం.
- నా విషయానికి వస్తే పైన చెప్పిన వాటిని తు.చ. తప్పకుండా పాటించడంతో పాటు ఎక్కువగా ఆకుకూరలు, కాయగూరల్ని తీసుకుంటా. చేపలు కూడా ఆరోగ్యానికి మంచివే!
- మనం తినేదానిపైనేకాక, ఎలా తింటున్నామనే దానిపైనా శ్రద్ధపెట్టాలి. సాధారణంగా భారతీయ వంటకాల్లో నూనె

లను అధికంగా వాడుతుంటారు. దీంతో దేహంలో కొలెస్ట్రాల్ స్థాయి పెరిగి ముప్పుగా పరిణమిస్తుంది. కనుక ఈ విషయంలో శ్రద్ధపెట్టాలి. నూనెపదార్థాల్ని గణనీయంగా తగ్గించాలి.

✦ నాకు జపానీ వంటకాలు ఇష్టం. వాళ్లు మసాలాల్ని ఎక్కువగా వాడరు. అలాగే నూనెలు వాడకపోవడంతో కొవ్వు కూడా పెరగదు.

✦ ఆరోగ్యం కాపాడుకునేందుకోసం రోజూ మనం కాస్త సమయం కేటాయించుకోవాలి. బిజీ జీవితంలో సమయం దొరకడం కష్టమైనా ఇది తప్పదు.

✦ అందం, ఆరోగ్యం కాపాడుకోవాలంటే చక్కని దినచర్యా అవసరమే. పెందరాళే నిద్రలేవాలి. అతిగా నిద్రపోవడం తగదు. రోజూ జిమ్‌కు వెళ్లాలి. సమయపాలన పాటించాలి.

✦ నేను ఇవన్నీ పాటిస్తా. శారీరక వ్యాయామం కూడా చేస్తా.

✦ వీలైనంత వరకూ మేకప్ తగ్గించుకుని సహజంగా ఉండడానికి ప్రయత్నించాలి. వేసుకోకపోతే కుదరదనేవారు పని పూర్తయిన వెంటనే తొలగించుకోవాలి. నిజానికి నాకు మేకప్‌లంటేనే చిరాకు.

✦ తరచూ స్పా ట్రీట్‌మెంట్ తీసుకోవడం మంచిది. చర్మ సమస్యలకు ఇది మంచి విరుగుడు.

✦ నాకు వెచ్చని వాతావరణంలో, ఎండలో పనిచేసినా ఏమీకాదు. పైగా నా అందం మరింత మెరుగుపడుతుంది.

✦ తెరమీద రకరకాల దుస్తులు వేసుకుని కనిపించినా హాయిగా ఉండేలా, బిగుతుకాని డ్రెస్సులు వేసుకోవడం నాకిష్టం.

✦ ప్రతిరోజూ పొద్దునే నాలుగు గ్లాసుల నీళ్లుతాగడంతో నా దినచర్య ప్రారంభమవుతుంది.

✦ ఫ్రూట్ సలాడ్‌లు నాకిష్టం.

✦ కొద్దిగా ఎక్కువతిన్నా లావెక్కే స్వభావం కొందరి శరీరతత్వంలోనే ఉంటుంది. అలాంటివారు బరువుపెరగకుండా జాగ్రత్త పడాలి. లేకపోతే అధిక బరువువల్ల అనేక అనర్థాలు తప్పవు.

✦ నేనింత ఆరోగ్యంగా ఉండటానికి మరో ముఖ్య కారణమేమంటే ఈతకొడతాను, జాగింగ్ చేస్తాను. దీంతో రక్తప్రసరణ సజావుగా ఉండటమే కాకుండా చర్మం కూడా కాంతిమంతమవుతుంది.

✦ క్లీన్సింగ్ మిల్క్ తగు మోతాదులో ఉన్న ఫేస్‌వాష్‌తోనే శుభ్రం చేసుకుంటాను.

✦ బెడ్‌పక్కన అత్యవసరమైనవాటిలో బాడీ మాయిశ్చరైజర్, విటమిన్ సి మాత్రలు పెట్టుకుంటాను.

✦ అలాగే మన ఒంటికి సరిపోయే పర్ఫ్యూమ్స్‌ని, అతి తక్కువ మేకప్‌ని వాడితే చర్మం మన నియంత్రణలో ఉంటుంది. చాలా చక్కగా ప్రతిస్పందిస్తుంది.

–కేఆర్‌జీ



## అపార్ట్‌మెంటాలజీ-10

# ఎన్నికల కలకలం!



యర్రంశెట్టి సాయి

మిగతా దేశమంతా పట్టుకున్నట్లే ఎలక్షన్ ఫీవర్ మా అపార్ట్‌మెంట్స్ క్కూడా పట్టుకుంది.

మా అపార్ట్‌మెంట్స్‌లో ప్రత్యేకత ఏంటంటే అన్ని బ్లాకుల్లోనూ కలసి మొత్తం రెండువేల ఓట్లుంటాయ్.

ప్రతి ఓటూ కొన్ని వెయ్యి నోట్ల ధర పలుకుతున్న ఈ రోజుల్లో- రెండువేల ఓట్లు ఒకే చోట - ఒకే అసోసియేషన్ కింద ఉన్నాయనేసరికి ఏ పార్టీ అభ్యర్థికయినా కొంచెం టెంప్టింగ్‌గానే ఉంటుంది కదా!

అందుకని ఎలక్షన్స్ ఇంకా చాలా దూరం ఉన్నా అందరూ ఏదోక వంక కల్పించుకుని మా అపార్ట్‌మెంట్స్‌కి రావటం- వాళ్ళ పార్టీకి మా వాళ్ళంతా ఓటేస్తే ఏమేం ఉచితంగా ఇవ్వబోతున్నారో లిస్ట్ చదవటం చేస్తున్నారు. మా అసోసియేషన్ వాళ్ళందరం ఎమర్జెన్సీ మీటింగ్ పెట్టుకున్నాం. ఈసారి మేమందరం ఏ పార్టీకి ఓటేయాలనే విషయం మీద మా సొసైటీ ప్రెసిడెంట్ హమీద్ డిస్కషన్ ప్రారంభించాడు.

"బాగా ప్రియం అయిన సోదరిలారా! ఎక్కువ ప్రియం అయిన సోదరూలారా!" అన్నాడు ఉర్దూలో రాసుకున్న తెలుగు చదువుతూ.

"బాగా ప్రియం అయినా అంటాడేంటి! ప్రియమైన అని చదవొచ్చుగా!" అడిగాడు విజయ్ యాదవ్ పక్కనున్న చౌదరితో.

"అంటే ఆయనుద్దేశ్యం ఏంటంటే అదివరకు ఓట్లు కొనుక్కోవడానికి చాలా చవగ్గా దొరికేవి! ఇప్పుడు బాగా ప్రియం అయిపోయినయ్ అని!" అంటూ ఎక్స్‌ప్లెనేషనిచ్చాడు చౌదరి.

"కరెక్టే మరి! ఆ రోజుల్లో ఓట్లసలు ఫ్రీగా దొరికేవట! ఒక్క పైసా కూడా అడక్కుండానే ఓటేసేవారట!" అంది మంగతాయారు వాళ్ళ అమ్మమ్మ చెప్పిన మాటలు గుర్తు చేసుకుంటూ.

దాంతో అందరూ ఆమె చుట్టూ మూగిపోయారు.

"నిజంగా ఒక్క పైసా కూడా తీసుకునేవారుకాదా!? " అడిగారు యూత్ అసోసియేషన్ వాళ్లు.

"అవును! యంగ్ ఏజ్‌లో ఉన్నప్పుడు నేనూ నా మొదటి ఓటు డబ్బులేమి తీసు

కోకుండానే వేశాను" అందామె గర్వంగా.

యూత్ అంతా పగలబడి నవ్వారు.

"ఏం పాగల్‌గా(శ్రా భాయ్ ఆ దినాల్లో పబ్లిక్! అందుకే ఇండియా ఇంత వెనుకబడింది. వాళ్లు చేసిన ఆ వెధవ పనివల్ల మన జనరేషనంతా సఫర్ అవుతున్నాం!" అన్నాడొకడు.

హమీద్‌మియా ఉపన్యాసం కంటిన్యూ చేశాడు.

"ఈ దినం మనమంతా టూమచ్ గర్వపడుకోవాల్సిన దినం!"

"ఆహా! ఎంత గొప్ప తెలుగురా నాయినా! గర్వాన్ని కూడా పడుకోబెట్టా శావ్" అన్నారెవరో వెనుకనుంచి.

ఆ మాట వినిపించేసరికి హమీద్‌మియాకు కోపం వచ్చింది.

"ఇదిగో- నేను కొంచెం జర ఎక్కువ కష్టంపడి తెలుగూ మాట్లాడినయ్. నీకు ఒక్క ఉర్దూ అక్షరంబీ రావ్‌కదా! మూడు జన్మకావాలి-"

అందరూ హమీద్‌కి సర్ది చెప్పారు.

"నా దగ్గర ఒక లిస్ట్ ఉన్నయ్- ఏ పార్టీ మనకు ఏం పుక్కట్‌గా ఇస్తయ్- మీదికెళ్ళి- ఎలక్షన్ ముందటి దినం రాత్రి మన ఇళ్ళ కొచ్చి ఎన్ని పైసలు ఎక్‌స్ట్రా ఇస్తయ్- ఇందంతా ఈ లిస్ట్‌లో ఉన్నయ్. ఇప్పుడు ఈ లిస్ట్ విజయ్ యాదవ్ చదువుతయ్-" అంటూ ఆ లిస్ట్ విజయ్ యాదవ్‌కిచ్చాడు హమీద్‌మియా!

విజయ్‌యాదవ్ వెంటనే చదవటం మొదలుపెట్టాడు.

"నిలువు దోపిడీ పీపుల్స్ పార్టీ వాళ్లు ఇచ్చిన హామీలు- రాష్ట్రంలోని వైట్‌కార్డ్ స్త్రీలందరికి జరీ చీరలు ఒక్కొక్కరికి ఆరు చొప్పున ఉచితం! ఒక్కో చీర ఖరీదు కనీసం మూడు వేలుంటుంది!"

అపార్ట్‌మెంట్స్‌లో ఉన్న వైట్‌కార్డ్ వాళ్ళు తప్పట్లు కొట్టారు.




"నిలువు దోపిడీ పీపుల్స్ పార్టీ- జిందాబాద్" అంటూ అరిచారు.

"అది కాకుండా- వైట్‌కార్డ్ కుటుంబాలన్నిటికీ నెలకు వందకిలోల బియ్యం ఉచితం-"

మళ్ళీ తప్పట్లు కొట్టారు వైట్‌కార్డ్ వాళ్ళు.

"అది కూడా కాకుండా- వైట్‌కార్డ్ వాళ్ళందరికి- ప్రతి ఇంటికీ నాలుగు వైట్ కార్డ్‌లు ఉచితం-"

తప్పట్లు ఇంకా పెద్ద ఎత్తున మారుమ్రోగిపోయినయ్.

"ఇక అష్టదరిద్ర ప్రజాస్వామ్య పార్టీవాళ్ళు ఇస్తున్న ఎన్నికల మానిఫెస్టో ఏంటంటే తెలుగు ప్రజలందరికీ- వైట్‌కార్డ్‌తో పని లేకుండా- నెలకు ముప్ఫై లీటర్ల బ్రాందీ, లేక విస్కీ, లేక రమ్ము ఉచితం-"

ఈసారి మొత్తం అక్కడున్న వారంతా, పదేళ్ళ విద్యార్థులతో సహా తప్పట్ల వర్షం కురిపించారు.

యూత్ అసోసియేషన్ వాళ్ళు డాన్స్‌లు కూడా చేశారు, గాళ్ స్టూడెంట్స్‌తో కలిసి.

"హాట్‌డ్రింక్స్ తీసుకోనివారికి వంద లీటర్ల బీరు కూడా ఉచితంగా ఇవ్వాలి!" అంటూ అరిచారు అమ్మాయిలు.

"అష్టదరిద్ర ప్రజాస్వామ్య పార్టీ- జిందాబాద్ - పది కాలాలు వర్ధిల్లాలి-" అని కూడా నినాదాలు చేశారు.

"అది కాకుండా- ఇదే పార్టీ ఇంకో అద్భుతమయిన వాగ్దానం కూడా చేస్తోంది-" అన్నాడు విజయ్‌యాదవ్.

"అదేంటో చెప్పు చిల్లర సస్పెన్సు నువ్వూనూ-" వెనుక నుంచి స్టూడెంట్స్ అరిచారు.

"వైట్‌కార్డ్ ఉన్న ప్రతి కుటుంబానికి టాటావారి 'నానో' కారు ఉచితం-" అంతా ఈలలూ, తప్పట్లూ-

"ఇక వీరపీకుడు పార్టీ వాళ్ళ వాగ్దానాలేమిటంటే -బలహీన, బడుగు, మైనారిటీ, వెనుకబడిన వర్గాల వారందరికీ మెట్రో రైల్లో ఉచిత ప్రయాణం, ఆర్టీసీలో రాష్ట్రంలో ఏమూల నుంచీ ఏ మూలకయినా ఉచిత ప్రయాణం, విమానాల్లో సంవత్సరానికి రెండుసార్లు ప్రపంచంలో ఏ దేశానికయినా ఉచిత ప్రయాణం! ఆకాశశ్రీ అనే ఈ పథకంలో ఫోన్ కొట్టగానే ఎయిర్‌పోర్ట్ వాళ్ళ నూట పదకొండు నెంబరు గల బస్సు మీ ఇంటి ముందు కొచ్చి మిమ్మల్ని ఎయిర్‌పోర్ట్‌కి తీసుకెళ్తుంది."

తప్పట్ల మోత మోగిపోయిందీసారి. "వీరపీకుడు పార్టీయే -గెలవాలి- మాక్కావాలి! మన ఓట్లన్నీ వీరపీకుడు పార్టీకే-" లాంటి నినాదాలు హోరెక్కిపోయాయ్. తరువాత పరమ నికృష్టపార్టీ మానిఫెస్టో చదివాడు విజయ్‌యాదవ్. "కార్మికులందరూ వారానికొక్కరోజే - అంటే సోమవారాలు మాత్రమే పనిచేయాలి- మిగతా ఆర్రోజులూ ఎంజాయ్! అంతేకాదు వారందరికీ సంవత్సరానికి పది లక్షల రూపాయలు బోనస్ ఇస్తాం! ఆ కంపెనీలు, ఆఫీసలు ఎంత నష్టాల్లో ఉన్నా సరే, ఒకవేళ కంపెనీ దివాలా తీస్తే ఇన్సూరెన్స్ కంపెనీలు ఆ పదిలక్షలూ చెల్లిస్తాయ్. రైతులకు పొలం ఉన్నా లేకపోయినా వ్యవసాయం చేసినా, చేయకపోయినా నెలకు పదివేలు బ్యాంక్ రుణం ఫ్రీ. అది కూడా వాపస్ ఇవ్వనక్కర్లేదు"

అంతా తప్పట్లు మారుమోగిపోయాయ్‌గానీ ముందు వరసలో కూర్చున్న కార్మికుడు లేచి నిలబడ్డాడు.

"వారానికొక్కరోజు సోమవారం మాత్రమే పని చేయాలన్నారు బాగానే ఉంది సార్- కానీ ప్రతి సోమవారం అలా పనిచేస్తూనే ఉండాలా? ఇక మాకు వీక్లీ ఆఫ్ ఎప్పుడిస్తారు సార్? సంవత్సరానికి ఎన్ని రోజులు శెలవులుంటాయ్? సిక్‌లీవ్ ఎన్ని నెలలుంటుంది? ప్రసూతి శెలవుల సంగతేంటి? "

"ఆ విషయంపై పార్టీ మానిఫెస్టోలో వివరాలు లేవు- కనుక్కొని చెప్తాం-" అన్నాడు విజయ్‌యాదవ్.

ఆ వర్కర్ గొణుక్కుంటూ కూర్చున్నాడు "బూర్జువా నా కొడుకులు-"

"అంతేకాదు! మా పార్టీ అధికారంలో కొస్తే మైనారిటీలయిన ముస్లిమ్ సోదరులకు రంజాన్ మాసమంతా ఉచితంగా బిరియానీ, హలీమ్ పాకెట్లు ఇస్తాం!"

ముస్లిమ్ సోదరులు తప్పట్లు కొట్టారు.

"తరువాత చిల్లర పార్టీ వాళ్ళ మానిఫెస్టో! ఈ పార్టీ అధికారంలో కొస్తే మద్యం రాష్ట్రమంతా ఏరులయి ప్రవహిస్తుంది- అదీ ఉచితంగా. ప్రతి ఇంటికి మద్యం కుళాయిలు ఏర్పాటు చేస్తాం- కుళాయిలు తిప్పుకుని ఎవరికెంత కావాలో అంత 24 గంటలూ తాగి పడివుండవచ్చు. అంతేకాదు. వ్యభిచారానికీ పెద్దపీట వేస్తాం! లీగలైజ్ చేస్తాం. గల్లీ గల్లీకీ



వ్యభిచార గృహం- ఆ వ్యభిచారులందరికీ కార్పొరేట్ హాస్పిటల్స్‌లో ఉచిత పరీక్షలు, వైద్యం- అంతేకాదు ఉచిత మందులు కూడా- ఫోన్ కొడితే చాలు. ఈ స్కీమ్ పేరు సెక్స్‌శ్రీ పథకం-

జీరో నెంబర్ డయల్ చేయగానే సెక్స్‌శ్రీ కారు మీ ఇంటికొస్తుంది. మిమ్మల్ని తీసుకెళ్ళి సమీపంలో ఉన్న వ్యభిచారగృహానికి చేరుస్తుంది. అక్కడ మీక్కావలసిన అమ్మాయిని మీరు సెలక్ట్ చేసుకుని ప్రభుత్వ అతిథి గృహాలు బుక్‌చేసుకుని అందులో మీకిష్టమొచ్చినన్ని రోజులు ఉండవచ్చు-"

స్టూడెంట్స్ ఈలలూ తప్పట్లతో మోతెక్కించేశారు.

"చిల్లర పార్టీయే కావాలి"

"చిల్లర పార్టీ-జిందాబాద్-"

"సాటిలేని మేటి పార్టీ-చిల్లర పార్టీ"

"ఇవీ మనకున్న పార్టీలు! కనుక వీటిల్లో ఏ పార్టీని గెలిపిస్తే మనకు లాభాల పంట కలుగుతుందో డిస్కస్ చేసుకుని డిసైడ్ చేయాల్సి ఉంది" అంటూ ముగించాడు విజయ్ యాదవ్.

రాత్రి పన్నెండింటివరకూ తీవ్రమయిన చర్చలు జరిగాయ్. ఒక్కో ఏజ్ గ్రూప్ వాళ్ళూ ఒక్కో పార్టీని సపోర్ట్ చేయడంతో ఏకాభిప్రాయం కుదర్లేదు. వాతావరణం చాలా వేడెక్కిపోయాక శంకరమూర్తి కల్పించుకున్నాడు.

"సోదర సోదరీమణులారా! మీరు నిర్ణయం తీసుకునే ముందు రెండు మాటలు మాట్లాడాలనిపించింది. ఇన్ని పార్టీలు ఎన్నికల మానిఫెస్టోని ప్రకటించాయ్‌గానీ- వీటిల్లో ఏ ఒక్కరూ వాళ్ళ ఎన్నికల వాగ్దానాలకు నిధులు ఎలా సమకూర్చుకుంటారో తెలుపలేకపోతున్నారు. ఓటు వేసేముందు మనం ఆ పాయింట్ క్లారిటీ చేయమని చెప్పాలి" అన్నాడతను.

అప్పుడే అతని సెల్‌ఫోన్ మోగింది.

"సోదరులారా! ఇప్పుడే నిలువుదోపిడీ పార్టీవాళ్లు మాట్లాడారు. వాళ్ళు మన రాష్ట్రంలో మూడోవంతు భూమిని విదేశాలకు అమ్మి ఆ డబ్బుతో ఎన్నికల వాగ్దానాలు అమలు చేస్తారట-




ఏమున్నయ్ అంటే పార్టీలు ఇచ్చిన ప్రామిస్‌లు అన్నీ మంచిగున్నయ్. ఆ ప్రామిస్‌లు అమలూ చేస్తే- మన స్టేట్‌లో - ఒక్క జనంభీ కొలువుల్ చేసే పనిలేవ్! మొత్తం జనం అన్నింటికీ ఫ్రీగా మద్యం వస్తయ్. పుక్కటిగీ బియ్యం వస్తయ్. ఫారిన్ టూర్స్ పుక్కట్! మెట్రోరైల్ పుక్కట్- బస్‌జర్నీ పుక్కట్! వ్యభిచారం పెద్ద ఇండస్ట్రీ అవుతయ్! లేబర్ నెలకు ఒక్కటే దినం కొలువు జేస్తయ్- రైతులే వ్యవసాయం చేయకపోయినా పుక్కట్‌గా బాంక్‌లోన్- అదిభీ హర్ ఏకమనుకో దస్ హజార్- ఆ లోన్ వాపస్ చేసే పనిలేవ్- అందుగురించి మనం ఏదో ఒక్క పార్టీకి ఓటింగ్ చేస్తే బాకీ పార్టీలు ఇచ్చే లాభం పోతుంది. దాన్దికు వెళ్లి ఏ పార్టీకి మెజారిటీ రాకుండా ఓటింగ్ చేయాలే- వైసా కరేతో- కోయ్‌లేషన్ గవర్నమెంట్ ఏర్పడతయి-

అప్పుడు అన్ని పార్టీలు వాగ్దానాలు ఇంప్లిమెంటు చేస్తయ్. మనకి బహుత్ ఫాయిదా అవుతయ్"

అందరూ తప్పట్లు కొట్టి హమీద్ మియాని అభినందించారు.

కాని ఆఖర్లో కూర్చున్న ఒక ముసలాయన లేచి నిలబడ్డాడు.

"ఈ పార్టీల వాగ్దానం వల్ల మనందరికీ లాభాలే గాని కొద్ది రోజుల తరువాత మన రాష్ట్రం గతేంటి? "

చాలా సేపు ఎవరూ మాట్లాడలేదు గానీ ఆఖర్లో అరిచారు.

"అరే ముసలోడా! ఫ్యూచర్ గురించి నీకెందుకురా! ఇప్పుడెంజాయ్ చెయ్" ©

ఇక అష్టదరిద్ర ప్రజాస్వామ్య పార్టీవాళ్లయితే రైతులందరినీ పక్క రాష్ట్రాలకు వలస పంపి వాళ్ళ భూములన్నీ సెజ్‌లకు ఇచ్చి ఆ డబ్బుతో వాగ్దానాలు అమలు పరుస్తారంట-

ఇక వీరపీకుడు పార్టీవాళ్ళు అరబ్‌దేశాలకు మన రాష్ట్రంలోని లేబర్‌ని అమ్మేసి ఆ డబ్బుతో వాగ్దానాలు అమలు పరుస్తారంట.

ఇక పరమనికృష్ట పార్టీ వాళ్ళు మన రాష్ట్రాన్ని థాయ్‌లాండ్‌లాగా సెక్స్ కాపిటల్‌గా చేసి విదేశీ యాత్రికుల ద్వారా వచ్చే ఆదాయంతో వాగ్దానాలు అమలు పరుస్తారంట!

చిల్లర పార్టీవాళ్ళేమో టెర్రరిస్ట్‌లతో లింకులు పెట్టుకుని వాళ్ళకు స్థావరాలు ఇచ్చినందుకు డబ్బు సంపాదిస్తారట.."

అందరూ రాత్రి రెండింటి దాకా ఆలోచించి చివరకు కంబైన్డ్‌గా నిర్ణయం తీసుకున్నారు.

ఆ నిర్ణయాన్ని హమీద్‌మియా చదివి వినిపించాడు.

"మా రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్‌కే లోగ్- టూమచ్‌గా విచారణ చేసి ఒక అండర్‌స్టాండింగ్‌కి వచ్చినయ్. ఆ నిర్ణయం

# జీన్స్ కథ




జర్మనీలో పుట్టిన స్ట్రాస్ లోయబ్ తన జీవిత చరమాంకంలో అమెరికాకి వలస వెళ్లాడు. న్యూయార్క్ రాష్ట్రంలోని తన ఇద్దరు సోదరుల దగ్గర రెండు రోజులే గడిపి, తర్వాత కెంటకీ రాష్ట్రంలోని తన మేనమామ నడిపే రాంచ్‌కి వెళ్లాడు. అక్కడ అయిదేళ్లపాటు దుస్తుల వ్యాపారం చేశాడు. బట్టల మూట భుజాన వేసుకుని ఇంటింటికీ తిరిగి బట్టలు అమ్మేవాడు. తన పేరుని లోయబ్ నుంచి లెవీగా మార్చుకున్నాడు.



అప్పట్లో కాలిఫోర్నియా రాష్ట్రానికి ఉత్సాహవంతులయిన వారెంతో మంది తమ అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు వెళ్లేవారు. అక్కడి గనుల్లో బంగారంకోసం తవ్వకాలు జరిపేవారు. లెవీ స్ట్రాస్ కూడా తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి కాలిఫోర్నియాకి వెళ్లాడు. తను బంగారం కోసం కాక, దుస్తుల వ్యాపారం కోసం వెళ్లాడు. అక్కడ టైలర్‌గా పనిచేస్తుండగా ఒక విషయం గమనించాడు. గనుల్లో పని చేసేవారి పేంట్లు త్వరగా చినిగిపోతాయనేది.

టెంట్స్ వేసుకునే కాన్వాస్‌బట్టని అతడు తన వెంట తెచ్చాడు. కానీ అది అమ్ముడు కాకపోవడంతో దాంతో అతను పేంట్లని కుట్టి అమ్మసాగాడు. పనివాళ్లని అది బాగా ఆకర్షించింది. తన దగ్గరున్న కాన్వాస్ బట్ట అయిపోవడంతో ఫ్రాన్స్‌లోని నైమ్స్‌నుంచి దిగుమతి చేసుకున్న సెర్జ్‌డెనిమ్స్ అనే మందపాటి బట్టని పేంట్లు కుట్టడానికి వాడసాగాడు. దీనినుంచే డెనిమ్ అనే అమెరికన్ పేరు వచ్చింది. 1922లో లెవీ స్ట్రాస్ అండ్ కంపెనీ సంస్థని అతను రిజిస్టర్ చేసి, అందులో తయారు చేసి అమ్మే పేంట్లకి జీన్స్ అన్న పేరు పెట్టాడు. బెల్ట్ పెట్టుకునేందుకు నాడాలని పెట్టడం, బెల్ట్ పక్కకి తొలగకుండా ఉండేవిధంగా బయటకి కుట్టడం జీన్స్‌తోనే ఆరంభమైంది.

జీన్స్‌ని నారింజ రంగు దారంతో కుట్టడానికి కారణం వాటికి అదనపు బలంగా తోడ్పడే రివెట్స్‌కి మేచ్ అవ్వాలనే.

జాకబ్ డేవిస్ అనే టైలర్ నెవెడా రాష్ట్రంలో రెనో పట్టణంలో ఈ జీన్స్‌కి డిస్ట్రిబ్యూటర్‌గా ఉండేవాడు. అతను పేంట్ చిరిగే చోట్ల అదనపుబలం కోసం వాడే రివెట్లని కనిపెట్టాడు. అయితే దానికి పేటెంట్‌ని తీసుకునేందుకు డబ్బులేక, దాన్ని 68 డాలర్లకి లెవీస్ట్రాస్‌కి అమ్మేశాడు. అప్పటి నుంచి జీన్స్‌కి రివెట్స్‌ని వాడటం మొదలైంది. జిన్నిస్ అన్న ఫ్రెంచ్ పదం అమెరికాలో జీన్స్‌గా ప్రాచుర్యం పొందింది. రెండో ప్రపంచయుద్ధకాలంలో బట్టల కొరత రావడంతో జీన్స్ వెనక జేబులు కుట్టకుండా, ఆ బట్టని లెవీ ఆదా చేసేవాడు. అయితే అక్కడ జేబు ఉందన్న భ్రమ కలిగేలా ఊరికే కుట్టి, దాన్ని పెయింట్ చేసేవాడు. 1936లో లెవీస్ట్రాస్ కంపెనీవారు జీన్స్ లేబుల్స్‌ని లోపలివైపు కాక బయటివైపే కుట్టడం ఆరంభించారు. ఇప్పుడు ప్రపంచంలో లెవీస్ట్రాస్ కంపెనీ జీన్స్ అమ్మకాల్లో ప్రథమ స్థానంలో ఉంది.

పాపం..
పుణ్యం ఎరుగని
ఆ పసిమొగ్గను పట్నానికి
తెచ్చి పనిలోపెట్టిపోయాడు
అయ్య. అమ్మను. చెల్లెండ్లను
వదల్లేక వదల్లేక వచ్చిన
ఆ చిన్నారిని చిత్రహింసలు పెట్టారు
యజమానులు. తిరిగి ఇంటికి వెళ్దామంటే
అయ్య చంపేస్తాడని భయం..
అలాంటి స్థితిలో ఓ జర్నలిస్ట్
ఆపన్న హస్తం లభించింది..
కానీ పెనం మీదనుంచి పొయ్యిలో
పడిన చందమైందా పసిదాని బతుకు..
ఎందుకో తెలియాలంటే 'మొగ్గ'
చదవాల్సిందే!

సిహెచ్. వెంకటేశ్వరరావు



# మొగ్గ

బాలల దినోత్సవ చతుర ప్రత్యేక కానుక!

"అమ్మా! అమ్మా! గులాబీమొక్క మొగ్గేసిందే...!" చిన్నారి శ్వేత ఆనందంగా అరిచింది.

"అవును! నీకన్నా ముందే చూశా. నిన్ను లేపి చెబుదామనుకున్నా. కానీ నీ అంతట నువ్వు పొందే థ్రిల్‌ని పాడుచేయడం ఇష్టంలేక చెప్పలేదు. తెల్లగులాబీయే కదూ మొగ్గవేసింది..."అడిగింది అరుణ తానూ పెరట్లోకి వస్తూ.

ఉదయానే లేచిన వెంటనే నిద్రమత్తయినా వదలకుండా పెరట్లోకి వెళ్లడం, ఇటీవలే కొత్తగా తీసుకొచ్చి నాటిన గులాబీ మొక్కలవంక తేరిపారా చూడడం, ప్రేమపూర్వకంగా వాటిని తాకడం, జగ్గు నిండుగా తెచ్చిన నీళ్లు మొక్కల మొదళ్లలో పోయడం, ఆకులపై చల్లడం శ్వేత ప్రతిరోజూ మొదట చేసే పని. తల్లీకూతుళ్లకి పూలమొక్కలు పెంచడమెంతో సరదా. అందుకోసం నగరంలోని నర్సరీలన్నీ కలయతిరుగుతారు. నచ్చిన మొక్కలను, కుండీలను తీసుకొస్తారు. ప్రతిమొక్కనూ చిన్నపాపలా చూసుకుంటారిద్దరూ. శ్వేత అయిదేళ్ల చిన్నారైనా... తాను మొక్కల్ని పెంచడంలో ఎంతో ఆరిందాలా ప్రవర్తిస్తుంటుంది. ఒక మొక్క మొగ్గతొడిగితే సంబరపడుతుంది.

"ఏమండోయ్, శ్వేత నాటిన గులాబీ మొగ్గతొడిగింది. మీరూరండి... చూద్దురు గానీ..." పిలిచింది అరుణ.

చదువుతున్న దినపత్రికను పక్కనపెట్టి పెరట్లోకి వెళ్లాడు మోహన్.

"ఇదిగో, నాన్నా! గులాబీ మొగ్గ చూడు, ఎంత బాగుందో?" చూపుడువేలితో మొగ్గను చూపిస్తుంటే అరుణ శ్వేత చేయి పక్కకు తోసి..."అలా వేలితో మొగ్గను చూపించకూడదమ్మా! దిష్టితగిలి మొగ్గపూయదు..." అని చెబుతోంది.

"అవునా.. అమ్మా! నాకు తెలీదు. ఇంకెప్పుడూ అలా చేయను..." అంటోంది శ్వేత.

"సరిసరి...! పెరట్లోనే సెటిలైపోతావా? తొందరగా తెములు.. కాన్వెంట్ వ్యాన్ వచ్చేసే టైమవుతోంది..." అంటూ అరుణ శ్వేతను తనతోపాటు ఇంట్లోకి తీసుకెళ్లింది.

పెరట్లో గులాబీమొక్క దగ్గర ఒంటరిగా మిగిలిపోయాడు మోహన్. గలగలా ఇంట్లో తిరుగుతూ సందడిచేసే చిన్నారి శ్వేతను చూసినా... ఆమె అపురూపంగా పెంచుకుంటున్న గులాబీమొక్కకు వేసిన మొగ్గను చూసినా ఎందుకో లక్ష్మి గుర్తొస్తుంది మోహన్‌కి. పాత్రికేయవృత్తిలో ఎందరినో ఎన్నేళ్లుగానో కలుస్తున్నా... ఎపుడో కలిసి తెరమరుగైన లక్ష్మి మాత్రం ఇప్పటికీ తాజా జ్ఞాపకంగా మదిలో మెదులుతూనే ఉంది.

ఒక్కసారిగా మోహన్‌కి చేదు తిన్నట్లయింది లక్ష్మిని తలచుకోగానే. గాఢంగా నిట్టూర్చాడు.

"ఇపుడెక్కడుందో ఏమో..." అనుకుంటుండగానే అతని కళ్లముందు గతంకదలాడింది. ఆ గతంలో లక్ష్మి జీవితమంతా సినిమారీళ్లమాదిరి కనిపించింది.

★ ★ ★

బస్సు ప్రయాణం లక్ష్మికి ఎంతో సంబరంగా వుంది. అది తన తొమ్మిదేళ్ల జీవితంలో ఇంతవరకు బస్సు ఎక్కింది లేదు. పైగా తను వెళ్లేది పెద్ద పట్నానికి. దాంతో తన ఆనందానికి అంతే లేదు.

బైట సన్నగా చినుకులు పడుతున్నాయి. లక్ష్మి కిటికీలో నుంచి చెయ్యి బయట పెట్టింది. సన్నటి చినుకులు మెత్తమెత్తగా గుచ్చుకున్నాయి. పైకి చూసింది. బస్సుతో పాటే నల్లటి మబ్బులూ కదులుతున్నాయి.

నాలుగు రోజులుగా అమ్మా నాన్నా ఏదో చర్చిస్తున్నారు. వాళ్ల మాటల్లో హైదరాబాదు పేరు తరచూ వింటూ వచ్చింది

లక్ష్మి. హఠాత్తుగా ప్రయాణం కట్టేసరికి దానికి ఆశ్చర్యం, ఆనందం ఒకేసారి కలిగాయి. అయినా తాము ఎందుకు వెడుతున్నారో, చెల్లెళ్లను యాదమ్మత్త ఇంట్లో వొదిలెయ్యడం ఎందుకో, వాళ్లు తమతో ఎందుకు రావడం లేదో మాత్రం తనకు అర్థం కాలేదు.

బైట వానజల్లు ఎక్కువైంది. కిటికీ అద్దం మూసివేశారు. లక్ష్మికి కోపం వొచ్చింది. కొంచెం తడిస్తే ఏమవుతుందో అనుకున్నది. వానజల్లు కిటికీ అద్దాన్ని మసకబారేట్లు చేయడంతో, బయట ఏమీ కనబడటంలేదు.

"ఇదిగో చెప్పేది విను. ముందుగానే కొంత తీసుకో. నెలనెలా పంపుతామన్నారుగదా? 'పోస్టుసార్' అడ్రసు తెచ్చావా? " అంటోంది సారమ్మ.

"నాకు తెలవదా? సారు అడ్రసూ తెచ్చినా. నెలనెలా ఆడికే పంపమని..." అన్నాడు పాపయ్య.

లక్ష్మికి వాళ్ళ మాటలు అర్థం కాలేదు. అర్థం చేసుకోవాలని ప్రయత్నమూ చేయలేదు. చెల్లెళ్లిద్దరూ తమతో రావటం లేదని మాత్రం దానికి బాధగా వుంది.

బైట వాన తగ్గడంతో అద్దం తెరవమని తండ్రిని గుంజింది. బైట పొలాలూ, చెట్లూ బాగా తడిసి తడిసి వున్నాయి. రోడ్ల పైన గుంటల నిండా నీళ్లు...

బస్సు రోడ్డుపక్క ఒక టీ దుకాణం వద్ద ఆగింది. ప్రయాణికులందరూ ఒకొక్కరే దిగుతున్నారు.

"చా తాగుతావా లచ్చమ్మా? " అడిగాడు పాపయ్య. లక్ష్మి తలూపింది. తండ్రి బస్సు దిగి వెళ్ళాడు.

"అమ్మా, మనం పట్నమెందుకు పోతున్నామే? " మొదటిసారిగా ప్రయాణం గురించి తల్లిని అడిగింది. ప్రయాణపు సంబరంలో ఆ ప్రశ్న అడగాలని తనకింత వరకూ తట్టనేలేదు.

## కొత్తగాలి...

**సూరీడు**
**రాకతో కాదు...**
**పిల్లలొచ్చాకే**
**మాబడిలో వెలుగు**

- పెరుగు సుజనారామం, నెల్లూరు

"పట్నం చూద్దామనీ- నీకు పట్నం చూడాలని లేదూ? "

లక్ష్మి ఆలోచించింది. అప్పటివరకూ తనని తినివేస్తున్న ప్రశ్నను తల్లి ముందుంచింది.

"మరి చెల్లెళ్లు ఎందుకు రావటంలేదు? ఆళ్లనీ తీసుకువస్తే బాగుండేదికదా? "

తల్లి విసుక్కుంది. "ఆళ్లనీ తెస్తే అందరికీ పైసలేడ నుంచొస్తాయి".

తల్లి సమాధానం లక్ష్మికి సంతృప్తికరంగా లేదు. 'ఆళ్లకు మాత్రం పట్నం చూడాలనుండదేంటి? ' అనుకుంది.

పాపయ్య రెండు ప్లాస్టిక్ గ్లాసుల్లో 'చా' తెచ్చాడు. చొక్కా జేబులోనుంచి బిస్కటు పాకెట్ తీసి లక్ష్మి చేతికిచ్చాడు. బస్సు ప్రయాణం- బిస్కట్లు చాయిలో ముంచుకు తింటుంటే లక్ష్మికి స్వర్గంలో వున్నట్లుంది.

బస్సు బయలుదేరింది. మెల్లగా లక్ష్మి నిద్రలోకి జారుకున్నది. బస్సు ఒక్క కుదుపు కుదిపి ఆగడంతో వులిక్కిపడి లేచింది. రోడ్డుకు అడ్డంగా నడుస్తున్న గేదెలు, వాటిని తోలుతున్న కుర్రాడిని బూతులు తిడుతున్నాడు డ్రయివర్.

లక్ష్మికి దిగులు పట్టుకుంది. చెల్లెళ్లను వొదిలి పోతున్నందుకు బాధ కలిగింది. తల్లిదండ్రుల మీద కోపమూ వొచ్చింది.

"అమ్మా, పట్నం నుంచి మనూరికి మళ్లా ఎప్పుడు తిరిగివొస్తాం? "

"అదేంటి? అక్కడ సినిమాలూ, పెద్ద పెద్ద కార్లూ, ఇళ్లూ, షాపులూ- ఎన్నో... అయన్నీ చూడవా ఏంది? ఇంకా చేరనే లేదు, మనూరెప్పుడు వెడదామంటావు?" అన్నాడు తండ్రి.

"ఆళ్లని కూడా తీసుకువొస్తే బాగుండేది గదా?" అని గొణిగింది.

"నోరు మూసుకోయే, మళ్లా అదేపాట" తిట్టింది తల్లి. నోరు మూసుకున్నది లక్ష్మి...

హైదరాబాద్ చేరుకునేసరికి మూడుగంటలు దాటింది. ఎండ ఎక్కువగా లేకున్నా వర్షం జల్లు తగ్గింది.

బస్సుదిగి ఒక ఆటో దగ్గరకు పోయి వెళ్లవలసిన అడ్రసు చెప్పాడు పాపయ్య. ఆటో బయలుదేరింది.

పెద్ద పెద్ద ఆకాశాన్నంటే యిళ్లూ, తళతళలాడే కార్లూ, నోరు తెరచుకుని చూస్తున్నది లక్ష్మి. స్కూలు డ్రస్సుల్లో వున్న పిల్లలు గుంపులుగా వీపుపైన బ్యాగులతో నడుస్తున్నారు. ఆటోలు, బస్సులు ఎక్కుతున్నారు. వాళ్లను నోరు తెరుచుకు చూస్తూ, "అమ్మా, ఆ పిల్లలంతా ఒకే మాదిరి గుడ్డలేసుకున్నారేం?" మళ్లా నోరు మూసుకొమ్మని తిట్టింది తల్లి, తనకు తెలియదని చెప్పకుండా.

"ఆళ్లు స్కూలు పిల్లలు బిడ్డా, ఒకే డ్రస్సు వేసుకోవాలి, అది రూలు" అని సందేహం తీర్చాడు ఆటోడ్రయివర్. ఆ డ్రస్సులో తనని ఊహించుకున్నది లక్ష్మి...

ఒక పెద్ద బిల్డింగు ముందు ఆగింది ఆటో. లక్ష్మిదిగి తలెత్తి చూసింది. ఆ ఇంటి నిండా కిటికీలే. ఇల్లు ఎంతో ఎత్తుగా ఆకాశాన్నంటుతున్నట్లు వున్నది. సామాను తీసుకుని దిగారు. ఆటోకి డబ్బులిచ్చి గేటు లోనికి నడిచారు. చుట్టూ వున్న ఎత్తయిన బిల్డింగుల్ని చూస్తూ అలాగే నిలబడిన లక్ష్మిని నడవమని కసిరింది తల్లి.

బెరుగ్గా నడుస్తూ గేటులోపలి కుర్చీలో కూర్చుని వున్న వాచ్‌మెన్‌ను కలిసి చేతిలోని కాగితాన్ని చూపాడు. గేటు బయటే నిలబడి వున్న తల్లికూతుళ్లను లోనికి రమ్మని సంజ్ఞ చేశాడు పాపయ్య. మెట్లెక్కసాగారు. ఎన్ని మెట్లో, ఎక్కుతూనే వున్నారు. అన్ని మెట్లు ఎక్కడం లక్ష్మికి సరదాగానే వుందిగాని తల్లి తిట్టుకున్నది.

కుడిపక్కనే వున్న తలుపు తట్టారు.

ఒక పెద్దావిడ తలుపు తెరిచింది. "ఎవరయ్యా, ఎవరు కావాలి?"

"సుదర్శనరావు సారుకోసం వొచ్చాం... నా పేరు పాపయ్యని చెప్పండి సారుతో"

హాల్లోనే కూర్చుని పేపరు చదువుకుంటున్న ఒకావిడ, "రావయ్యా రా, సారు చెప్పారులే- నిన్ను రేపు గదా రమ్మన్నది? ఈరోజే వచ్చావేం? రేపు సెలవు, సార్ ఇంట్లోనే వుండేవారు... ఈ పిల్లేనా? అలా కూర్చోండి" అన్నది.

"అవునమ్మగారూ, దీని తర్వాత మరో ఇద్దరు బిడ్డలు..."

లక్ష్మి ఆవిడవేపే చూస్తున్నది. దానికెందుకో ఆవిడంటే ఇష్టం కలగలేదు. చూడడానికి బాగానే వున్నదిగాని ముఖంలో కర్కశత్వం...

"సరే... ఇదిగో రాజమ్మా, వీళ్లకు 'చాయి' పెట్టియ్యి... నీ పేరు పాపయ్య కదూ? నేను బయటకుపోతున్నా. 'సారు' ఆరుగంటలకు వస్తారు. అన్నీ మాట్లాడుకో... పిల్ల బట్టలూ అవీ తెచ్చారా?"

ఆవిడ బల్లపైనున్న బ్యాగు తీసుకుని, బయటకు వెళ్లిపోయింది.

లక్ష్మి హాలంతా కలయజూసింది. ఒక పక్కగా పెద్ద సోఫాసెట్టు, మరోపక్క దివానూ, ఎదురుగా పెద్ద టి.వి.ని చూసి సంతోషంగా తల్లిని చూడమని గుంజింది.

"లోపలకు రండి" వంటావిడ వాళ్లను వంటగది పక్కనే వున్న బాల్కనీ లోనికి




## సువర్ణవస్త్రాలు

ఈ అమ్మడిలో మీకేం ప్రత్యేకత కన్పించడం లేదూ? అయ్యోరామ!
ఆమె ధరించిన దుస్తులు సాధారణమైనవి కావండీ బాబూ...
అక్షరాలా బంగారు నాణేలతో రూపొందించినవి. 12 లక్షల డాలర్ల ఖరీదుచేసే 1,500 ఆస్ట్రియా బంగారు నాణేలను ఉపయోగించి టోక్యోలోని ఓ ఫ్యాషన్ డిజైన్‌స్కూల్ విద్యార్థులు వీటిని తయారుచేశారు.
ఈ డ్రెస్‌కు మొత్తం 31కేజీల బంగారు నాణేలు పట్టాయట.

## కొత్తగాలి...

**కదిలితే**
**తూనీగ**
**కదిపితే**
**కందిరీగ-కవి**

-బద్దినాగేశ్వరరావు, అనకాపల్లి

తీసుకువెళ్ళింది. తల్లీ, తండ్రీ అక్కడే చతికిలబడ్డారు. లక్ష్మి బాల్కనీ గోడకు వంగి రోడ్డుపైకి చూసింది. అంత ఎత్తునుంచి చూస్తుంటే, రోడ్డుపైన మనుష్యులు చిన్నగా కనపడేసరికి దానికి నవ్వొచ్చింది.

టీ తయారుచేస్తూ రాజమ్మ మాట్లాడుతున్నది, "...ముగ్గురాడపిల్లలా? బాగానే వుంది. ఏంపెట్టి పోషిస్తావు? "

"ఏం చేయమంటారమ్మగారూ, వొద్దన్న కొద్దీ పుట్టుకొస్తారీ ఆడముండలు! ఒక మగపిల్లోడు పుట్టాలని ఆశ..."

"చాల్లేవయ్యా మగాడని చూస్తే ముగ్గురాడపిల్లలు పుట్టేశారు... ఇంతకూ ఆయనగారేం మాట్లాడారేం? " కప్పుల్లో టీ పోసి, సాసర్లలో పెట్టి అందించింది. లక్ష్మి కప్పు భద్రంగా అందుకుని జాగర్తగా సాసరులో పోసుకున్నది.

"ఏముందమ్మా, సంవత్సరానికి మూడు వేలు, తిండీబట్టా చూసుకునేట్టు, రోగం, రొష్టూ వొస్తే చూసుకుంటారుగదా, అదీ చెప్పాల్సిన పనేంది?... చెప్పు నాలుగయిదునెల్లకోసారి వొచ్చి చూసుకోమన్నారు. అయినా వొచ్చి చేసేదేముంది? పైసలు ఖర్చు, సారూవాళ్లు మంచోళ్లే. పిల్లను బాగానే చూసుకుంటారు. తమరు కూడా వున్నారు - పిల్లకేం భయం? "

లక్ష్మి తండ్రివేపు చూసింది- దానికి అర్థం కాకపోయినా, ఏదో తన గురించే మాట్లాడుకుంటున్నారనిపించింది.

కాళీ కప్పు పక్కనేవున్న వాష్ బేసిన్‌లో శుభ్రంగా కడిగింది. వాష్ బేసిన్‌లోని పంపు ఒకటి రెండుసార్లు నొక్కి నీళ్లు రప్పించి సంతోషించింది. తర్వాత మళ్లా బాల్కనీలోంచి రోడ్డు చూడసాగింది.

చీకటి పడింది. రాజమ్మ వంట ప్రయత్నాలు చేస్తుంటే, సారమ్మ, వూరి కబుర్లు చెపుతున్నది. పాపయ్య వింటూ కునికిపాట్లు పడుతున్నాడు. లక్ష్మి అక్కడే నేలమీద పడుకుని నిద్రలోపడింది.

కాలింగ్ బెల్లు మ్రోగడంతో లక్ష్మి వులిక్కి పడి లేచి, చుట్టూ అయోమయంగా చూసింది. కాసేపు ఏమీ అర్థం కాలేదు. తర్వాత మెల్లగా, తమ బస్సు ప్రయాణం తర్వాత ఆటోలో రావడం గుర్తుకు వొచ్చింది.

"అయ్యగారు వొచ్చారు" అంది రాజమ్మ గొంతు తగ్గించి. తర్వాత, "పోవయ్యా, పోయి కలిసిరా" అన్నది తను తలుపు తీయడానికి పోతూ.

పాపయ్య గభాల్న లేచి, పెళ్ళాన్ని కూడా రమ్మని, హాల్లోకి వొచ్చాడు. లక్ష్మి కూడా వాళ్ల వెంటే వొచ్చింది.

"ఏం, ఎప్పుడొచ్చారు? ఇల్లు కనుక్కోవడంలో కష్టమైందా? అయినా రేపొస్తానన్నావు గదా? " సుదర్శనరావు సోఫాలో కూర్చుని బూట్లు విప్పుకుంటూ లక్ష్మి వేపొకసారి చూశాడు.

పాపయ్య ఏదో గొణిగాడు. ఇంతలో రాజమ్మ కాఫీ తెచ్చి యిచ్చింది. తాగుతూ, లక్ష్మిని పిలిచాడు- "నీపేరేమిటి పిల్లా? ఇలా రా".

లక్ష్మి కదల్లేదు. తల్లికి అతుక్కుపోయింది. "ఏమిటయ్యా, మరీ ఒంట్లో వూపిరి లేనట్లున్నది. వయస్సు ఆరేడేళ్లుంటాయా? నీ పేరే లక్ష్మికాదూ? మాయింట్లో వుంటావా? రోజూ కలర్ టీవీలో సినిమాలు చూసుకోవొచ్చు, మా

పిల్లల్తో ఆడుకోవచ్చు. రోజూ రాజమ్మ చేసిపెట్టే టిఫిన్లు తిని బాగా బలవచ్చు" తను జోకుకు తనే నవ్వుకున్నాడు సుదర్శనరావు.

పాపయ్య నేలమీద గొంతుకూర్చుని, చేతులు నలుపుకుంటూ, "సార్, పిల్లదానికున్న నాలుగు గుడ్డలూ మూటగట్టితెచ్చా, అన్నీ పాతవి. చిన్న దొరసాన్ల గుడ్డలు పాతవి వుంటే యిప్పిస్తే- మరి చీకటి పడిపోతోంది సార్, మేం బయలుదేరతాం.." అన్నాడు ఆరోజుకు అక్కడే పడుకుని తెల్లవారాక వెళ్లమంటాడేమోనని ఆశపడుతూ. ఆయన సరే, వెళ్లమన్నట్లు తలవూపాడు. సారమ్మ మొగుడి చెయ్యి గుంజింది.

"సరే, ఇవి ఖర్చులకు వుంచుకో" అంటూ పర్సులోంచి అయిదు వొందలు తీసి యిచ్చాడు ఇంటాయిన. అది అందుకుంటూ, బుర్ర గోక్కుంటూ, "వూళ్లో అప్పులున్నాయి సార్, మరో వెయ్యి ఇప్పిస్తే..." అని గొణిగాడు.

"అనుకున్నదంతా ముందే యిచ్చా, నెలకో రెండు నెలలకో ఏదో పంపుతాలే..."

పాపయ్య కదల్లేదు. ఆయన విసుక్కుంటూ మరో అయిదొందలు తీసియిచ్చాడు. "పోస్టుమాస్టర్ అడ్రసు తెచ్చావా?" పాపయ్య ఇచ్చిన కాయితం ముక్క చూసుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు.

పాపయ్య లక్ష్మి భుజం మీద చెయ్యివేసి "చూడు, మంచి పిల్లవికదా, నువ్వీడనే వుండాలి. మంచిగా తిండి పెడతారు, బట్టలిస్తారు, చదివిపిస్తారు. నేను వొచ్చి చూసిపోతూవుంటా, యేం?" అంటూ లేచాడు.

లక్ష్మికి ఏమీ అర్థం కానట్లు తండ్రి మొహంలోకి చూసింది. దానికి విషయం అర్థమైంది. తనిక్కడ ఎందుకుండాలి? అమ్మావాళ్లు తనను ఇక్కడ ఎవరింట్లోనో ఎందుకు వొదిలి పోతున్నారు? ఆ విషయం మాత్రం దానికి అర్థం కాలేదు.

తల్లీదండ్రీ రాజమ్మ దగ్గర సెలవు తీసుకుని బైటకు వెడుతుంటే, తనూ వాళ్లవెంట బయలుదేరింది.

పాపయ్య ఆగి కళ్లెర్రజేసి, "నువ్వేడకే? చెప్పింది అర్థం కాలేదా? అమ్మగారు చెప్పినట్లు విను. అల్లరి చేశావా? నా సంగత్తెల్సుగా? తోలూడగొడ్తా..."

లక్ష్మి వెళ్లిపోతున్న తల్లిదండ్రుల్ని పిచ్చిదానిలా చూస్తూ, వాళ్లు మెట్లు దిగిపోగానే పెద్దగా ఏడవసాగింది. రాజమ్మ పట్టుకున్నది.

"పెద్దగా ఏడవకు, అయ్యగారు కోపం తెచ్చుకుంటారు" అని దాని తల నిమురుతూ లోపలకు తీసుకువెళ్లింది.

బాల్కనీ గోడకానుకుని కూర్చుని ఓ గంటసేపు ఏడిచింది. "ఇంక ఏడుపు ఆపు, అన్నం తిను" ఒక ప్లేటులో అన్నం కూర వేసి దాని పక్కనే పెట్టింది. లక్ష్మికి అన్నం చూడగానే ఆకలి గుర్తుకొచ్చింది. ఏడుపు తాత్కాలికంగా వాయిదావేసి అన్నం గబగబా తినేసింది. ప్లేటు కడిగిపెట్టి మళ్లా కూర్చుంది.

దానికి ఒక విషయం స్పష్టమయింది. ఇంక తను యిక్కడే వుండాలి. అమ్మనీ, నాన్ననీ, చెల్లెళ్లనూ ఎప్పుడన్నా చూడడానికి వీలుంటుందేమో! చెల్లెళ్లు గుర్తుకురాగానే మళ్లా దానికి ఏడుపు ముంచుకొచ్చింది. తను ఎంత ఏడిచినా తనను తల్లీతండ్రీ వొచ్చి తీసుకుపోరు. తనని వీళ్లకు ఇచ్చేసారు, డబ్బు తీసుకున్నారు కూడా. అందువల్ల వీళ్లు తనని పంపెయ్యరు. అదే దానికి అర్థం అయింది.

లక్ష్మికి వాస్తవం తెలిసిరాగానే బాధ మిగిలిందిగాని ఏడుపు తగ్గింది. ఎంత ఏడిచినా పరిస్థితి మారదు. బెల్లు మోగింది. రాజమ్మ తలుపు తెరిచింది. జానకి లోపలకు వొస్తూ, "వాళ్లు వెళ్లిపో

యారా? " అని అడిగింది. వాళ్లు వెళ్లిపోయారనీ, పిల్ల ఇక్కడే వుందనీ తెలుసుకున్నాక, "దానికి తినడానికేమైనా పెట్టావా? " అడిగింది.

"లక్ష్మీ, అమ్మగారు పిలుస్తున్నారు యిలారా"

లక్ష్మిని పరీక్షగా చూసింది. "లక్ష్మీ, ఇక నుంచీ నువ్వు ఇక్కడే వుండాలి. చెప్పిన పనులన్నీ చెయ్యాలి. ఎదురు మాట్లాడకుండా అన్నీ పనులూ చేసుకో- కప్పులూ అవీ పగలకుండా చూసుకోవాలి... ఏం? "

తొమ్మిదేళ్ల పిల్లకు అంతకంటె వివరాలు తెలియనవసరం లేదు.

"అన్నం తిన్నావా? ఆ కిచెన్ పక్కనే చాప వేసుకుని పడుకో... రాజమ్మా, బీరువాలో పాత బెడ్‌షీట్ ఒకటి తీసి యియ్యి... ఇంక నువ్వెళ్లు, రేపు కొంచెం త్వరగా రావాలి. రేపు ఎవరో వస్తారు, టిఫిన్లవీ చూడాలి. దీనికి అన్నీ పనులూ నేర్పు... నాలుగు రోజుల్లో అన్నీ నేర్చుకుంటుందిలే..."

రాజమ్మ చేతిసంచిలో కారియర్ పెట్టుకుని, కిచెన్‌కు తాళం వేసి, యజమానురాలికి ఇచ్చింది. బయటకు నడుస్తూ, లక్ష్మి వేపు చూసింది. "రాత్రి భయంవేస్తే ఆ చిన్న లైటు వేసుకో" లైటు ఎలా వేయాలో చూపింది.

జానకి బాత్‌రూములోనుంచి వొచ్చి ఫోంచేసి "చిన్నబాబూ, పాప కనుపించారా? " అని అడిగింది.

లక్ష్మికి ఆ ప్రశ్న అర్థంకాక అలాగే చూస్తూ నిలబడింది. ఆవిడ లైట్లన్నీ ఆర్పి బెడ్‌రూంలోకి వెళ్లిపోయింది.

మెల్లగా వొచ్చి చాపమీద కూర్చున్నది. కటిక చీకటి, వీధిదీపాల వెలుగు కూడా రాకుండా తలుపులన్నీ బంధించేశారు. చీకట్లో తన చుట్టూ ఎవరో కూర్చున్నట్లు దానికి భయం వేసింది. ధైర్యం తెచ్చుకుని లేచి లైటు వేసింది. గదిలో వెలుగు కొంచెం రావడంతో భయం తగ్గింది. లైటు ఆర్పి మళ్లా వేసింది. దానికేదో ఆనందం కలిగింది.

"ఏమే, లైట్లతో ఆడుకోక, పడుకో" అని కేక వేసింది యజమానురాలు.

లక్ష్మి గబుక్కున లైటుతీసి పోయి పడుకుని కళ్లు మూసుకున్నది.




**పొ**ద్దున్నే అలవాటుగా లక్ష్మికి అయిదు గంటలకే మెలకువ వచ్చింది. లేచి కూర్చుని, ఏం చెయ్యాలా అని ఆలోచించింది. ఇక్కడ ఊడిచి, నీళ్లు చల్లడం, ముగ్గెయ్యడం వుండవేమో-

ఏం చేయాలి? మళ్లా ఒక్కనిమిషం 'ఇంటి'మీదకు బెంగ మళ్లింది. మళ్లా ఆ ఆలోచన పోయింది. లేచి బాల్కనీలో నిలబడి వొంగి రోడ్డుమీద వొచ్చేపోయే జనాన్ని చూస్తూ నిలబడింది. మెల్లగా వీధిలో జనసమ్మర్థం ఎక్కువవుతున్నది. స్కూటర్లూ, పాలవాళ్ల సైకిళ్లూ, పేపరు వాళ్లూ...

"ఏయి, ఎవరు నువ్వు? "

ఉలిక్కిపడి వెనక్కు తిరిగింది. తన ఈడు పిల్లే. నైట్‌డ్రెస్‌లో కళ్లు నలుపుకుంటూ నిలబడి వున్నది.

"ఎవరంటే మాట్లాడవేం? "

"నేను లక్ష్మిని"

"ఇక్కడెందుకున్నావు? "

దానికేం జవాబివ్వాలో తెలీలేదు.

"ఏవిటి బేబీ" అంటూ తల్లి వొచ్చింది. "ఇది లక్ష్మి, మనింట్లోనే వుంటుంది. పనులు చేస్తూ వుంటుంది... ఏమిటే అలా నిలబడ్డావు? అంట్లుతోము- అక్కడ సబ్బూ అవీ వున్నాయి. శుభ్రంగా తోమాలి"

"ఏమిటి మమ్మీ ఈ పల్లెటూరి మొద్దును తెచ్చారూ? " అంటూ గారాలు పోతోంది కూతురు.

లక్ష్మి కిచెన్ వెనక పంపు దగ్గర వున్న గిన్నెలు చూసి భయపడిపోయింది 'ఇన్ని అంట్లా? తమ ఇంట్లోవి నాలుగు సత్తుగిన్నెలు, వీళ్లు ఇన్ని గిన్నెల్లో వండుకుంటారా? ఏమేం తింటారోనని దానికి ఆశ్చర్యం వేసింది. వాళ్లు తినే తిండి దాని వూహకందలేదు.

అంట్లలో ముందు నీళ్లు పోసుకోవాలి, ఈలోగా ఇల్లు చిమ్మాలి- శుభ్రంగా తోమిన అంట్లు కిచెన్ ఫ్లాట్‌ఫాంమీద జాగర్తగా వుంచి, తర్వాత సంగతి తర్వాత తెలుస్తుంది...

హాల్లోంచి ఎడమచేతివేపు బెడ్‌రూమ్‌లోనికి వెళ్లింది. ఇంకా 'పెద్దయ్యగారు' నిద్రపోతూ వున్నాడు. ఆ గదిలో వున్న టీపాయ్, డ్రెస్సింగ్ టేబులూ, వార్డ్‌రోబ్‌లూ, టెలిఫోనూ, టేబుల్ లైట్సూ- వగైరా సామాన్లు ఒక్కొక్కటే చూసింది.

వెనకే వొచ్చిన 'అమ్మగారు' అరిచింది. "ఏమిటే దిక్కులు చూస్తావు, త్వరగా కానీ... ఇంకా చాలా పనులున్నాయి"

ఆ నున్నటి నేల వూడవడం దానికి సరదా అనిపించింది. శుభ్రంగా వూడ్చి తన పనికి తనే మురిసిపోయింది. బయటకు వొచ్చి ఎదురుగా వున్న గదిలోకి తొంగిచూసింది. తనకంటె కొంచెం పెద్ద కుర్రాడు మంచంమీద అడ్డదిడ్డంగా పడుకుని గుర్రు కొడుతున్నాడు. గదినిండా బొమ్మల పుస్తకాలూ, చిన్న రేడియో, ఒక పక్క మ్యూజిక్ సిస్టమ్, ఏ మూల చూసినా చిందరవందరగా పడివున్న బట్టలూ అవి తీసి ఒక కుర్చీలో పెట్టింది. వెనకే వొచ్చిన అమ్మగారు, "అవి కుర్చీలో పెట్టకు, షర్టులూ, లాగులూ తీసి బాల్కనీలో వాషింగ్ మెషిన్ వున్నది కదా.. దానిలో వెయ్యి- నేనొచ్చి ఆన్ చేస్తా. మిగిలినవి బక్కెట్లో నానబెట్టు. వాటిని తర్వాత వుతుకు" చెప్పి వెళ్లింది.

ఆ గదీ, ఆ పక్క రూమూ వూడ్చేసరికి కాళ్లూ, చేతులూ నెప్పిపుట్టాయి. పదడుగులు కూడా లేని గుడిసె వూడవడానికి అలవాటు పడిన చేతులు! తర్వాత హాలు- దాని పనిని ఒక కంట కనిపెడుతూనే వుంది యజమానురాలు...

బాల్కనీ వూడ్చేసరికి నడుం పట్టేసింది. ఒళ్లు విరుచుకుంటుంటే వొచ్చి, "అయిందా? ఇంక గిన్నెలు కడుగు. శుభ్రంగా కడగాలి. కప్పులు జాగ్రత్త..." అని హెచ్చరించింది. అన్ని గిన్నెలూ ప్లేట్లూ చూసేసరికి లక్ష్మికి కళ్లు తిరిగాయి. తామూ నలుగురే, వీళ్లూ నలుగురే. తమ గుడిసెలో అన్నీ కలిపి నాలుగు సత్తు గిన్నెలు, రెండు సత్తు కంచాలూ- వీళ్లకు ఇన్ని గిన్నెలెందుకో? రోజూ అన్ని గిన్నెల్లోను వొండుకుంటారా? దానికి ఆశ్చర్యం కలిగింది.

ఎంతసేపు కడిగినా పని కావడంలేదు. తోమి, తోమి చేతులు కందిపోయాయి. భుజాల దగ్గరనుంచీ మణికట్టు దాకా ఒకటే నొప్పి! పని పూర్తయ్యేసరికి దానికి ఒక యుద్ధం చేసినంత కష్టం కలిగింది.

ఇంతలో ఉరుములాంటి గొంతు విని వులిక్కిపడింది. "ఎంతసేపు ఆ పని? ఇంకా ఇల్లు తుడవాలి, బట్టలుతకాలి- అయ్యగారు లేచేసరికి ఆ పనులన్నీ అయి

## కొత్తగాలి...

**నర్స్**
**పర్స్ చూడదు**
**పల్స్**
**చూస్తుంది**

*-దూసి నీహారిక, అరసవిల్లి*

పోవాలి. 'సారు'కు కోపం వొచ్చిందంటే బెల్టు తీస్తారు..." అని హెచ్చరించింది అమ్మగారు.

లక్ష్మికి చివరి వాక్యం అర్థం కాలేదు. 'బెల్టు తీయడమేమిటి? తీసి ఏం చేస్తారు?' అనుకుంది అంతలో. ఇంకా ఇల్లు తుడవాలి, అన్న మాట గుర్తుకువొచ్చింది. ఆవిడ చెప్పినట్లే బక్కెట్లో ఏదో మందు వేసి, మోకాళ్లమీద కూర్చుని ఒకొక్క గదీ తుడవసాగింది. "ఇంకా కాలేదా మొద్దూ? ఎక్కడ దొరికిందో- త్వరగా తగలడు, పని శుభ్రంగా చెయ్యి" అన్న అమ్మగారి అరుపుల మధ్య పని ముగించింది.

ఒళ్లు హూనమయిపోయింది. ఒక్క క్షణం వూపిరి పీల్చుకునే లోగానే, "ఆ బట్టలు తీసి బక్కెట్లో వేసి, పౌడరు వెయ్యి..." అని కేక పెట్టింది జానకి.

ఆ పని కూడా ముగించేసరికి చిన్న పనులేవో చేయవలసిరావడం, తర్వాత బట్టలు వుతికి, ఆరేసి, వంటింట్లో చతికిలబడింది. ఈ పనులన్నీ ముగిశాక, దాని వొంట్లో ఏ మాత్రం ఓపిక మిగల్లేదు.

రాజమ్మ చేతిసంచీ పక్కన బెట్టి, పాల పాకెట్లు తీసుకుని, స్టవ్ వెలిగించింది.

జానకి వచ్చింది.

"టిఫిన్ ఏం చేస్తావు? ఈరోజు ఆడబిడ్డా వాళ్లు వొస్తున్నారు. ఉప్మా చెయ్యి, టొమాటాలు వేసి... ఏయి పిల్లా, అట్లా మొద్దల్లే కూర్చోక రాజమ్మకు సాయం చెయ్యి... ఒట్టి పల్లెటూరి మొద్దు, ఏపనీ చేతగాదు" విసుక్కుంటూ లోపలకు పోయింది అమ్మగారు.

ఒక్క క్షణం అలాగే నిలబడింది లక్ష్మి. ఆ ఇంట్లో అడుగుపెట్టి ఒక్కరోజైనా కాకుండానే, తన భవిష్యత్తు ఎలా వుండబోతున్నదో గ్రహించగలిగింది. తన బతుకు పూర్తిగా ఈ ఇంట్లో మనుష్యుల దయాదాక్షిణ్యాలపైనే ఆధారపడి వుందనీ, వాళ్లు కొట్టినా తిట్టినా తనకు మరోదారి లేదనీ- ఎవరూ చెప్పకుండానే దాని చిన్న బుర్రకు ఎలాగో తట్టింది.

వంటపనిలో వున్న రాజమ్మకు చిన్న చిన్న పనులు చేసిపెడుతూ, ఆవిడ ఇచ్చిన 'చాయి' తాగింది. దానికి ఒక్క విషయం మాత్రం ఆనందం కలగజేసింది- రెండు మూడుసార్లు 'చా' తాగడం!

"రాజమ్మా, బోర్నవిటా" తుపానులా వొచ్చి అరిచాడు రోహిత్.

"హాల్లో కూర్చో బాబూ, పంపిస్తా"

గుండ్రంగా, నున్నగా, చిన్న బొజ్జతో వున్న 'చిన్నయ్యగారి'ని చూసి లక్ష్మికి నవ్వొచ్చింది.

"ఏయ్, ఎవర్నువ్వు? ఎందుకున్నావిక్కడ?" అధికార స్వరంతో దబాయించాడు లక్ష్మి వంక చూస్తూ.

"ఈ పిల్ల లక్ష్మి బాబూ, పనికి కుదిరింది"

"ఛీ, మురికివాసన. ఫో, వెళ్ళి స్నానం చేసిరా.. కంపు. రాజమ్మా.. దానికి మంచిగా స్నానం చేయించి, శుభ్రంగా వుంచు.. ఛీ ఛీ" అసహ్యించుకుంటూ వెళ్ళాడు.

రాజమ్మ స్టవ్ ఆర్పి, లోపలకు వెళ్లి, ఏవో బట్టలు తీసుకువచ్చింది. లక్ష్మిని బాత్‌రూంలోకి తీసుకుపోయి సోపు, టవలూ ఇచ్చి వెళ్ళింది.

# అమెరికాలోని తొలి కాలనీ




అమెరికాలోని అతి ప్రాచీన నగరం న్యూయార్క్... కానీ యూరోపియన్స్ అమెరికాలో మొదట కాలుపెట్టిన ప్రదేశం న్యూయార్క్ కాదు. అది సెయింట్ అగస్టిన్!

కొలంబస్ అమెరికాని కనిపెట్టాక 1493లో స్పెయిన్ నుంచి డాన్ జువాన్ పాన్స్ డి లియోన్ అమెరికాకి వచ్చినప్పుడు ఫ్లోరిడా రాష్ట్రంలోని సెయింట్ అగస్టిన్ తీరంలోని భూభాగంలో అడుగు పెట్టాడు. అప్పటి నుంచి స్పెయిన్ దేశస్థులు అమెరికాలోని ఆ ఓడరేవుకే రావడం మొదలుపెట్టారు. పాన్స్ మొదటిసారి వచ్చిన రోజు సెయింట్ అగస్టిన్ ప్రీస్ట్ డే కావడంవల్ల అక్కడ ఏర్పాటు చేసుకున్న చిన్న వలస కాలనీకి సెయింట్ అగస్టిన్ పేరు పెట్టాడు.

నేటికీ సెయింట్ అగస్టిన్ యూరోపియన్ గ్రామంలాగే ఉంటుంది. చాలా రోడ్లమీద 'సిన్స్ 1690' అనే బోర్డులు కనిపిస్తాయి. అక్కడి ఇళ్లు కూడా యూరోపియన్ పద్ధతిలో నిర్మించినవే. ఇప్పటికీ అక్కడ యూరోపియన్ సంస్కృతే ప్రబలంగా ఉంది. స్పెయిన్ దేశస్థులే అక్కడ అధికం.

సెయింట్ అగస్టిన్‌లోని 'ది ఫౌంటెన్ ఆఫ్ యూత్ నేషనల్ ఆర్కియోలాజికల్ పార్క్' ఉన్న ప్రాంతంలోనే తొలిసారిగా పాన్స్ కాలు పెట్టాడు. అతడు ఆ మొత్తం ప్రాంతానికి లా ఫ్లోరిడా అనే పేరు పెట్టాడు. ఎందుకంటే అతను వచ్చిన సమయంలో స్పెయిన్‌లో ఈస్టర్ పండుగ జరుగుతోంది. స్పానిష్ భాషలో దాన్ని 'ఫీస్ట్ ఆఫ్ ఫ్లవర్స్' అంటారు. అందుకనే స్పానిష్ భాషలోని పువ్వు అనే పదమైన 'ఫ్లోరిడా' పేరు ఆ ప్రాంతానికి పెట్టాడు. అదే సెయింట్ అగస్టిన్ ఉన్న ఫ్లోరిడా రాష్ట్రం పేరయింది. అదే సమయంలో ఇంగ్లండ్ నుంచి కూడా కొందరు నావికులు అమెరికాలో మరో ప్రాంతానికి వచ్చారు. కానీ అప్పటికే పాన్స్ అమెరికా భూభాగాన్ని ఈ తీరం నుంచి అవతలి తీరం దాకా స్పెయిన్ రాజుకు చెందినదిగా ప్రకటించేశాడు.

ఇప్పటికీ స్పెయిన్ దేశాచారాల్ని అమెరికన్స్ తమ ఆచారాలుగా ఆచరించడానికి కారణం మూడు శతాబ్దాలపాటు స్పానిష్ ప్రజల నుంచి వాటిని నేర్చుకోవడమే!



సెయింట్ అగస్టిన్‌కి పాన్స్ వచ్చినప్పుడు ఉన్న రెడ్ ఇండియన్స్‌ను, అతని వెంట వచ్చిన క్రైస్తవ మతాధికారులు తమ మతంలోకి మార్చారు. అందుకు గుర్తుగా ఖననం చేసిన వారి శవాలు తవ్వకాల్లో దొరికాయి. రెడ్ ఇండియన్స్‌కు శవాలను తగలబెట్టే ఆచారం ఉండేది.

అమెరికాని సందర్శించే వారిలో అతి తక్కువమంది సెయింట్ అగస్టిన్‌ను సందర్శిస్తారు. కారణం దీని గురించి విస్తృత ప్రచారం లేకపోవడమే. అక్కడ అనేక మ్యూజియాలు, చారిత్రాత్మక కోట దర్శించదగ్గవి.



బాత్‌రూంను చూసి లక్ష్మికి నోటమాట రాలేదు. నేల, గోడలు చేతితో తాకి చూసింది. పంపులోంచి నీళ్లు రావడం చూసి ఆనందించింది. తన వూరిలో కూడా ఇలా నీళ్లు వొస్తే వానలో, మండే ఎండలో వూరి చెరువు కాడికి పోయి నీళ్లు తేవక్కర్లేదుగదా అనుకున్నది. పట్నంలో వుండే మనుష్యులు, వూరి మనుష్యుల్లాంటి వారు కాదు అనిపించింది లక్ష్మికి...

స్నానం చేసి గుడ్డలు వేసుకుని హాల్లోకి వొచ్చిన లక్ష్మిని ఎగాదిగా చూశాడు రోహిత్.

"ఏమిటా చింపిరి జుట్టు? స్నానం చేసే ముందు తల దువ్వుకోవడం తెలీదు? అడివి మృగం..." అని తిట్టాడు.

టిఫిన్ ప్లేటూ, మంచినీళ్లూ తెచ్చి టీపాయ్ మీద పెట్టింది రాజమ్మ.

"పల్లెటూరిది బాబూ, నాలుగు రోజులైతే అన్నీ నేర్చుకుంటుంది. భయపెట్టకు"

"భయపెట్టకపోతే మాట వింటారా?




వీళ్లను భయభక్తుల్లోనే వుంచాల" చిన్న వయస్సులోనే ఎంతో జ్ఞానం సంపాదించిన రోహిత్‌ను వింతగా చూసింది రాజమ్మ.

ఒక్కొక్కరే తయారై వొచ్చారు హాల్లోకి. అందరికీ టిఫిన్లు అందించారు రాజమ్మా, లక్ష్మి.

"ఈరోజు ప్రోగ్రాం ఏమిటి డాడీ" అడిగింది బిందు.

"ఈ రోజు అత్తా వాళ్లొస్తున్నారు, ఎక్కడికీ పోయేది లేదు"

"ఈ అత్తయ్య వాళ్లకు బుద్ధిలేదు. సన్‌డే వేస్టు..." అన్నాడు రోహిత్ విసుక్కుంటూ.

"పెద్ద వాళ్లను అలా అనకూడదు నాన్నా- రాజమ్మా, టిఫిన్లు వేడిగా వుంచు, కాఫీ వాళ్లొచ్చాకే చెయ్యొచ్చు" అన్నది జానకమ్మ.

"ఏయ్, నీకిక్కడేం పని? పో అవతలకి" అత్తయ్య వాళ్లమీద కోపం లక్ష్మిపైన చూపాడు రోహిత్.

లక్ష్మి మెల్లగా పోయి బాల్కనీలో నిలబడింది రోడ్డుమీది జనాన్ని చూస్తూ.

దానికి మరోసారి 'ఇల్లు' గుర్తుకువొచ్చింది. చెల్లెళ్లు ఎలా వున్నారో, చిన్నచెల్లి కాలు చచ్చుబడి నడవలేదు. తనే దాన్ని ఎత్తుకుని బయటకు తీసుకుపోవాలి. లక్ష్మికి ఏడుపు వొచ్చింది. అమ్మావాళ్లు ఇలా ఎందుకు చేశారో? ఇంటి పనంతా తనే చేసేది గదా, బట్టలు కావాలని, మంచి తిండి కావాలని పేచీ పెట్టేది కాదు. పేచీ పెట్టినా తన్నులు తినటం తప్ప ఒరిగేదేమిటి? చెల్లెళ్లకు నీళ్లు పొయ్యడం, తిండి పెట్టడం- అన్ని పనులూ తనే... అయినా కూడా తనను ఇక్కడ వొదిలేశారు. తను ఎప్పటికీ, చచ్చేదాకా ఇక్కడే వుండాలేమో? ఇంక ఎప్పటికీ తనవాళ్లను చూడనియ్యరేమో?

"ఏం చేస్తున్నావే? వొచ్చి ఆ ప్లేట్లు కడిగిపెట్టు. రాజమ్మకు సాయం చెయ్యి. నిన్ను వూరికే మేపడానికి కాదు ఇక్కడ పెట్టింది" అరిచింది యజమానురాలు.

"ఎక్కడో పల్లెటూరి మొద్దుని తెచ్చారు. ఓ శుభ్రత తెలీదు, ఏ పనీ చేతగాదు" భర్తను విసుక్కున్నది.

"పట్నం పిల్లలు తెలివిమీరి వుంటారు, ఎదురు తిరిగి మాట్లాడటమేకాక ఇంట్లోని వస్తువులు పట్టుకుని వుడాయిస్తారు... దీనికి భయం వుంది. చెప్పిన పనులన్నీ చేస్తుందిలే నాలుగు రోజులాగితే..." అన్నాడు సుదర్శనరావు.

బెల్లు మోగింది.

"రా వొదినా, పిల్లల్ని తీసుకురాలేదేం? రండి, అన్నయ్యగారూ" ఆహ్వానించింది.

"బావున్నారా బావగారూ" బావమరిదిని పలకరించాడు సుదర్శనరావు.

లక్ష్మిని చూసి ఎవరని అడిగింది ఆడపడుచు. కొత్తగా పన్లోకి వొచ్చిందని, ఇక్కడే వుంటుందని తెలుసుకుని అన్నను అభినందించింది.

"మంచిపని చేశావన్నయ్యా. ఇంత తిండీ, నాలుగు పాత బట్టలూ పారేస్తే చాలు- గాడిద చాకిరీ చేస్తారు. కాని మరీ వయస్సు తక్కువల్లే వుంది...? "

"చిన్న పిల్లయితేనేం, చెప్పిన పనంతా మాట్లాడకుండా చేస్తుంది. పైగా వూరినుంచొచ్చింది... నోర్మూసుకు పడుంటుంది" అన్నది జానకి తర్వాత-

"నాలుగు రోజులాగు, దానికి వంటపని కూడా నేర్పిస్తా చూడు"

రాజమ్మకూ, లక్ష్మికీ గుండెలు ఝల్లుమన్నాయి. తన వుద్యోగం పోతుందేమోనని రాజమ్మకూ, వంటపని కూడా తనచేత చేయిస్తారేమోనని లక్ష్మికీ భయం వేసింది.

"ఛా, దానిచేత వంట చేయిస్తావా? ఏ కులమో పాడో? " అన్నాడు సుదర్శనరావు. ఆ మాటతో లక్ష్మికి కొంచెం భయం తగ్గింది.

రాజమ్మకు కూరగాయలు కడిగి యిస్తూ, "అమ్మగారూ, మీ యిల్లెక్కడ? ఎవరెవరుంటారు? " అడిగింది.

"ఎవరూ లేరు, ఒక్కదాన్నే... వొక్క కొడుకూ పెళ్లి చేసుకుని వేరే వుంటున్నాడు. ఎప్పుడయినా వొచ్చి చూసి పోతూవుంటాడు. వాడికి ఇద్దరు ఆడపిల్లలు- ఏదో చిన్న వుద్యోగం, వచ్చేది వాడికే చాలదు..."

ఆయన తల్లి దగ్గర ఎందుకుండడో అర్థంకాక అడుగుదామనుకుని, భయపడింది.

"...రెండో పిల్లది నీ వయస్సే వుంటుంది"

లక్ష్మి ఆలోచించింది. తనకెన్నేళ్లో?

"నీ వయస్సెంతుంటుందే పిల్లా? వీళ్ల పుట్టినరోజు ఎంత ఆర్భాటంగా చేస్తారనుకున్నావు? రంగు కాయితాలూ,

బెలూన్లూ, కేకులూ- రోహిత్ బాబుది వొచ్చే నెలలో పుట్టిన రోజు. నువ్వే చూస్తా వుగా... ఆ లైట్లూ, కొవ్వొత్తులూ, పాటలూ..." రాజమ్మ చెబుతోంది.

లక్ష్మి నోరు తెరుచుకు వింటున్నది. పుట్టినరోజు పండగ చేస్తారా? పిల్లలంతా రావడం, కేకులూ, భోజనాలూ, డాన్సులూ, పాటలూ- రాజమ్మ చెప్పేది వింటుంటే దానికి వీళ్లు అసలు తనలాంటి మనుష్యు లేనా? లేక దేముళ్లా? అనే అనుమానం కలిగింది. వీళ్లు వేరు, తాము వేరు- అనే నమ్మకం రోజు రోజుకూ బలపడుతున్నది.

"ఆ రెండు గిన్నెలూ కడిగి తీసుకురా. వీళ్లు ఇంట్లో మాంసం తినరు. బైట హోట ళ్లల్లో మళ్లా తింటారు అన్నీ. అదేమిటో... ఈ వుప్మా తిను... ఆకలెయ్యడం లేదూ? "

ఈవిడ మాత్రం తనలాంటి మనిషే ననుకున్నది లక్ష్మి.

ఇంతలో లోపల్నుంచి అరుపులు -తిన బోతూ మానేసింది...

"మమ్మీ, క్రికెట్ బాల్ కనబడటం లేదు. పొద్దునే ఆ 'పీనుగ గది వూడ్చింది. అదే కొట్టేసి వుంటుంది. దానికి నాలుగు తగిలించాలి"

"ఊరుకో అదేం చేసుకుంటుంది? చూడు ఎక్కడో వుంటుంది" అంటున్నది తల్లి.

"నీకు తెలీదులే, వుండు దాని సంగతి..." తల్లి ఆపుతున్నా వినిపించుకో కుండా, కిచెన్‌లోకి వొచ్చి లక్ష్మి జుట్టు పట్టుకున్నాడు రోహిత్.

"దొంగముండా, చెప్పు ఎక్కడ పెట్టావో? నా చేతిలో చచ్చావే..."

రాజమ్మ విడిపించింది.

"ఏవిటి బాబూ, ఆదేం చేసుకుంటుంది? పద, నేను వెతుకుతాను"

బిందు వొచ్చింది. "ఇదుగో.. నీ బాల్, నా రూములో మరిచిపోయావు" అంది.

తప్పు కప్పి పుచ్చుకుంటూ, "అయినా నేను నిద్రపోతున్నప్పుడు అది నా గదిలోకి ఎందుకు రావాలి? " అంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

లక్ష్మికి పెద్దగా ఏడుపు రాలేదుగాని ఎందుకో భయం వేసింది. తన యింట్లో తప్పు చేసినా, తల్లి చేతిలో దెబ్బలు తినవ లసి వస్తుందని తెలిసినా ఇలాంటి భయం అది ఎరగదు...

అతిథులు లేచారు. భార్యాభర్తలు అభ్యంతరం చెప్పారు, భోజనాలు చేయ కుండా వెళ్లడానికి వీల్లేదన్నారు. మరో గంటలో భోజనాలు రెడీ అవుతా యన్నారు.

"లేదు బావగారూ, మావయ్యగారింటికి పోవాలి. ఒక్క ఆదివారంనాడే వీలు. అందర్నీ కలవాలి. ఈసారి తప్పకుండా.."

అతిథులు వెళ్లాక ఇంట్లో నిశ్శబ్దం... హాలు ఖాళీ అయింది. రోహిత్ గదిలోంచి పెద్దగా 'మ్యూజిక్' వినబడుతున్నది. అన్నా చెల్లెళ్లు ఏదో వాదించుకుంటున్నారు, తల్లి సర్ది చెపుతున్నది.

"లక్ష్మి, వంట అయ్యాక బజారుకు పోయివద్దాం..."

దానికి వుత్సాహం కలిగింది. సరేన న్నట్లు తలూపింది. పట్నం చూడబోతు న్నాననే ఆనందంలో జరిగిన విషయం మరిచిపోయింది.

వంట ముగించి, అన్నీ డైనింగ్ టేబుల్ పైన సర్ది, "జానకమ్మగారూ, వంటయింది. మేము బజారుకు పోతున్నాం" లోపలకు వినబడేలా చెప్పింది రాజమ్మ.

ఆవిడ బయటకు వొచ్చి డబ్బు యిచ్చింది.

"మంచివి ఏరి తీసుకురా, క్రితంసారి వంకాయలన్నీ పుచ్చులే..." అలా వంకలు పెట్టకపోతే పనివాళ్ళు చెప్పిన మాట విన

రని ఆవిడ నమ్మకం.

బయటకు వొచ్చి లిఫ్టులోకి ఎక్కారు. అది కదలగానే భయపడి రాజమ్మను గట్టిగా పట్టుకున్నది. పట్నం బాగుంది అనుకున్నది. లిఫ్టు ప్రయాణం సరదాగా వుంది...

"అమ్మగారూ, ఈ లిఫ్టులూ, కార్లూ మంచి రోడ్లూ, ఇళ్లూ- పట్నం బలే వుంది..."

రాజమ్మ నవ్వింది. "పిచ్చిదానా- పట్నం అంతా ఇలా వుండదే..."

కూరలు కొన్నాక ఒక చాక్లెట్ కొని యిచ్చిందావిడ. అది చూడగానే దాని గుండెలు బరువెక్కాయి- చిన్న చెల్లికి పంచదార బిళ్లలు ఎంత యిష్టమో. జండా పండగకు బిళ్లలు పంచుతారు. అవి తిన గానే 'మళ్లీ జండాపండగ ఎప్పుడే అక్కా' అని అడుగుతుంది... లక్ష్మికి చాక్లెట్ తిన బుద్ధి కాలేదు.

రోడ్డుపక్క షాపుల్నీ, పెద్ద పెద్దయి ళ్ళనూ- చూసుకుంటూ యింటికొచ్చింది.

★ ★ ★

రోజులు గడుస్తున్నకొద్దీ లక్ష్మికి పట్నం అంటే బెరుకు చాలావరకు తగ్గింది. అలాగే ఇంట్లో వాళ్ళలో పెద్దగా మార్పు రాలేదు. మొదట్లో చూపిన నామమాత్రపు దయాదాక్షిణ్యాలూ కరువయ్యాయి. తిట్లూ, కేకలూ మామూలైనాయి. రోహిత్ అయితే ప్రతి చిన్న విషయానికీ తన్నినంత పనిచే స్తున్నాడు.

ఆ రోజు ఆదివారం. రోహిత్ స్నేహి తుల్ని ఇంటికి పిలిచాడు. ఏవో స్వీట్లూ అవీ తెప్పించాడు. అవన్నీ ప్లేట్లలో సర్ది టేబుల్‌పైన పెట్టమని చెప్పింది రాజమ్మ లక్ష్మితో.

అంతా వొచ్చి కూర్చున్నారు. ఒకసారి ప్లేట్లలో పదార్థాలను పరిశీలించిన రోహిత్ "ఏయ్ లక్ష్మీ, ఇలారా" కోపంగా అరిచాడు.

భయపడుతూ హాల్లోకి వొచ్చింది. రోహిత్ లేచి దాని చెంపమీద గట్టిగా కొట్టాడు.

"రాస్కెల్! ఒక స్వీటు తగ్గింది. నువ్వు తిన్నావా లేదా? "

కళ్లవెంట నీరు కారుతున్నా తుడుచుకో వాలనే ఆలోచన రాలేదు. అతనేదో అడిగా డని, దానికి తను సమాధానం చెప్పాలనే ఆలోచనే దానికి రాలేదు.

లోపలనుంచి రాజమ్మ త్వరగా వొచ్చింది. లోపలనుంచి తల్లి కూడా వొచ్చింది.

"ఏమిటి బాబూ, ఏమయింది? "

"చూడు మమ్మీ, ఈ లక్ష్మి- నా ఫ్రెండ్సు కోసం తెచ్చిన స్వీట్లల్లో ఒకటి దొంగత నంగా తినేసింది"

"సరిగా చూశావా? "

"లెక్కపెట్టే తెచ్చాను.. అలా కాదు.." లోపలకు పరుగెత్తాడు.

జానకి లక్ష్మి చెయ్యి గట్టిగా పట్టుకుంది. "నిజం చెప్పు, ఏమీ అనను. అబద్ధమా డావా? తోలు తీస్తా. చెప్పు, తిన్నావా లేదా? "

నోటమాట రాక, తల అడ్డంగా తిప్పింది. చీకట్లో దెయ్యాల్ని చూసినట్లు వెర్రిచూపు చూస్తున్నది.

జుట్టు పట్టుకుని, వొంచి వీపుమీద దబ దబా నాలుగు బాదింది. ఇంతలో బెల్టు తీసుకుని ఆవేశంగా వచ్చిన కొడుకును ఆపింది జానకి.

"దొంగముండ! ఈసారి ఇలాంటి పనులు చేశావో, జన్మలో మరిచిపోలేని దెబ్బలు తింటావు..." లోపలకు వెళ్లిపో యింది.

రాజమ్మ, "పద, పోయి మొహం కడు క్కురా, టీ తాగుదూగాని..." బాల్కనీలో వాష్‌బేసిన్ దగ్గర మొహం కడిగించింది. టీ పెడుతూ, "ఏమే పిల్లా, నిజం చెప్పు,

తిన్నావా? " అడిగింది. లక్ష్మి తల అడ్డంగా తిప్పింది. దాన్ని అనుమానించినందుకు ఆవిడ పశ్చాత్తాప పడింది. టీ యిస్తూ "అంతేలే, పోనీలే చిన్నపిల్ల తిన్నది కదా అని వూరుకోవచ్చు గదా..." అని గొణుక్కున్నది.




**అ**ప్పుడే లక్ష్మి వొచ్చి మూడు నెలలయింది. ఆమెలో చాలా మార్పు వొచ్చింది. శుభ్రత నేర్చుకున్నది. షాపుకు పోయి వస్తువులు కొని తేవడం- అంతే గాదు లిఫ్టు నడపడం కూడా.

కాని ఇంట్లో మాత్రం పరిస్థితి రోజురోజుకూ దిగజారి పోతున్నది. ఏ క్షణంలో ఏ గొడవ జరిగి, తిట్లూ దెబ్బలూ తినవలసి వస్తుందో అనే భయం! అయ్యగారు మాత్రం ఒకే ఒక్కసారి కొట్టాడు బెల్టు పెట్టి!

ఆరోజు రాత్రి బాగా పొద్దు పోయాక వొచ్చి కూర్చుంటూ, లక్ష్మిని గ్లాసూ, ఐస్‌వాటర్ తెమ్మన్నాడు. అవి తెచ్చి టేబుల్ పైన పెడుతుండగానే అయ్యగారి చెయ్యి తగిలి, బల్లపైనున్న విస్కీసీసా కిందపడి పగిలిపోయింది...

దెబ్బలు తట్టుకోలేక పెద్దగా కేకలు పెడుతూ ఏడిచింది లక్ష్మి. లోపల్నుంచి, ఆ గొడవకు లేచి వొచ్చి భర్తను ఆపింది జానకి.

ఆ దెబ్బల నుంచి తనను కాపాడినందుకు లక్ష్మికి ఆవిడ మీద కృతజ్ఞతలేమీ కలగలేదు.

తినడానికి తిండీ, కట్టుకునేందుకు బట్టా- అన్నీ దొరుకుతున్నా జైల్లో వున్నట్లే వుంది. తమ యింట్లో ఏ పూటా కడుపునిండా తిండి వుండేది కాదు. ఎన్నో రోజులు కడుపు మాడ్చుకున్న సందర్భాలు ఉన్నాయి. ఆకలి తట్టుకోలేక ఏడ్చినా, అక్కడ నిద్రపట్టేది. ఇక్కడ తిండి తిన్నా, రాత్రి ఏ తెల్లవారుజాములోనో నిద్ర వస్తుంది.

ఒక్కసారి యింటికి వెళ్లి చెల్లెళ్లనూ తల్లినీ తండ్రినీ కూడా చూసిరావాలని వుంది. కాని ఆ విషయం అమ్మగారికి చెప్పే ధైర్యం కూడా దానికి లేదు... ఇంక ఎప్పటికీ వాళ్లను చూడనేమోనని భయం కలిగింది.

రోజూ తెల్లవారుతూనే నిద్రలేచి, ఇల్లు చిమ్మి తుడవడం, బట్టలు వుతకడం, రాజమ్మకు వంటలో సాయపడడం, టిఫిన్లు అయ్యాక బజారుపోయి కూరగాయలు తేవడం- ఒకటి రెండు గంటలు విశ్రాంతి తర్వాత మళ్లా పనులు- ఇల్లు వూడవడం, టీ, కాఫీలు, రాత్రివంట- తొమ్మిదేళ్ల లక్ష్మికి ఈ జీవితం తొంభయ్యేళ్ల అనుభవాన్నిచ్చింది.

ఇప్పుడు లక్ష్మిలో ఏ భయం లేదు. కూరగాయలు బేరమాడడం, మంచివి ఏరడం, అలాగే కావాలసిన సామాన్లు కొనుక్కురావడం- కాని దానికి ఇక్కడ వూపిరాడటం లేదు. తన వూరిలో తల్లిదండ్రులు చావగొట్టినా కాసేపు ఏడిచేది తప్ప బాధపడేది కాదు. ఇక్కడే దానికి మానసిక వ్యధ అనుభవానికి వొచ్చింది.

ఆరోజు లక్ష్మికి ఒక కొత్త మనిషి పరిచయం అయ్యాడు.

కూరలకు పోతూ రోడ్డు దాటబోయి స్కూటరుకు అడ్డుపడింది. సడెన్ బ్రేక్ వేసి, "ఏయ్ పిల్లా, చూసుకుని దాటాలి.

## కొత్తగాలి...



**నా చేతివేళ్లు**
**మట్టిని తాకగానే**
**నేను చిగురించాను**
**ఔను...ఎంతైనా అవి వేళ్లు కదా!**

–కలపర్తి దాలినాయుడు, సాలూరు

పల్లెటూరల్లే వుందే?" అని విసుకున్నాడు.

"దెబ్బ తగిలిందా?" అడిగాడు మోహన్. కిందపడి మోకాలికి అంటుకున్న మట్టిని చేత్తో తుడుచుకుంటూనే మోమాటంగా తల అడ్డంగా ఊపింది. ఆమె చేతిలోని సజ్జ ఈ ప్రమాద కారణంగా కిందపడిపోవడంతో కిరాణాషాపు నుంచి తీసుకొస్తున్న సరుకులన్నీ నేలపాలై చిందరవందరగా చెదిరిపోయాయి. మోకాలికి దెబ్బ బలంగానే తగిలింది. గాయమైన చోట రక్తమోడుతోంది. మోహన్ జేబులోంచిరుమాలు తీసి రక్తం కారకుండా సుతారం అద్దసాగాడు. అతను తనపట్ల చూపిస్తున్న సానుభూతికి, చేస్తున్న సపర్యలకి లక్ష్మి ఆశ్చర్యపోయింది. ఆమె వద్దంటున్నా వినకుండా అతను ఆమె బట్టలకు అంటిన దుమ్ముదులుపుతూనే అడిగాడు.

"నీ పేరేంటి?"

"లక్ష్మి" చెప్పిందామె.

"ఉండేది ఎక్కడ...?"

"ఇక్కడికి దగ్గర్లోనే..."

"నిన్నెపుడూ చూళ్లేదే... కొత్తగా వచ్చారా ఈ ప్రాంతానికి? ..."

ఏం చెప్పాలో తెలీలేదు లక్ష్మికి. ఏంచెబుతుందామె? చిన్నవయసులోనే ఒక ఇంట్లో పనిమనిషిగా కుదిరానని చెబుతుందా? తల్లీతండ్రీ అందరూ ఉన్నా దిక్కులేని అనాథగా కాలం గడుపుతున్నానని చెబుతుందా? ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియని తికమక పడిపోయిందామె.

అతడు అదే ప్రశ్నని మళ్లీ వేసాడు మోహన్.

నేలపై పడిపోయిన సరుకులను ఏరి భద్రంగా మళ్లీ సజ్జలో వేసుకుంటోందే తప్ప పెదవి విప్పలేదు లక్ష్మి.

"వాటి సంగతి సరే... తగిలిన దెబ్బ నొప్పి పెట్టడంలేదూ?"

అతడలా అడిగేసరికి లక్ష్మి కళ్లలో నీరు సుళ్లుతిరిగింది...

కన్నతండ్రో, తోడబుట్టినవాడో అక్కున చేర్చుకుని చూపించాల్సిన ఆత్మీయతను అతడు చూపిస్తుంటే ఆ చిన్నారి మనసు కరిగి నీరయిపోతోంది.

నొప్పి భరించలేక ఆమె అలా ఏడుస్తోందని, ఆ విషయం బయట పడకుండా వృథాప్రయత్నం చేస్తోందనే మొదట్లో మోహన్ భావించాడు. అంతే తప్ప, ఆప్యాయత కరువైన ఆ చిన్నారి అనుకోనిరీతిలో అందివచ్చిన ఓదార్పుకే విచలితమవుతోందని అర్థం చేసుకోలేకపోయాడు పాపం. అంతలోనే ఆమె వాస్తవంలోకి వచ్చింది. ఇంటికి సరుకులు తొందరగా తీసుకెళ్లకపోతే అమ్మగారికొచ్చే ఆగ్రహం తలచుకుంటేనే వణుకు పుట్టిందామెకు.

మోహన్ అది గమనించి అడిగాడు..." ఎందుకలా ఉన్నావ్? మందు వేసుకుంటే దెబ్బ తగ్గిపోతుంది. ఇంటికి నా స్కూటర్ మీద దిగబెడతాను..."అంటూ ఆమె చెప్పేది విన్పించుకోకుండా దగ్గరలోని మెడికల్ షాప్‌కివెళ్లి పెయిన్‌కిల్లర్ మాత్రలు కొని తెచ్చి లక్ష్మి చేతిలో పెట్టాడు. వద్దంటున్నా లక్ష్మిని స్కూటర్ మీద ఎక్కించుకుని ఆమె దారిచెబుతుంటే మెల్లగా ఇంటికి చేర్చాడతను. లక్ష్మి లోనికి వెడుతూ తన వేపు చూసిన చూపును మరచిపోలేకపోయాడు మోహన్.

# నిద్రలేమి బాధలు




మనిషికి రోజుకి ఎన్నిగంటలు నిద్ర కావాలి? ఇది మనిషి మనిషికీ మధ్య మారుతుంటుందని వైద్య శాస్త్రజ్ఞులు చెప్తారు. కాని కనీసం ఎన్నిగంటల నిద్ర కావాలి అన్న విషయంపై అమెరికాలోని అనేక యూనివర్సిటీలు పరిశోధనలు చేసాయి.

పెన్‌స్టేట్ కాలేజ్ ఆఫ్ మెడిసిన్ విద్యార్థులు నిద్రమీద నిర్వహించిన దీర్ఘ పరిశోధనలో కొన్ని విషయాలని నిర్ధారించారు.

రాత్రి ఆరుగంటలు మించి నిద్రపోనివారికి నిద్రలేమి వ్యాధి వస్తుంది. ఆ వ్యాధి లక్షణం ఉదయం నిద్ర రావటమేకాక, పనిచేసే సమర్థతని కూడా తగ్గిస్తుంది. మరో ప్రమాదకరమైన విషయమేమంటే శరీరం లోపల వాపు మొదలై క్రమంగా రక్తనాళాలు గట్టిపడతాయి. ఎప్పుడైనా వీరికి గుండెజబ్బు రావచ్చు. 25 మందిని ముందు పరిశీలించి, తర్వాత నిద్ర ప్రయోగశాలలో పన్నెండు రాత్రులపాటు ఆరుగంటలు మాత్రమే నిద్రపోయేలా చేశారు. వీరిలో రక్తనాళాలవాపు స్థాయి రోజు రోజుకూ పెరగడం గమనించారు.




రాత్రిళ్లు కుటుంబ సభ్యులతో మాట్లాడటానికి, టీవీ చూడటానికి లేదా ఇల్లు సర్దుకోవడానికి సాధారణంగా ప్రజలు నిద్రమానుకుంటారు. ఇలా చేయడంవల్ల తమకు తెలియకుండానే వారు హృద్రోగానికి దగ్గరవుతారు. ఆస్టియో పోరాసిస్ అనే వ్యాధి కూడా నిద్రలేమివల్ల వస్తుంది.

1996లో యూనివర్సిటీ ఆఫ్ చికాగో మెడికల్ సెంటర్ చేసిన పరిశోధనలవల్ల నిద్ర తగ్గితే గ్లూకోజ్ స్థాయిలో తేడావచ్చి డయాబిటిస్ టైప్-2 వ్యాధి వచ్చే అవకాశాలు ఉన్నాయని తేలింది. అంతేకాక డిప్రెషన్, కంటిచూపు తగ్గడం, కండరాల బాధ, ఏకాగ్రత లోపించడం, వ్యాధి నిరోధక శక్తి తగ్గడంలాంటివాటికి కూడా నిద్రలేమి దారితీస్తుందని 2000లలో స్కూల్ ఆఫ్ మెడిసిన్ అండ్‌వెటరన్ అఫైర్స్ హెల్త్ సెంటర్ వారు శాండియాగోలో చేసిన పరిశోధనల్లో కనుక్కున్నారు. నిద్రలేమిగల వారి మెదడు ఎలా ఉంటుందంటే తాళాన్ని దానికి సరిగ్గా సరిపోని తాళంచెవితో తీసే ప్రయత్నంలా ఉంటుందట. నిద్రలేమి వల్ల కళ్లకింద నల్లటి చారలు, తలనొప్పి, హైపర్ టెన్షన్, అసహనం, మతిమరుపు, కోపం, బుద్ధిమందగించడం మొదలైనవి వచ్చే అవకాశం ఉంది.

1977-83లో ఇజ్రాయిల్ ప్రధానిగా పనిచేసిన మోనాకెమ్ నిద్రలేమి గురించి తన అనుభవాన్ని ఈ విధంగా వివరించాడు- "నన్ను రష్యన్ గూఢచారి సంస్థ కేజీబీ పట్టుకుని హింసించినప్పుడు రోజుల తరబడి నిద్రలేకుండా బాధించారు. బాగా నిద్ర పడుతుండగా బలవంతంగా లేపేవారు. ఆకలి, దాహంవల్ల కలిగే బాధలకన్నా నిద్రకోసం పడే బాధ భరించలేనిది."

విచిత్రమేమంటే ఐశ్వర్యవంతమైన దేశాల్లో ప్రజలు సగటున ఆరుగంటలు మాత్రమే నిద్రపోతే, పేద దేశాల్లో ప్రజలు సరిపడా నిద్ర పోతుంటారు.

ఎందుకో ఆమెని చూస్తుంటే చిన్ననాడే తమని విడిచి అనంతలోకాలకు తరలిపోయిన చిట్టిచెల్లెలు గుర్తుకొచ్చిందతనికి.

లోపలకు అడుగు పెడుతూనే తిట్ల వర్షం... "ఎవడేవాడు స్కూటరు మీద తెచ్చాడు? బికారి ముండా, స్కూటరు కావలసి వొచ్చిందేం?" అరుస్తున్నది ఇంటావిడ.

లక్ష్మి భయంతో, "రోడ్డుదాటుతూ కింద పడ్డా... సారు ఇంటి దగ్గర దింపారు" సమాధానమిచ్చింది.

"నీకు ఎన్నిసార్లు చెప్పాను. పరిచయం లేనివాళ్లతో మాట్లాడవద్దని? ఈసారి ఎముకలు విరగ్గొడతా, జాగ్రత్త"

తన తప్పేమిటో ఆ పిల్లకు అర్థం కాలేదు. లోపలకు వెళ్లి రాజమ్మకు సాయపడసాగింది.

"ఏమే పిల్లా, ఎందుకట్లా చేస్తావ్? ఎందుకు వూరికే దెబ్బలు తినడం?"

లక్ష్మి ఆలోచనలో పడింది. ఆయనెవరో తన గురించి అన్ని ప్రశ్నలెందుకు? మరో మూడు రోజుల్లో దానికి జవాబు దొరికింది.

సుదర్శనరావు ఆఫీసుకూ, పిల్లలు స్కూలుకూ పోయాక, అమ్మగారు భోజనం చేసి రెస్టు తీసుకుంటున్న సమయంలో బెల్లు మోగింది.

లక్ష్మి తలుపు తెరిచింది.

ఎక్కడో చూశాననుకున్నది. వెంటనే గుర్తుకొచ్చింది.

అలాగే నిలబడివున్నది. రాజమ్మ వొచ్చి "ఏంకావాల"ని అడిగింది.

"సుదర్శనరావు గారున్నారా?"

"లేరు"

"అమ్మగారు?"

"వున్నారు- మీరెవరండీ?"

జవాబివ్వకుండా అతనూ, వెనక మరొకాయన, ఒక పెద్దావిడా లోపలకు వొచ్చేసి సోఫాల్లో కూర్చున్నారు. రాజమ్మ లోపలకు వెళ్ళింది. లక్ష్మి అయోమయంగా చూస్తూ అలాగే నిలబడింది.

జానకీ, వెనకే రాజమ్మా వొచ్చారు.

"నమస్తే మేడం! నా పేరు మోహన్, జర్నలిస్టును, ఇతను జకీర్- నా కొలీగ్. ఆ మేడం పేరు శాంతాదేవిగారు- చైల్డ్ లేబర్‌కు వ్యతిరేకంగా ఒక స్వచ్ఛంద సంస్థను నడుపుతున్నారు..."

జానకికి పరిస్థితి కొద్దిగా అర్థమైంది. "మీకేం కావాలి?" అని అడిగింది నిలబడే.

"మీ దగ్గర లక్ష్మి అని ఒక తొమ్మిదేళ్ళ పాప పనికి కుదిరిందని మాకు సమాచారం- అదే నిజమైతే అది చట్టవిరుద్ధం" అంటూ లక్ష్మివేపు చూస్తూ, "ఈ పిల్లే గదూ?" అడిగింది శాంతాదేవి.

జానకికి కోపం ఎక్కువైంది.

"ముందు బయటకు నడవండి. అసలు లోపలకెందుకొచ్చారు? ట్రెస్‌పాసింగ్ కింద అరెస్టు చేయించొచ్చు- మా వద్ద అది పనిచేస్తున్నదని ఎవరు చెప్పారు మీకు? ప్లీజ్ లీవ్‌మై హౌస్" అంటూ గట్టిగా మాట్లాడింది.

ఆవిడ నవ్వింది. "జానకిగారూ! మీరు గట్టిగా అరిచినంతమాత్రాన నేరం మాసిపోదు. ముందు ఆ పిల్లతో మాట్లాడనివ్వండి"

"అవసరం లేదు, ముందు బయటకు నడవండి"

"సరే పోతాం, ఈసారి పోలీసుల్తో వొస్తాం"

దానితో ఆవిడ మాటలు ఆగిపోయాయి. "మీకు వొచ్చిన సమాచారం నిజం కాదు. అది మా బంధువుల పిల్ల. బీదవాళ్లు, చదువు చెప్పించుదామని ఇక్కడకు తెచ్చాం- దానితో ఏ పనీ చేయించుకోవడంలేదు. మా పిల్లలతో సమానంగా చూసుకుంటున్నాం- కావాలంటే దాన్నే అడ

గండి... లక్ష్మి, ఇలారా..."

లక్ష్మి మెల్లగా నడుస్తూ దగ్గరగా వొచ్చింది. ఆవిడ మొహంలో, గొంతులో కరుణరసం కురిపిస్తూ, "అమ్మా లక్ష్మి- నిన్ను చదివించమనే కదూ మీ అమ్మా నాన్నా ఇక్కడకు తెచ్చింది? నీ చేత ఇంట్లో పనులు చేయిస్తున్నామా? చెప్పు" అడిగింది.

మోహన్ ఆ పిల్లను దగ్గరకు పిలిచాడు. దాని గుండె దడదడ లాడుతున్నది. తనను ఆ రోజు స్కూటరుపైన దింపింది ఈయనేనని అమ్మగారికి తెలిస్తే, తనను తప్పకుండా చంపేస్తుంది.

"ఇలారా పాపా. నీ పేరు లక్ష్మి కదా! ఈ యింట్లో వుండి ఏం చేస్తూవుంటావు? చదువుకుంటున్నావా? ఏం పనులు చెయ్యగలవు? " అడిగాడు నవ్వుతూ.

ఏమీ మాట్లాడకుండా నిలబడింది.

"చూశారా, అది ఏ పనీ చెయ్యదు. అయినా ఇలా వొచ్చేసి న్యూసెన్స్ చేయడం ఏమీ బాగాలేదు. పుణ్యానికి పోతే పాపం ఎదురవుతుంది. దిక్కులేని దని ఇంట్లో పెట్టుకుంటే.. ఇంక మీరు బయలుదేరండి" అన్నదావిడ ధీమాగా.

అందరూ లేచారు.

గుమ్మం దగ్గర ఆగి శాంతాదేవి హెచ్చరించింది. "మేడం, గుర్తుంచుకోండి. పిల్లలతో పనులు చేయించడం మాత్రం నేరం... అయినా మేం తిరిగి వొస్తాం..." అని చెప్పి మిగతావారితో కలిసి వెళ్లిపోయింది.

అందరూ వెళ్లాక, జానకమ్మ పళ్లుకొరుకుతూ లక్ష్మి చెయ్యి పట్టుకుంది. "ఇప్పుడు చెప్పు, ఎవరు వీళ్లంతా? నీకెలా తెలుసు? నిజం చెప్పకపోయావా నిన్ను పాతేస్తా.." అంటూ జుట్టు పట్టుకున్నది.

గొంతు పెగుల్చుకుని "నేనేం చెప్పలేదు, ఆయనే ఆరోజు స్కూటరు మీద..." అని ఆగిపోయింది.

## సాహిత్యంతో వ్యక్తిత్వ వికాసం



సిహెచ్. వెంకటేశ్వరరావు

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగం చేసి 2001లో పదవీ విరమణ చేశాను. మొదటినుంచీ నా కథలు, అనువాదాలు అడపాదడపా 'విపుల' తదితర పత్రికలలో అచ్చవుతూనే ఉన్నాయి. పదవీవిరమణ తర్వాత రచనావ్యాసంగాన్ని కొంచెం సీరియస్‌గా తీసుకున్నాను. ఇప్పటికి నాలుగు నవలలు కూడా ప్రచురితమయ్యాయి. మంచి సాహిత్యం మనిషిలో శీలనిర్మాణానికి, వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడుతుందని నా విశ్వాసం. తెలుగులో నేను అభిమానించే రచయితల్లో ముఖ్యులు కొడవటిగంటి, రావిశాస్త్రి. ఇక ప్రపంచ సాహిత్యంలో గొప్ప రచయితలందరినీ అభిమానిస్తాను. సాహిత్యానికి ప్రాధాన్యమిచ్చే విలక్షణ మాస పత్రికలైన విపుల, చతురలంటే ఎన్నో ఏళ్లనుంచీ ప్రత్యేకాభిమానం. 'మొగ్గ' నవలను ప్రచురించేందుకు స్వీకరించిన 'చతుర' సంపాదకులకు కృతజ్ఞతలు.

చిరునామా :

సిహెచ్. వెంకటేశ్వరరావు,
7-1-29/ఎ/1, ఫ్లాట్ నెం. 503,
యునైటెడ్ అనెక్స్ అపార్ట్‌మెంట్స్,
అమీర్‌పేట, హైదరాబాద్-16

ఆవిడ నోరు తెరిచింది. గబగబా లోప లకు వెళ్లి బెల్టుతో తిరిగి వొచ్చింది. కిటికీలు, తలుపులు వేసేసింది. లక్ష్మి భయంతో కొయ్యబారి పోయింది.

"అమ్మా! పాపం, దానికేమీ.." అంటూ అడ్డుపడబోయింది రాజమ్మ.

"నోర్మూయ్" అని పెద్దగా కేక పెట్టింది.



## 4

**"గుడ్** మార్నింగ్..." విష్ చేసాడు జకీర్.

"మార్నింగ్" కాస్తంత చికాగ్గా అన్నాడు మోహన్.

జకీర్ అతనిలోని చికాకుని గమనించాడు. తర్వాత నెమ్మదిగా అడిగాడు- "ఏం జరిగింది బ్రదర్? "

"ఏంలేదు... కాస్త మనసు బాగోలేదంతే!"

"ఈ లోకమంతే బ్రదర్. మనచేతుల్లో, చేతల్లో ఏంలేదు. ఎలా జరగాల్సుంటే అలా జరిగిపోతుందంతే!"

"అలాగనీ చేతులు ముడుచుకుని కూర్చోమంటావా? " అడిగాడు మోహన్.

"అలా కూర్చోకుండానే ఏదో చేయబోయావు, ఏం జరిగింది? " జకీర్.

"పాపం లక్ష్మిని చూస్తుంటే జాలేస్తోంది. ఎంచక్కగా స్కూలుకెళ్లి చదువుకోవాల్సిన వయసు. కడుపునింపుకోవడం కోసం వెట్టిచాకిరీ చేస్తోంది. ఆ పిల్లను తలచుకుంటేనే బాధనిపిస్తోంది. పాత్రికేయవృత్తిలో ఉన్న మనం ఆ పాపకు ఏం చేయలేమా? "

"ఎందుకు చేయలేం? చేయగలం. నవంబర్ ఫోర్టీన్త్ వస్తోంది కదా! స్టాఫ్ ఫొటోగ్రాఫర్‌ని తీసుకెళ్లి లక్ష్మిఫొటో తీయించు. చాచా నెహ్రూకు గులాబీపూలన్నా, పిల్లల నవ్వులన్నా ఎంతో ఇష్టమంటూ ఇంట్రోతో ప్రారంభిస్తూ.. అన్నెం పున్నెం తెలీని అమాయక బాల్యం వెట్టిచాకిరీతో ఎలా నలిగిపోతోందో ఆసక్తికరంగా ఓ కథనం రాసిపడేయ్... హృదయ విదారకంగా మానవీయకోణంలో ఆ పిల్లకథని అచ్చేస్తే ఒకటే అభినందనలు..."అన్నాడు జకీర్.

"అచ్చేస్తాం... ఆ తర్వాతేం జరుగుతుంది? " అమాయకంగా అడిగాడు మోహన్.

"ఏం జరుగుతుంది? ఆ ఒక్కరోజు లక్ష్మి గురించి అంతా మాట్లాడుకుంటారు. అధికారుల దృష్టిలోకానీ పడితే అంతో ఇంతో సాయం దొరుకుతుంది"

"నువ్వు చెప్పింది చెత్తగా ఉంది. అన్ని సంఘటనలనూ వార్తాకోణంలోనుంచే చూడకూడదు. మానవీయకోణం నుంచీ చూడాల్సి ఉంటుంది. పత్రికలో ప్రముఖంగా ప్రకటించి ఆ చిన్నారిని జనం మధ్యలోకి వదలడం సబబైంది కాదేమో? నలుగురినోళ్లలో పడిన ఆమె బతుకు మరింత చిందరవందర చేసేలా మన చేతలుండకూడదు. జర్నలిస్టులకు వార్తాసేకరణ వృత్తే అయినా... ప్రతి అంశాన్నీ అదే దృష్టితో కాకుండా... మనకెదురైన సమస్యలకు మనకున్న పలుకుబడి, అధికారులు, నాయకులతోగల సంబంధాల ఆసరాతో బాధితులకు ఏమేర సాయం చేయగలమో ఆలోచించి ఆచరణలో పెడితే బావుంటుంది. ఆ దిశలోనే నేను వృత్తిబాధ్యతలు

# క్యాన్ల కథ ఇదీ...




పారిశ్రామిక విప్లవం తర్వాత ఆహార పదార్థాలను ఓడలలో యుద్ధభూమికి చెడ కుండా తీసుకెళ్లడానికి శాస్త్రజ్ఞులు అనేక పరి శోధనలు చేశారు. 1810లో నెపోలియన్ సైన్యానికి తాజా ఆహారం సరఫరా చేయ డానికి తొలిసారి క్యాన్‌ని కనుక్కున్నారు. ఆహారాన్ని క్యాన్‌లో పెట్టి, గాలి తీసేసి, మూత మూసాక, దానిని వేడిచేస్తారు. దీంతో ఆహారపదార్థంలోని బ్యాక్టీరియాని



చంపడం ద్వారా ఎక్కువకాలం అది నిలువ ఉంటుంది. ఆ రోజుల్లో చేత్తో రోజుకి ఒకరు ఆరు నుంచి పది క్యాన్లను మాత్రమే సిద్ధం చేసేవారు. నేడు రోజుకు అలాంటివి 30 లక్షల క్యాన్లను తయారు చేసే యంత్రాలు పనిచేస్తున్నాయి.

మొదటి, రెండో ప్రపంచ యుద్ధాల్లో పాల్గొన్న సైనికులకోసం ఆహార సరఫరాకు క్యాన్లను అధికంగా తయారు చేసే యంత్రా లను శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. దానిలోని ప్రయోజనాలను గుర్తించి, తర్వాత పానీయ లకు కూడా వాటిని ఉపయోగించసాగారు. 1935లో తొలిసారిగా క్రూగర్ కంపెనీ బీర్‌ను క్యాన్‌లో సరఫరా చేసింది.

తక్కువ ధరకు, తక్కువ బరువుగల, లోపలి పదార్థం నాణ్యత చెడకుండా ఉంచే లోహంగా 1963లో అల్యూమినియంను గు ర్తించారు. అప్పటినుంచి క్యాన్లకు అల్యూమిని యంనే వాడుతున్నారు. క్యాన్లను నేడు అనేక ఆకృతుల్లో తయారు చేస్తు న్నారు. వెన్నను నిలువ ఉంచే క్యాన్లు చతురస్రాకారంలో ఉంటాయి. ఆహార పదార్థాల నిల్వకేగాక క్యాన్లను అనేక ఇతర ప్రయోజనాలకు కూడా ఉపయోగిస్తున్నారు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో పురుగులనుంచి సైనికులకు రక్ష ణగా ఏరోసెల్ క్యాన్లను అభివృద్ధి చేశారు.

మొదట్లో చేత్తో పంపుకొట్టే ఫ్లిట్ యంత్రం దీనికి తొలిదశ. నేడు బటన్ నొక్కితే క్యాన్‌లోని ద్రవప దార్థం బయటికి వచ్చే వాటిని తయారు చేస్తున్నారు. ఏరోసెల్ క్యాన్లద్వారా పర్‌ఫ్యూమ్స్, ఎర్ ఫ్రెషనర్, అస్తమా పేషెంట్స్ ఉపయోగించే మందుల లాంటి వెన్నో తయారు చేస్తున్నారు. ఏరోసెల్ క్యాన్‌తోగల ప్రమాదం అది నిప్పులో పడితే పేలిపోవడ మే.

అమెరికన్ జైళ్ల వంటగదులకు ఆహారాన్ని కేన్ల ద్వారానే సరఫరా చేస్తు న్నారు. క్యాన్లమూతను ఖైదీలు తోటి ఖైదీ లను చంపడానికి ఆయుధాలుగా, కిటికీ చువ్వలు కోసేందుకు రంపాలుగా వాడ టంతో శాస్త్రజ్ఞులు మూతను, ఖాళీ క్యాన్‌ను నలిపి ఉండలా చేసే యంత్రాన్ని కనుగొ న్నారు. జైళ్లల్లో ఎక్కువగా క్యాన్లను ఉపయో గించే వంటగదుల్లో ఈ ఓపెనర్స్ యంత్రా లను ఉపయోగిస్తున్నారు.

1970 నుంచి క్యాన్లకు వాడే లోహాన్ని రీసె క్లింగ్ చేస్తున్నారు. నేడు బీవరేజ్ క్యాన్లలో సాఫ్ట్ డ్రింక్స్, బీర్‌లాంటివి సరఫరా అవుతు న్నాయి. ఖాళీ క్యాన్లను పాశ్చాత్యులు అధి కంగా వాడేది పెళ్లయి, నూతన దంపతులు వెళ్లే కారుకు వెనుక చప్పుడయ్యేలా వినోదా నికి కట్టడానికే! 2007లో 27 బిలియన్ల క్యాన్లను అమెరికాలో ఉపయోగించారు. ప్రస్తుతం చాలా దేశాల్లో క్యాన్లు నిత్యావస రంగా మారాయి.

నిర్వర్తిస్తున్నాను..."

'ఏమో బ్రదర్! నీ ఆలోచన సరికాదేమో ననిపిస్తోంది నాకు. చక్కగా రిపోర్టింగ్ బాధ్యతలు నిర్వర్తిస్తుండడంతోపాటు.. అటు పత్రికకు, ఇటు మనకు పేరొచ్చేలా.. అదే సమయంలో కాస్తంత డబ్బు వెనకేసుకునేలా ఉండాలని నేననుకుంటున్నాను. మనిద్దరి ఆలోచనలు వేర్వేరైనా స్నేహం మనల్ని కట్టిపడేసింది కదా! నేనేం చెప్పినా వినే పరిస్థితిలో నువ్వులేవని అర్థమవుతోంది. లక్ష్మి విషయంలో ఏం చేయాలనుకుంటున్నావో అదే చెయ్యి..." అన్నాడు జకీర్.

★ ★ ★

స్కూటర్ షాపుముందే పార్క్‌చేసి నడవసాగాడు మోహన్. అపార్ట్‌మెంటుకు దగ్గర్లో వున్న పాన్‌షాపు వద్ద కూల్‌డ్రింకు తీసుకున్నాడు.

మూడు 'కోక్'లు తాగాక ఫలితం కనబడింది. దూరం నుంచి లక్ష్మి నడుచుకుంటూ వస్తూ కనబడింది. తనను బెదురుగా చూసి, పక్కనే వున్న పెద్దావిడతో ఏదో చెప్పింది. వాళ్లు దగ్గరకు రాగానే మోహన్ నమస్కారం చేశాడు.

"నన్ను గుర్తు పట్టారా? "

రాజమ్మ జవాబివ్వకుండా, లక్ష్మి చేతిలోని ఖాళీసంచి తీసుకున్నది. లక్ష్మి ఆగకుండా ఆవిడ వెనకే నడిచింది.

"నేను మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు మోహన్ ఆమె వెంట నడుస్తూ.

ఆవిడ చిరాగ్గా, "ఏం మాట్లాడాలి బాబూ? నిన్న మీరు వెళ్లాక, లక్ష్మి చావు దెబ్బలు తిన్నది. దాన్నిలా బతకనివ్వండి" అన్నది.

"మీరు కూడా అలా అంటే ఎలా? ఆ పిల్ల వయస్సు ఎంత? ఇంత చిన్న వయసులో అలా గొడ్డుచాకిరీ చేయించుకోవడం తప్పు కదా? ఆ పాప బతుకంతా ఇంతేనా? మీకు ఇది న్యాయంగా కనబడుతున్నదా? చెప్పండి."

ఆవిడకు కోపం తగ్గింది.

"అన్యాయమే బాబూ, కాని చేసేదేముంది? దాని అమ్మా నాన్నా వొచ్చి అప్పగించిపోయారు. దీనికి ఇద్దరు చెల్లెళ్లు, వాళ్లకు గడవని పరిస్థితి. కనీసం దీనికి రెండుపూట్లా తిండైనా దొరుకుతున్నది, దీన్ని పంపించేస్తే తిండికి మాడి చావవలసిందేగదా? మీరే చెప్పండి, అది న్యాయమా? "

దుకాణం వద్ద ఆగారు.

"పంపటం ఎందుకు? ప్రభుత్వం ఇలాంటి పిల్లలకు హాస్టళ్లు పెట్టింది. అక్కడే వుంచుకుని చదువు కూడా చెపుతారు"

"అవన్నీ పేపర్లలో చదువుతూనే వున్నాం బాబూ, ఈ పిల్లను ఇలాగే బత

## చతురోక్తులు

**భార్యాభర్తలపై జోకులు నిత్యనూతనం. ఇదే అంశంపై ఇప్పటికే ఎన్నో జోకులు చదివాం. అలాంటి చతురోక్తులు కొన్ని..**

**అదనపు ఉతుకుడు**



ఇద్దరు కాలేజి ఫ్రెండ్స్ కొన్నేళ్లతర్వాత వీధిలో కలిశారు. వారి సంభాషణ...

'ఏరా.. నీ లవర్ కామేశ్వరిని చేసుకున్నావా? లేక రోజూ చెయ్యి కాల్చుకుంటూ, బనీన్లు, డ్రాయర్లూ ఉతుక్కుంటూనే ఇంకా కాలక్షేపం చేస్తున్నావా?'

'కాలక్షేపానికి ఇప్పుడు బనీన్లు, డ్రాయర్లతో పాటు, చీరలు జాకెట్లూ కూడా ఉన్నాయిలే!'

కనివ్వండి"

"ఏమిటలా మాట్లాడతారు? ఇదే మీ పిల్లలయితే ఇట్లా చాకిరీకి పెడతారా? ఈ పిల్ల వయస్సెంత? చదువుకునే వయస్సులో ఇలా పనులు చేయించడం ఎంత దుర్మార్గం? మీరే ఆలోచించండి, మీరు మంచివారిలా వున్నారు."

ఎండ ఎక్కువవుతున్నది.

"బాబూ, మీ పేరేమిటో? ఏమీ అనుకోవద్దు. ఈ విషయంలో ఏమైనా చెయ్యదలుచుకుంటే అయ్యగారితో మాట్లాడండి- అనవసరంగా ఈ పిల్లతో మాట్లాడి దాన్ని కష్టపెట్టకండి" అంటూ కూరలు తీసుకోసాగింది రాజమ్మ.

"ఒక్క విషయం రాజమ్మగారూ, ఈ పిల్ల తల్లిదండ్రులు ఎక్కడుంటారు? వాళ్ల అడ్రసూ ఆ వివరాలైనా చెప్పండి."

ఆవిడ కోపగించుకుంది.

"ఏమిటయ్యా, చెపితే అర్థం కాదా? ఆ తల్లిదండ్రులే తీసుకొచ్చి వొదిలిపోయారు... చూడు బాబూ, మా పనులు మమ్మల్ని చేసుకోనివ్వు. ఇప్పటికే ఆలశ్యమైంది."

ఏంచేయాలో తెలియక మోహన్ ఆగిపోయాడు. నిజమే ఆమె తల్లిదండ్రుల్ని వెదికి పట్టుకున్నా ఫలితం? వాళ్లకు అప్పగించినా మరో యింటికి అప్పజెబుతారు. దాని బతుకు మళ్లా మొదటికి వొస్తుంది. ఒకటే మార్గం- ఏ హాస్టల్లోనో చేర్పిస్తే పరిష్కారం అవుతుంది...

మోహన్‌కు విసుగు కలిగింది.

తను ఎంతమంది లక్ష్మివంటి పిల్లల్ని రక్షించచగలడు? వాళ్ల తల్లిదండ్రులే సంతలో పశువుల్ని అమ్మినట్లు అమ్ముతుంటే, చదువుకున్నవాళ్లు, ప్రభుత్వోద్యోగులూ, ప్రజానాయకులే ఈ పిల్లల్ని కొనుక్కుని, వెట్టిచాకిరీ చేయించుకుంటుంటే, తనొక్క లక్ష్మి విషయం తెలుసుకుని పాకులాడితే లాభమేమిటి? రాజధానిలోని ముప్ఫయివేలకుపైగా ఇలా ఇళ్లల్లో పనులు చేస్తున్న పిల్లలున్నట్లు ప్రభుత్వమే గణాంకాలు ఇస్తున్నది. అదేదో ఘనకార్యం సాధించినట్లు!

వెంటనే పశ్చాత్తాపపడ్డాడు. లక్ష్మి అమాయకమైన మొహం తనను సంజాయిషి అడుగుతున్నట్లు తోచింది. 'నా వల్ల ఏమవుతుంది? నేనొక్కడినే ఏం చేయగలను? అనే నిరాశతో ప్రతివాడు అసమర్థతను సమర్థించుకోవడం! ప్రజల్లోని ఆ నిరాశే ఈ వ్యవస్థలోని వికృతాల్ని పెంచిపోషిస్తున్నది. ఏమైనా, కనీసం ఒక్క లక్ష్మినయినా ఆ నరకం నుంచితప్పించగలిగితే చాలు!'

అపార్ట్‌మెంట్‌లో స్కూటర్ పార్క్ చేశాడు-

తలుపు తెరిచిన జానకి మొహం చిట్లించుకున్నది. గట్టిగా ఏదో అనబోయి, తమాయించుకున్నది.

"ఏమిటి మళ్లా వొచ్చారు?"

"లక్ష్మి తల్లిదండ్రుల అడ్రసు కావాలి మేడం"

"మీకెందుకు ఇవ్వాలి? అనవసరంగా గొడవ చేయక వెళ్లండి" తలుపు మూసివేయబోయింది.

"ఒక్కక్షణం. ఒక్క మాట వినండి. ఆ పిల్ల తల్లిదండ్రులు చదువుకోసం మీ వద్ద వదిలివెళ్లారని చెపుతున్నారు. అది నిజం కాదని రుజువైతే మీరు చాలా చిక్కుల్లో పడతారు. అందువల్ల ముందే ఆ పిల్ల తల్లిదండ్రుల స్టేట్‌మెంట్ కనుక తీసుకుంటే మీకు ఏ ప్రాబ్లం ఉండదు"

ఆవిడ ఆలోచించింది.

"లోపలకు వచ్చి కూర్చోండి"

అతన్ని హాల్లో కూర్చోబెట్టి, బెడ్‌రూంలోకి వెళ్లి భర్తకు ఫోన్ చేసింది.

సుదర్శనరావు చిరాకు పడ్డాడు.

"అసలతన్ని లోపలకెందుకు రానిచ్చావు?"

"కాదండీ, వాడసలే జర్నలిస్టు- ఏదో ఒకటి పేపర్లో రాసిపారేశాడంటే, చిక్కుల్లో పడతాం. అయినా అడ్రస్ ఇవ్వడం వల్ల మనకేం నష్టం? అదేదో మారుమూల పల్లెటూరు. వీడక్కడకు వెళ్లినప్పుడు మాట గదా? ఒకవేళ పోయినా, ఆ తాగుబోతెధవ నాలుగు తిట్టి పంపిస్తాడు. దానితో వీడు ఈ విషయం వదిలేస్తాడు. అడ్రసు ఇచ్చేద్దాం"

భర్త కూడా ఆలోచించాడు. ఈ ఆలోచన బాగానే ఉన్నట్లు తోచింది "సరే, ఇచ్చెయ్యి. కాని మరేమడిగినా జవాబివ్వకుండా వెంటనే పంపెయ్యి"

ఆవిడ పాపయ్య అడ్రసు కాయితం పైన రాసి తీసుకువచ్చి ఇచ్చింది. "ఇంక దయచేసి మా ఇంటికి రాకండి, మమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పెట్టవద్దు" అని గట్టిగా చెప్పింది.

"థాంక్యూ, ఇంక మీకు ఏ ఇబ్బందీ కలగదు" అంటూ బయటకు నడిచాడు.

ఆవిడ మాట్లాడకుండా తలుపు దభేలున వేసుకున్నది.

★ ★ ★

నల్గొండలో బస్ దిగి వాకబు చేశాడు మోహన్... ఆ ఊరు ఇరవై కిలోమీటర్ల దూరం. పోవాలంటే బస్సులు లేవు. పెద్ద ఆటోలు, ప్రయివేటు జీపులే గతి.

బస్‌డిపో నుంచి బయటకు వచ్చి వేగంగా వెళ్ళొచ్చని భావించి జీపు ఎక్కాడు. కాని అది భ్రమ అని తేలిపోయింది. దాదాపు ముప్పయి మందిని జీపులో కుక్కారు. బైట మరో పదిమంది వ్రేలాడుతున్నారు.

గతుకుల రోడ్డు, గుంతలు. అక్కడక్కడ వర్షాలకు తెగిపోవడం వల్ల జీపు రోడ్డు దిగి, పొలాల్లో ప్రయాణం సాగించింది. ఊరు చేరేసరికి మధ్యాహ్నం మూడు గంటలు దాటింది.

ఎక్కువగా గుడిసెలూ, నాలుగైదు పెంకుటిళ్లూ, నిర్జీవంగా తిరుగుతున్న అరుదుగా కనబడే మనుష్యులూ....

చెట్టు కింద కళ్లు మూసుకుని చుట్ట కాల్చుకుంటున్న ముసలయ్యను పలకరించాడు మోహన్.

"పాపయ్యా? ఆ తాగుబోతెదవ ఇంటి కాడ యాడుంటాడు? కల్లు పాకకాడ వుంటాడు"

"అతని యిల్లు తెలుసా? చూపిస్తావా?"

"ఇప్పుడెవరుంటారు సామీ? ఆడిపెళ్లాం పనులకు పోతుంది. ఇంక పిల్ల కాయలు.."

మోహన్ ఆలోచించాడు. ఎలాగయినా కలవాల్సిందేననుకుని, "పాపయ్య కల్లు దుకాణం నుంచి ఇంటికెప్పుడొస్తాడు?" అడిగాడు.

"ఎవడికి తెలుసు? ఆడనే పడిసస్తాడు. ఏం పని?"

"పోనీ, నన్ను అక్కడికి తీసుకెడతావా?"

తాత బుర్ర గోక్కుంటూ, "మీరెందుకు సార్? నేపోయి తోలుకొస్తా..." అని అలాగే నిలబడ్డాడు కదలకుండా.

జేబులోంచి పది రూపాయలు తీసి యిస్తే అప్పుడు కదిలాడు.

మోహన్ కర్చీఫ్‌తో చెమట తుడుచుకుంటూ, ఆ చెట్టు కింద ఓ బండరాయి మీద చతికిల బడ్డాడు. 'ఈ వూరిలో ఎవరికీ పనీ పాటా వున్నట్లు లేదు. దరిద్రం తాండవమాడుతున్నది- మరి పిల్లల్ని అమ్ముకోక ఏం చేస్తారు? ఒరిస్సాలో ఎక్కడో భార్యలను కూడా అమ్మినట్లు విన్నాం... లంబాడి తండాల్లోనయితే ఆడపిల్లల్ని పుట్టగానే చంపుతున్నారు... ఇదీ మన అరవయ్యేళ్ళ స్వాతంత్ర్య ప్రగతి.'

అలాగే కూర్చుని ఆలోచిస్తూ కళ్లు మూసుకున్నాడు.

"సారూ, లెండి- మీ దోస్తును తోలు కొచ్చా.." పిలిచాడు తాత.

ఒత్తుగా పెరిగిన తెల్లటి గడ్డం, పేలిక లైన పంచా, భుజంపైన మరో పేలికా. మనిషి నిలబడ లేకుండా వున్నాడు. కల్లు కంపు!

"నమస్తే సార్, పట్నంకెల్లి వొచ్చిను? దొరలకు నాతో పనేంది?" అంటూ పాప య్య అలాగే నేలమీద దుమ్ములో గొంతు కూర్చున్నాడు.

"నీ కూతురు లక్ష్మిని అక్కడ సుదర్శన రావు అనే ఆయన యింట్లో పనికి వుంచా వని తెలిసింది..."

పాపయ్య అనుమానంగా చూశాడు తర్వాత పెద్దగా నవ్వాడు. "మీరెవరు సార్? ఆ యివరాలు ఎందుకడుగుతు న్నారు?"

"అట్లా చిన్న చిన్న పిల్లల్ని పనులకు పెట్టడం తప్పుగాదా పాపయ్యా? పైగా నేరం కూడాను..."

పాపయ్య వెకిలి నవ్వు నవ్వి, ఖాండ్రించి వుమ్మాడు. "అవును సార్, ఆ పోరిని పనికి పెట్టా... ఇంకా ఇద్దరున్నారు, ఇంటి కాడ... ఆళ్లకి బువ్వలేదు, వూర్లో పను ల్లేవు. ఇంటిల్లిపాదీ చావాల్నా? మీరే చెప్పండి, దానికయినా రెండు పూట్లా బువ్వ దొరుకుతుంది"

"తిండి పెట్టలేక పిల్లని అమ్ముకుం టావా? అదక్కడ ఎన్ని కష్టాలు పడుతున్నదో నీకేమయినా తెలుసా?"

"ఓ సిగరెట్టుంటే ఇవ్వండి సార్" పాపయ్యా చనువుగా అడిగి తీసుకున్నాడు. "ఈడ కష్టాలు లేవా? ఏం చెబుతు న్నారు? అన్నట్టు మీకు పనికి కావాలంటే నా రెండో పోరిని తీసుకుపోండి.."

మోహన్ మండిపడ్డాడు.

"నువ్వు మర్యాదగా నాతో వొచ్చి పిల్లను తీసుకుపో, లేదా పోలీసులు చూసుకుం టారు"

పాపయ్య లేచి నిలబడ్డాడు.

"ఏంది సార్, చాలా మాట్లాడుతు న్నావు? ఏం చేసుకుంటావో చేసుకో..." అనేసి మళ్లా గొంతు తగ్గించి, "సార్, మన్నించండి తాగుబోతెదవను- అది ఇక్క డున్నా తిండిలేక చస్తుంది. నేను వేరే వాళ్లలాగా ఆడబిడ్డను చంపలేను సార్, అది రెండుపూట్లా బువ్వయినా తింటుంది. మంచి గుడ్డలు, సినిమాలు- ఈడేముంది సార్, ఇంటికాడ గుప్పెడు గింజలు లేవు, మూడు పూటలయింది గంజితాగి... ఆ సార్ వొచ్చినప్పుడు చూడాలి, మా బిడ్డను తీసకొమ్మంటే, మా బిడ్డను తీసుకుపొమ్మని వూరి జనాలు తోసుకు చచ్చారు, యెద వలు..." పెద్దగా నవ్వాడు.

కాస్సేపు నిశ్శబ్దం. ఇంక ఏం మాట్లా డాలో మోహన్‌కు తోచలేదు.

"అది సార్ సంగతి, నా రెండో పోరికి ఏడేళ్లు- మీకు కావాలంటే తీసుకపోండి"

మోహన్ లేచి నిలబడ్డాడు. పాపయ్య వొంగి కాళ్లు పట్టుకున్నాడు. "సార్, మీరు దేవుడు సార్, ఇంతదూరం వొచ్చారు, సార్ ఒక్క పది రూపాయిలిప్పించండి సార్. పిల్లలకింత గంజి తాగిస్తా... నీ కాల్మొక్తా..."

పర్సుతీసి యాభైరూపాయలు తీశాడు. "ఇదిగో ఇది తీసుకుని ముందు పిల్లల తిండి సంగతి చూడు, ఆ తర్వాతే నీ ఖర్చు చూసుకో..."

వొంగి దండాలు పెడుతున్న పాప య్యను పట్టించుకోకుండా జీపువైపు నడి చాడు. బాలకార్మిక వ్యవస్థ గురించి ప్రతి వాడూ వుపన్యాసాలిచ్చేవాడే- అసలు కార ణమైన దారిద్ర్యాన్ని గురించి తెలివిగా దా టవేస్తారు. గర్భదారిద్ర్యమే మానవత్వాన్ని

మంట గలుపుతుంది. ఆడపిల్లల్ని పుట్ట గానే హత్య చేసే తల్లులకు తమ కన్నబి డ్డల పైన ప్రేమ లేదనా? పెద్ద పెద్ద భవ నాలలో వుండే తల్లులకు ఎంత ప్రేమ వుంటుందో, దానికి తక్కువేమీ వుండదు. కాని మానవ జీవితాలను శాసించేది ప్రేమ కాదు, డబ్బు. అది వుంటే అన్ని ప్రేమలూ వాటంతటవే పుట్టుకొస్తాయి...'

హైదరాబాద్ చేరేసరికి రాత్రయింది. రూముకు చేరుతూనే జకీర్‌కు ఫోను చేశాడు.

"...ఆ వూరు, మనుష్యులు, వాతావరణా న్ని చూశా.. మనం ఎక్కడో సోమాలియా గురించో, ఇథియోపియా గురించో, ఫారిన్ మేగజైన్సులో కలర్‌ఫోటోలతో వున్న వ్యాసాలు చదివి గుండెలు బాదుకుంటాం. మన రాజధానికి వంద కిలోమీటర్ల దూరంలో వున్న అనేక సోమాలియాల గురించి మనం పట్టించుకోం... ఎక్కడో మానవత్వం మంట కలిసిందని బాధప డతాం. మన కళ్లముందు పసిపిల్లల అమ్మకాలు మనం పట్టించుకోం.."

జకీర్ అంతా విని, "భాయిసాబ్, నేను నీకెప్పుడో చెప్పాను- నీ ఇన్‌వెస్టిగేటివ్ జర్నలిజం వొదిలెయ్యి, హాయిగా 'పేజ్ త్రీ' చూసుకో, పోలిటిషియన్స్‌ను కవర్ చెయ్యి డబ్బు చేసుకో, పైకి రా.." అన్నాడు.

"రేపు తీరిగ్గా మాట్లాడుకుందాం. కొంచెం లేటవుతుందని 'బాస్'కి చెప్పు.."

"ఆ భయం లేదులే, రెడ్డిగారు రేపు రావడం లేదు... ఓకే, బై..."

ఫోన్ పెట్టేసి వెళ్లి పడుకున్నాడు బట్టలు కూడా మార్చుకోకుండానే...

మర్నాడు సరాసరి లక్ష్మి 'యింటి'కి వెళ్లాడు. స్కూటర్ పార్క్ చేసి, పైకి వెళ్లాడు. లిఫ్టు నుంచి బైటకు రాబోయి ఆగాడు. లోపలకు వెళ్లబోయి ఆగింది లక్ష్మి.

మోహన్ నవ్వి, "ఏం లక్ష్మి, నీ కోసమే వస్తున్నాను... రా లిఫ్టులోకి" అన్నాడు.

లక్ష్మి సందేహిస్తూ లోపలకు వొచ్చి నిల బడింది. కిందకు వొచ్చాక, "స్కూటర్‌పైన వెడదాము, కూరలకే గదా?" స్కూటర్ వైపు నడవబోయాడు "వద్దు సార్, నడిచే పోతా.." అంటూ వెళ్లబోయింది.

"పద, నేనూ వస్తాను" అంటూ బయలు దేరాడు.

కొంత దూరం నడిచాక, "లక్ష్మి మీ వూరు వెళ్లాను నిన్న.. మీ నాన్నను కలి శాను"

లక్ష్మి ఆగింది.

"మా చెల్లీవాళ్లు.."

"వాళ్లను కలవలేదు, వీధిలోనే మీ నాన్న కలిశాడు.. ఇంటికి పోలేదు."

మోహన్ పశ్చాత్తాపపడ్డాడు. 'పిల్లలకు ఏ స్వీట్లో కొనియివ్వ వలసింది' అనుకు న్నాడు.

"మీ నాన్న నీ గురించి చాలా అడి గాడు- నువ్వు బాగున్నావా, భోజనం అదీ బాగుంటున్నదా అంటూ చాలా అడి గాడు."

లక్ష్మి అతని మొహంలోకి చూసింది. ఏదో అడగబోయి వూరుకున్నది.

"ఏవిటి లక్ష్మి?"

"మా నాయనా వాళ్లు ఇక్కడకు వస్తా మని చెప్పారా?"

"అవును, కూలీపనులు అవగానే వొస్తా మని చెప్పమన్నాడు"

"వూల్లో ఇప్పుడు కూలీ పనులు లేవు" మోహన్ గుండె పట్టేసినట్లయింది.

"లక్ష్మి, నీకు ఇక్కడ బాగుందా? మీ వూరు వెళ్లిపోవాలనిలేదూ?"

ఎవరో పిల్లలు అక్కడే పడుకున్న కుక్క పిల్లను రాళ్లతో కొడుతుంటే, దానివేపే చూస్తూ నడక సాగించింది లక్ష్మి.

"చెప్పు లక్ష్మీ, నీకు వెళ్లాలని వుంటే నేనే తీసుకుపోతాను... వెళ్లాలని లేదూ? "

"వెళ్లాలనే వుంది కాని..."

"ఏమిటి చెప్పు..."

"వెడితే నాయన, ఎందుకొచ్చావని చంపేస్తాడు..."




అమ్మగారూ, అయ్యగారూ కొద్దిరోజులుగా ఏదో చర్చిస్తున్నట్లు లక్ష్మికి అనుమానం కలిగింది. అదేదో తన గురించేననే అనుమానం కూడా... అదేవిషయం రాజమ్మను అడిగింది.

"నీకు తెలియదా? అయ్యగారికి వేరే వూరికి బదిలీ అయింది. అంటే అందరూ ఇక్కడనుంచి వెళ్లిపోతారన్నమాట..."

"మరి మనం కూడా..."

"పిచ్చిదానా, నేను వేరే యిల్లు చూసుకోవాలి"

"మరి... నేనో...? " అమాయకంగా అడిగిన ఆ ప్రశ్నకు రాజమ్మ జాలిపడింది.

"ఏమో, వారితో తీసుకుపోతారో లేక మీ వాళ్ల దగ్గరకు పంపుతారో? "

"నేను మా వూరికి పోను"

"వీళ్లు తీసుకుపోకపోతే, మీ వూరుపోక ఎక్కడకు పోతావు పిల్లా? "

"అమ్మగారూ వాళ్లతోనే పోతా"

ఇంతలో రాజమ్మను పిలిచింది జానకి. రాజమ్మ వెళ్లాక లక్ష్మి ఆలోచనలో పడింది. దాని చిన్నబుర్రలో రేపటి సంగతి ఏమిటి అనే ప్రశ్న అల్లకల్లోలం చేస్తున్నది.

'వీళ్లు వెళ్లిపోతే తనను ఇంటికి పంపేస్తారు. నాయన చావగొడతాడు, అది తన తప్పు అయినట్లు. తర్వాత మళ్లా ఇంకెవరింటికో పంపుతాడు- ఎవరో కొత్తవాళ్లు! వాళ్లెలా ఉంటారో? ' దానికి ఉన్నట్టుండి వీళ్లమీద ఆపేక్ష కలిగింది. పెంపుడుకుక్క తన్నినా తిండి పెట్టేవాళ్లను వదిలి పోలేనట్లు వీళ్లను ఒదలడం దానికి ఎంత మాత్రం ఇష్టంగా లేదు.

కళ్లు తుడుచుకుంటుంటే రాజమ్మ వచ్చింది. "ఏమిటి పిల్లా ఆ ఏడుపు? వీళ్లేం నీకు చుట్టాలా? అమ్మగారు చెబుతున్నారు. వారికి తెలిసిన వారెవరికో పనికి పిల్ల కావాల్ట... మీ వాళ్లను పిలిచి మాట్లాడి, అక్కడకు పంపుతారట..."

లక్ష్మికి బెంగ తీరింది గాని, ఎవరో కొత్త వాళ్లు అనడంతో భయం పుట్టింది.

"అమ్మగారు తమతో తీసుకువెళ్లరా? "

"నేను అడిగాను, వీలుపడదన్నారు. అయినా ఇదే మంచిది. ఇక్కడే ఉంటేమీ వాళ్లను కలుస్తూ వుండొచ్చుగదా? "

లక్ష్మి ఆలోచించింది.

"అమ్మగారూ! నేను ఇక్కడకు వచ్చి ఎన్ని రోజులైంది? " అడిగింది రాజమ్మను.

"సంవత్సరం దాటిందేమో! ఏం మీ వాళ్లను చూడాలనివుందా? "

దాని బుర్రకు ఒక ఆలోచన తట్టింది. 'తనను వేరే ఇంటికి పంపే ముందు నాయనా వాళ్లను పిలిపిస్తారని చెప్పిందిగా రాజమ్మ? '

ఒక గంట అయ్యాక జానకమ్మ లక్ష్మిని పిలిచింది. "లక్ష్మీ ఇలా రా, మేము బదిలీ అయి వేరే ఊరు పోతున్నాం. నిన్ను మాతో బాటు తీసుకుపోవటం కుదరదు. మరి మీ వాళ్ల దగ్గరకు పోతావా? "

ఎప్పుడూ లేనంత దయ చూపింది.

లక్ష్మికి మళ్లా భయం మొదలైంది. 'తనను వేరే వాళ్ల దగ్గర వుంచుతారని చెప్పింది గదా రాజమ్మగారు! ఈవిడ ఇలా మాట్లాడుతుందేం? అనుకున్నది. దానికి చెల్లెళ్లను చూడాలనివున్నా, శాశ్వతంగా ఊరు వెళ్లిపోవాలని లేదు... దానికి తెలుసు, ఊరు వెళ్లాక మళ్లా మరెవరికో అప్పచెప్పక తప్పదని... ఈలోగా తిండికి మాడటం...

లక్ష్మి ఏమీ అనకపోవడం చూసి, "...అయ్యగారికి తెలిసిన వాళ్లెవరికో ఇంట్లో పనికి పిల్లకావాలని అడిగారు. నీకిష్టమైతే మాట్లాడతారు. ఇక్కడే వుండిపోవచ్చు మీ అమ్మా నాన్నను చూస్తూ వుండొచ్చు... ఏమంటావు? "

"మీ యిష్టం అమ్మగారూ"

"ఇంతకు మీ నాయనేమంటాడో? "

"సరేనంటాడు" లక్ష్మి అంత నమ్మకంగా చెప్పటంతో ఆవిడ ఇంకేమీ మాట్లాడలేదు. "సరే, అయ్యగారు వొచ్చాక వారితో మాట్లాడతారులే..." అని మాత్రం చెప్పాక, ఆవిడ యింతవరకూ లక్ష్మితో అంత చనువుగా మట్లాడి తన యజమానితనం మర్చిపోయి నందుకు పశ్చాత్తాపపడుతూ, "పో, వెళ్లి పనిచూసుకో" అన్నది అధికార స్వరంతో...

లక్ష్మి వంటగదిలోకి వెళ్లింది.

రాజమ్మ తలెత్తి చూసి, "ఏమంటారే అమ్మగారు? " అని అడిగింది.

"నా యిష్టం అడిగారు. యిష్టమే నన్నా..."

రాజమ్మ జాలిగా చూసింది. దీని వయస్సెంత? హాయిగా తల్లిదండ్రుల చాటున పెరుగుతూ ఆడుకునే వయస్సులో పరాయి యిళ్లలో చాకిరీ చేయవలసి రావడం...

ఏంలోకమో ఏమో? అనుకున్నది, ఎవరిని తప్పుపట్టాలో తెలియక.

## కొత్తగాలి...

పక్షులు
పైకెగురుతున్నాయ్
నా కోరికల్లాగే
అవి...దిగేదెప్పుడో

-కన్నెగంటి అనసూయ, కూకట్‌పల్లి

"సరేగాని ఆ పేపరాయన మళ్లా కలిశాడా? " అనడిగింది రాజమ్మ.

"కలిశాడు. నన్ను మా నాయన కాడికి తీసుకపోతానన్నాడు"

"నువ్వేమన్నావు? "

"వెడితే మా నాయన చంపేస్తాడు"

లోపలనుంచి రోహిత్ కేకలు- లక్ష్మికి భయం వేసింది. అతను అరిచాడంటే తనకు ఏదో మూడుతుందని దానికి తెలుసు.

జానకమ్మ వొస్తూనే, దాన్ని జుట్టు పట్టుకున్నది. "పాడు ముండా.. నీకెన్ని సార్లు చెప్పాలే, బాబువస్తువులు ముట్టుకోవద్దని" అంటూ వీపుమీద నాలుగు బాదింది, దాని నేరమేమిటో కూడా చెప్పకుండానే...

రాజమ్మ అడ్డుపడింది. "నేను కనుక్కుంటాన్లెమ్మా..." ఆవిడ తిట్టుకుంటూ వెళ్లిపోయింది. లక్ష్మి జుట్టు సర్దుకుంటూ కళ్లు తుడుచుకుంటుంటే చూస్తూ, 'ఎక్కడైనా ఒకటే, ఎవరైనా ఒకటే' అంటూ గొణుక్కున్నది రాజమ్మ...

తర్వాత వంటపనిలో మునిగిపోయారిద్దరూ. దానిపని రాజమ్మ తరిగిన కూరలు కడిగి పెట్టడం, కడిగిన గిన్నెలూ అవీ సర్దటం... దానికి క్రమక్రమంగా పనులన్నీ చేతనవుతున్నాయి. చివరకు కాఫీ, టీ కలపడం కూడా నేర్చుకున్నది.

లక్ష్మికి తన పూర్వ జీవితానికీ, ప్రస్తుత



జీవితానికీ తేడా కనబడుతున్నది. మొదట్లో బస్తీని చూసి చాలా భయపడింది. ప్రతి మనిషీ రాక్షసుడిలా కనబడేవాడు. క్రమంగా భయం తగ్గుతున్నది. క్రింద వాచ్‌మెన్‌తో కబుర్లు చెప్పడం... తనవంటి పిల్లలు మరికొందరు ఈ అపార్ట్‌మెంట్సులో పనిచేస్తున్నారని దానికి తెలుసు. వాళ్లు కనబడ్డా అది పలకరించేది కాదు. కొత్త వాళ్లతో మాట్లాడితే ఎముకలు విరగ్గొడతానని 'అమ్మగారు' ఎప్పుడో బెదిరించింది...

వెళ్లేరోజు దగ్గరపడుతుండటంతో సామాన్లు సర్దుకోవడం ప్రారంభించారు. ఆ రోజు ఆదివారం, ఎవరో స్నేహితులు



వొస్తున్నారని త్వరగా టిఫిన్లు రెడీ చేశారు... వొచ్చేది తన కొత్త యజమాను లని తెలియడంతో లక్ష్మి గుండె దడదడా కొట్టుకోసాగింది.

భార్యాభర్తలిద్దరూ ఒడ్డూ పొడుగూ వుండి భయం పుట్టేట్టున్నారు...

వారిని ఆహ్వానించి కూర్చోబెట్టి టిఫిన్లు అందించారు. కొత్త అయ్యగారికి ఇళ్లు కట్టే పననీ, బాగా డబ్బున్న వాళ్లనీ రాజమ్మ అంతకుముందే లక్ష్మికి చెప్పింది. అయ్యగారు, అమ్మగారూ, వాళ్లతో వొంగి వొంగి మాట్లాడడం దానికి ఆశ్చర్యం కలిగించింది...

"ఇదేనా? " అడిగింది వొచ్చిన ఆవిడ,

లక్ష్మిని సంతలో పశువును చూసినట్లు చూస్తూ.

"అన్ని పనులూ బాగానే చేస్తుంది. నమ్మకమైందే- కాని కొంచెం భయపెడుతూ వుండాలి..." జానకమ్మ చెప్పుకుపోతున్నది.

"ఏయ్ పిల్లా, మా యింట్లో వుండి పని చేస్తావా? " ఆవిడ రూపంకంటె ఆ బొంగురు గొంతు విని లక్ష్మికి భయం వేసింది. నోట మాట రాక తల మాత్రం వూపింది.

"తర్వాత నేపోతానంటే వూరుకునేది లేదు, జాగర్త" అని గర్జించిందావిడ.

'కొత్తయ్యగారు' తినడం ముగించి నీళ్లు తాగుతున్నారు.

"మీరేం మాట్లాడరేం? " భర్తను అడిగిందాబొంగురు గొంతు.

"నువ్వు అన్నీ అడుగుతున్నావుగదా? " అంటూ, ఆ అమ్మాయివైపు తిరిగి "ఏమే పిల్లా.. జాగర్తగా పనిచేసుకుంటావు గదా? " అన్నాడు.

జానకమ్మ అడ్డుపడింది. "దాన్ని వూరికే బెదరగొట్టకండి.. లక్ష్మీ, ఇంక నువ్వెళ్లు."

లోపలకు రాగానే లక్ష్మి అభిప్రాయం అడిగింది రాజమ్మ.

"ఎక్కడో ఒకక్కడ వుండాలి గదమ్మగారూ? "

దాని మాటలకు ఆవిడ గొంతులో ఏదో అడ్డు పడినట్లయింది.

★ ★ ★

లక్ష్మి మకాం మారింది- అమీర్‌పేట నుండి చిక్కడపల్లికి. పూర్వ ప్రదేశంలో లాంటి ఖరీదైన మనుష్యులూ, ఖరీదైన కార్లూ, ఖరీదైన యిళ్లూ ఇక్కడ లేకపోవడం గమనించింది. కాని తన కొత్త యజమానులు మాత్రం చాలా డబ్బు గలవాళ్లనీ, వారిముందు పాతవాళ్ళు ఏమీలేని వాళ్ళతో సమానమని అర్థమైంది. పెద్ద యిల్లూ రెండు పెద్ద పెద్ద కార్లూ, డ్రయివరూ, ఆవరణలో అనేకమైన మొక్కలూ-

వారికి ఇద్దరూ ఆడపిల్లలే. పెద్ద అమ్మాయి లక్ష్మిని ఆదరంగానే చూసింది గాని, రెండో పిల్ల మాత్రం రోహిత్‌కు అక్కలానే వున్నది.

వీరందరి కంటే లక్ష్మికి సుమతమ్మగారిని చూస్తే ఎక్కువ భయం కలిగింది. ఆవిడ ఆకారం, బొంగురు గొంతూ-

ఇక్కడకు వొచ్చాక దానికి మరో భయం కూడా ఎక్కువైంది- మోహన్‌బాబు వొస్తాడేమోనని. అదే జరిగితే, 'అమ్మగారు' తనను చంపేసి, ఆ మొక్కల మధ్యే పాతేస్తుంది. కాని ఆయన ఓసారి కలిస్తే బాగుణ్ణు అని కూడా లోపల ఏదో కోరిక!

ఇక్కడ పని చాలా ఎక్కువ- 'ఆ' యింట్లో నాలుగు గదులైతే ఇక్కడ ఏడెనిమిది- చాలా పెద్ద హాలూ, హాల్లో ఎంతో పెద్ద సోఫా సెట్టూ- ఉదయం అయిదు గంటలకు నిద్రలేస్తే పనులన్నీ ముగించుకునే సరికి రాత్రి పదీ పదకొండూ అవుతుంది. ఇల్లు వూడ్చి తుడవడానికే రెండు గంటలు అవుతుంది. 'ఎంతసేపు ఆ పనీ- నిన్ను తగలెయ్యా.. ఆ గిన్నెలన్నీ ఎప్పుడు తోముతావు? ఇవాళ నా చేతిలో నీకు మూడిందే' లాంటి మాటలు మామూలే. గిన్నెలు ఓ బండెడు- అవన్నీ కడిగేసరికి లక్ష్మికి మరో గంటదాకా వొళ్లంతా నొప్పులు-

మొదటిసారిగా దానికి పాత యింటిని వొదలవలసి వొచ్చినందుకు విచారం కలిగింది...

ఈ పనులైనాక టిఫిను తిని, వంటాయన పరమయ్యతో కలిసి బజారుకు వెళ్లి రావడం- మళ్లా సాయంత్రం ఇల్లు వూడవడం, తుడవడం, మొక్కలకు నీళ్లు పోయడం- దాని పసివొళ్లు హూనం అయిపోతున్నది. రాత్రి ఏ పదకొండు గంటలకో

నిద్రపోతే మళ్లా వుదయం అయిదుగంట లకు అలారం మోగి నిద్ర లేపుతుంది.

ఈ పనులకంటే ఈ మనుష్యుల ప్రవ ర్తన వల్ల తనూ ఒక మనిషిననే భావన దానిలో క్రమంగా నశించిపోతున్నది. ఒక పని తర్వాత మరొక పని యాంత్రికంగా చేసుకుపోవడమేకాక, అమ్మగారు తిట్టే తిట్లు మాత్రమే దానికి తను వాషింగ్ మెషిన్‌లాగా ఒక యంత్రంకాదనీ, మనిషే ననీ గుర్తుకు తెస్తూవుంటాయి. ఆవిడ నిఘంటువులో దయ, కరుణ లాంటి పదాలు లేవు. చూడడమే పురుగుని చూసి నట్లు, కర్కశత్వం వుట్టిపడుతూ ఏదో గర్భ శత్రువు తన యింటిలో నివసిస్తున్నట్లు చూస్తుంది. లక్ష్మి పట్ల ఇదీ ఆవిడ ప్రవ ర్తన.

ఆవిడకు తనంటే ఎందుకంత ద్వేషమో అర్థంకాలేదు. పూర్వం 'అమ్మగారు' కూడా తనను తిట్టేది, కొట్టేది కూడాను. కాని ఇంత ద్వేషించేది కాదు. బహుశా ఈవి డకు పనివాళ్లను అసహ్యించుకోవడమే అలవాటేమోనని దాని మనస్సుకు తట్టింది.

'అక్కడి' లాగానే ఓ రోజు ఇక్కడకూడా హాల్లో టీవీ దగ్గర కూర్చుని, ఈ అమ్మగారి చేతిలో చావు దెబ్బలు తిన్నది. అప్పటి నుంచి శుభ్రం చేసేటప్పుడు తప్ప హాల్లో అడుగుపెట్టి ఎరగదు.

ఒకరోజు అనుకోని సంఘటన జరి గింది.

పెద్ద అమ్మాయి శ్రావ్య కాలేజి నుంచి త్వరగా వచ్చింది. తన గదిలో లక్ష్మి ఏదో బొమ్మల పుస్తకం చూస్తుండడం కనబ డింది. ఆమెను చూస్తూనే లక్ష్మి భయంతో బిగుసుకుపోయింది. శ్రావ్యను చూస్తే నిజానికి దానికి భయం లేదు. ఆ పిల్ల తనతో మంచిగా మాట్లాడుతుంది. అందరిలాగే గుడ్లురిమి చూడదు, తిట్టదు. అయినా ఆమె పుస్తకాలు తీసినందుకు భయపడి, శిక్షకు సిద్ధమైంది.

శ్రావ్య దగ్గరకు వొచ్చి పుస్తకం తీసుకు న్నది. "లక్ష్మి నీకు చదువు నేర్చుకోవాలని వున్నదా? " అని అడిగింది.

"ఎందుకు నాకు చదువు? "

"చక్కగా పుస్తకాలు చదువుకోవచ్చు- పెద్ద చదువులు చదువుకుంటే హాయిగా వుద్యోగం చేసుకోవచ్చు. ఈ పనులు చేయ క్కర్లేదు- అంతేనా, మీ వాళ్లందరినీ నీ దగ్గరే వుంచుకోవొచ్చు"

దానికి చదువు, వుద్యోగం అనే మాటలు వినగానే వొణుకు పుట్టింది.

"నాకొద్దు. నాకు రాదు"

"నేను నేర్పిస్తా, రోజుకొక గంట చదు వుకో చాలు"

"అమ్మో, అమ్మగారు చంపేస్తారు" లేచి బైటికి వెళ్లబోయింది.

"వుండవే మొద్దూ, పనులన్నీ చేశాక మధ్యాహ్నం ఖాళీయేగదా, అమ్మ ఏమీ అనదు..."

లక్ష్మి మాట్లాడకుండా బైటకు వొచ్చే సింది- దానికి భయమూ వేసింది, ఏదో ఆశా కలిగింది. నిజంగా చదువుకుంటే మంచి వుద్యోగం చేయొచ్చేమో? అయినా తనకు చదువెలా వొస్తుంది? శ్రావ్యమ్మ అలాగే అంటుంది అనుకుంది.

కనిపించినప్పుడల్లా చదువు సంగతి మాట్లాడడంతో శ్రావ్యను తప్పించుకు తిర

## కొత్తగాలి...

**వెలుతురును మింగి**
**విర్రవీగుతుంది నిశి!**
**విజ్ఞానాన్ని మింగి**
**వీధినపడుతుంది కసి**

**–సి. కామేశ్వరరావు, కాశీబుగ్గ**

గసాగింది లక్ష్మి.

ఒకరోజు మొక్కలకు నీళ్లు పెడుతున్న లక్ష్మిని పట్టుకుంది శ్రావ్య.

"నేచెప్పేది విను, చదువు అంత కష్ట మేమీ కాదు. చదువొస్తే హాయిగా బ్రత కొచ్చు- రోజూ ఇట్లా పనులన్నీ చేస్తూ తిట్లు కూడా తినడం నీకిష్టమా, చెప్పు? "

తను మాట్లాడక పోయేసరికి ఆ పిల్ల కొంచెం చిరాకుతో "మాట్లాడవేం? హాయిగా మీ చెల్లెళ్లనూ నీ దగ్గరే వుంచు కోవచ్చు" అన్నది.

"అమ్మగార్ని అడిగి..."

అమ్మగారు కేక పెట్టడంతో లోపలకు పరుగెత్తింది.

శ్రావ్య మాట్లాడిన విషయం దాని బుర్ర లోంచి బైటకు పోలేదు. చదువువల్ల ముఖ్యమైన వుపయోగం వున్నదని తెలుసు కున్నది. వుద్యోగం చేసుకోవచ్చు, తనవా ళ్లను దగ్గరే వుంచుకోవచ్చు. చెల్లెళ్లను చది వించుకోవొచ్చు, తను ఎవరింట్లోనూ పని చేయవలసిన అవసరం వుండదు, తిట్లూ దెబ్బలూ వుండవు.

ఈ ఆలోచనలతో దానికి ఏదో చెప్పలేని ఆనందం కలిగింది. అమ్మను నాన్న వుత్తినే చావగొడతాడు. అదే అమ్మ చదు వుకుని, వుద్యోగం చేస్తే ఎందుకు కొడ తాడు?

కాని మళ్లా నిరాశ కలిగింది. చదువుకో వడమంటే ఎంత కష్టం? పైగా ఎవరు చదివిస్తారు? వీళ్ళు యింట్లో వుంచుకు న్నంతకాలం శ్రావ్యమ్మ చదువు చెపు తుంది. వీళ్లు తనని మరొక యింటికి పంపేస్తే అప్పుడు?

రోజులు గడుస్తున్నకొద్దీ సుమతి తన విశ్వరూపం చూపుతున్నది. తిట్లూ, దెబ్బలూ, మామూలైపోయాయి. ఏ చిన్న తప్పుకయినా తిట్లతో మొదలై, దెబ్బలతో సమాప్తి అవుతున్నది. ఆ దెబ్బలకు తర్వాత బాత్‌రూంలోనికి పోయి తనలో తనే కుళ్లి కుళ్లి ఏడవడం తప్ప చేసేదేమీ లేదు. ఏడుపు బయటకు వినిపిస్తే, మళ్లా చావుదెబ్బలు తినవలసి వస్తుంది.

ఒకరోజు-

అయ్యగారి షర్టు జేబులో ఉన్న నోట్లు గమనించక బట్టలు జాడించింది. తర్వాత చూసి, తడిసి ముద్దయిన నోట్లు భద్రంగా తీసుకుపోయి సుమతి చేతికి అందించింది వొణుకుతూ.

ఆవిడ బండ బూతులు తిడుతూ లక్ష్మిని జుట్టు పట్టుకుని నేలకేసి కొట్టింది.

".. నీకు బాగా తిండి తిని వొళ్ళు కొవ్వె క్కిందే! డబ్బు తడిపి ముద్ద చేస్తావూ! నీ పని ఇట్లా కాదే..." దాన్ని ఈడ్చుకుంటూ బాత్‌రూంలోకి తీసుకుపోయి, ఒళ్లు కాలి పోయే వేడి వేడి నీళ్లు కాళ్లపైన పోసింది. అది బాధ తట్టుకోలేక ఆవిడ ముందు ఏడ వరాదనే సూత్రం మరచిపోయి, భయంక రంగా అరుస్తూ ఏడ్చేసింది!

"అమ్మగారూ.. వొళ్లు కాలిపోతోంది.. చచ్చిపోతానే.. నీకాల్మొక్తా.. వొదిలి పెట్టు.. అమ్మో మంట"

లోపల నుంచి పిల్లలు పరుగెత్తుకుంటూ వొచ్చారు. శ్రావ్య తల్లి చేతిలోని మగ్గు లాగేసింది.

"ఏమిటమ్మా, దాన్ని చంపేస్తావా? " అ ని గద్దిస్తూ లక్ష్మి కాళ్లపైన చల్లటి నీళ్లు కుమ్మరించింది. తన గదిలోనికి తీసుకుపో యింది.

దాని కాళ్లపైన మాంసం వుడికి, ఎర్రగా అయిపోయింది. దాన్ని కుర్చీలో కూర్చో బెట్టి బకెట్లో చన్నీళ్లు తెచ్చి, దానిలో కాళ్లు వుంచింది.

లక్ష్మి బాధకు ఏడుస్తూనే ఉన్నది. కాళ్లు రెండు బురబురా పొంగి పోయి, బొబ్బలు పుట్టుకొచ్చాయి.

శ్రావ్యకు ఏడుపొచ్చింది. "ఇప్పుడు

కొంచెం నెప్పి తగ్గిందా లక్ష్మీ?" అన్నది దాని కాళ్లు తుడుస్తూ. ఆ పిల్లకు తన తల్లిని చంపాలన్నంత కోపం కలిగింది.

లక్ష్మి వెక్కిళ్ల మధ్యనే తలూపింది. ఒక గంట తర్వాత దాన్ని మెల్లగా లేపి బట్టలు మార్పించి, హాల్లోకి తీసుకువచ్చింది.

సుమతి కూర్చుని వున్నది విసుగ్గా. కూతుర్ని చూసి, "ఏమైందనే అంత గొడవ? కొంచెం బర్నాల్ రాస్తే సరి- అదేం చేసిందో నీకు తెలుసా?" అన్నది.

"చాల్లే వూరుకోమ్మా- నువ్వు చేసిన పని... నేను దీన్ని హాస్పిటల్‌కు తీసుకు పోతున్నా..." కూతురి కోపం గ్రహించి ఆవిడ మరి మాట్లాడలేదు.

పరమయ్య జాలిగా చూస్తూ, "ఆటో పిల వమంటారా?" అడిగాడు.

రెండు వీధుల అవతల ఉన్న నర్సింగ్ హోమ్‌కు తీసుకువెళ్లి ఇంజక్షన్ ఇప్పించి, బాండేజి వేయించింది.

ఇంటికి తీసుకువచ్చి తన గదిలో క్రింద పక్కవేసి పడుకోబెట్టి హాల్లోకి వచ్చింది.

సుమతి చాలా దయతో "పరమయ్యా, ఈ పూటకు ఏదోవంట చేసెయ్యి. ఆ పిల్లకు ఏ పనీ చెప్పకు..." అని చెప్పి కూతురితో, "ఇంజెక్షన్ ఇప్పించావా?" అని ప్రశ్నించింది.

దానికి జవాబు చెప్పకుండా,

"ఏమిటమ్మా.. మరీ అలా చేశావు? చిన్నపిల్లనే దయ కూడా లేకుండా.."అంది.

దానికామె కూతుర్ని గదమాయించింది.

"చాల్లే, ఏదో అయిపోయింది. దాన్ని వెనకేసుకురాకు- నోట్లన్నీ తడిసి ముద్ద అయినాయి తెలుసా? ఇంకా నయం, డాడీ లేరు యింట్లో.. ఇంతకూ ఎలా ఉంది దానికి..?"

శ్రావ్య లోనికి పోతూ, "ప్రాణానికి ఏం భయం లేదులే.." అన్నది. పాలు తెచ్చి యివ్వమని పరమయ్యకు చెప్పింది.

కూతురి మనస్థితి గమనించి ఆవిడ మారుమాట్లాడలేదు.

లక్ష్మి పక్కనే నేలపైన కూర్చుని శ్రావ్య ఆమె తల నిమిరింది.

"అమ్మగారూ" పిలిచింది లక్ష్మి, నీర సంగా.

"ఏమిటి లక్ష్మీ, చెప్పు.. ఏం కావాలి?"

"నేను చదువుకుంటానమ్మగారూ?"

★ ★ ★

మోహన్ కాలింగ్ బెల్ నొక్కాడు.

ఒక సిక్కు- ముసలాయన తలుపు తెరి చాడు.

"మాఫ్‌కీజియే, సుదర్శనరావు...?"

"అబ్ యహాఁ నైరహతే- ట్రాన్స్‌ఫర్ హోకర్ చలాగయా" మరొక మాటకు అవ కాశమివ్వకుండా తలుపు వేసేకున్నాడు ఆ వ్యక్తి.

మోహన్ క్రిందికి దిగాడు.

అతన్ని చూసి వాచ్‌మెన్ కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు.

"మూడో ఫ్లోర్‌లోని సుదర్శనరావు గారు..."

"ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోయారు సార్, పదిరోజులయింది."

"ఏ వూరు?"

"తెలియదు సార్."

"వారి వద్ద లక్ష్మి అనే పిల్ల వుండేది, దాన్ని కూడా వారితో తీసుకువెళ్లారా?"

"లేదు. ఆ పిల్ల అంతకు ముందే వెళ్లిపో యింది. మంచి పిల్ల, పాపం ఎక్కడు న్నదో.."

"ఎక్కడకు పోయిందో?"

మోహన్ పర్సులోంచి ఓ యాభై రూపాయల నోటు తీశాడు.

"వాళ్లు వెళ్లేటపుడు నేను డ్యూటీలో లేను సార్, రెండో వాచ్‌మన్‌ను వాకబు చేస్తా.."

డబ్బులూ, తన కార్డు ఇచ్చి, "ఆ పిల్ల

గురించి సమాచారం కావాలి ఎలాగయినా చూడు..” అన్నాడు మోహన్.

“తప్పకుండా.. మీకెందుకు సార్, వాళ్ల వంటామె రాజమ్మ ఇల్లు తెలుసు. మీకు రెండ్రోజుల్లో ఫోన్ చేస్తాను సార్..”

మోహన్ స్కూటర్ స్టార్ట్ చేసి బయటకు వచ్చాడు. రోడ్డు చివర వున్న హోటల్లో కూర్చుని టీ ఆర్డరిచ్చాడు.

పాపం ఎక్కడుందో, ఎలా వుందో? ఇన్నీ చట్టాలున్నా, పోలీసు వ్యవస్థ వున్నా, ఈ దిక్కులేని పిల్లలకు రక్షణ లేదు. ఒకరి చేతుల్లోంచి మరొకరి చేతుల్లోకి వ్యాపార వస్తువుల్లాగా అమ్ముడుపోతున్నారు. ప్రజా ప్రతినిధులు మాత్రం చట్టసభల్లో శ్రీరంగ నీతులు మాట్లాడుతూనే వున్నారు...

“హలో బ్రదర్, నీ చిట్టి హీరోయిన్ కథ ఎంతవరకూ వొచ్చింది? అడ్రసు తెలిసిందా? ” జకీర్ ఫోను..

“ఆ పిల్ల తండ్రిని కలిశాను. వాడో ఆల్కహాలిక్! వాడి రెండో పిల్లను నాకమ్ముతానంటాడు. ఎన్ని చట్టాలు చేసినా, దరిద్రం పోతే తప్ప ఈ పరిస్థితులు మారవు. సరే, అది పోనీ... నీకు వేరే పనేమీ లేకపోతే, నాకు హెల్ప్ చేయి, ఆ పిల్లను ట్రేస్ చేయడంలో..”

“నన్నెందుకు లాగుతావు బాబూ”

★ ★ ★

ఆఫీస్‌బాయ్ వొచ్చి బాస్ పిలుస్తున్నారని చెప్పాడు.

“రా మోహన్, నిన్న కనబడలేదే? సరే, సాయంత్రం నాకు ప్రెస్ క్లబ్‌లో మీటింగ్ వున్నది. ఎమ్మెల్యే క్వార్టర్సుకు పోయి, బడ్జెట్ రియాక్షన్స్ కవర్ చేయాలి, ఫొటోగ్రాఫర్ అవసరం లేదులే.. ఓకే”

మోహన్‌కు చిరాకు కలిగింది. ప్రతిసారీ ఇలాంటి పనులకు తననే ఏరుకుంటాడు. ఈ నాయకులు ఓ పట్టాన కదలరు, గంటలు గంటలు వెయిటింగ్, వెధవ న్యూసెన్స్..

మోహన్ బయటకు వొచ్చి జకీర్‌ను కలిశాడు. మోహన్‌కు ఓ ఆలోచన తట్టింది.

“మనం ఎమ్మెల్యే క్వార్టర్సుకు పోవాలి. తోడుగా రా..”

“ఓ! ప్రజా ప్రతినిధులను కలవాలంటే నేను ఎప్పుడూ తయారే... బ్రదర్, ఇలాంటి డ్యూటీలే ఎప్పుడూ వేయించుకో-పైకి వొస్తావు. అంతేగాని బాలకార్మికులు, పేద విద్యార్థులు, వెల్‌ఫేర్ హాస్టల్సూ అంటూ టైం వేస్టు చేసుకోకు...”

డ్యూటీ అయ్యేసరికి సాయంత్రమైంది. మోహన్‌కు వొళ్లు మండిపోతుంటే జకీర్ నవ్వుతున్నాడు.

“చూశావా బ్రదర్, చంకలో బిడ్డను

## అద్దె

కొత్తగా పెళ్లయిన మంగతాయారు తనింటికి వచ్చిన ఫ్రెండ్ సుమకు తన నగానట్రా, ఇల్లూ వాకిలీతోపాటు ఖరీదైన ఫారిన్ కారునూ గొప్పగా చూపించింది.

‘కారు మీ నాన్నగారు కొనిపెట్టి ఉంటారు. ఔనా?’ అంది సుమ.



‘అబ్బే! మావారు అలాంటి గిఫ్ట్‌లు తీసుకోవడం ఇష్టపడరే! అదిక్కడ ఉంచినందుకు నాన్నే దానికి రెంట్, మెయింటెనెన్స్ ఛార్జీలు చెల్లిస్తారు’

‘...’

పెట్టుకుని వూరంతా వెదికినట్లు, ఈ క్వార్టర్స్‌లోనే ఎందరో చిన్నపిల్లలు పనులు చేసుకుంటూ కనబడ్డారా లేదా? చేతనైతే వీరందరికీ విముక్తి కలగజేయి..? "

మోహన్‌కు ఏం జవాబివ్వాలో తెలియ లేదు.

"నా మాట విని ఈ గొడవ ఇంతటితో వొదిలెయ్యి.. రెడ్డిగార్ని సంతోషపెట్టా లంటే.. మసాలా న్యూస్ తయారుచెయ్యి.. లీడర్స్ దృష్టిలోపడు, ఫ్యూచర్ వుంటుంది" అని సలహా యిచ్చాడు సగం వేళాకోళంగా, సగం సీరియస్‌గాను.

"లెక్చర్ ఆపి స్కూటరెక్కు"

అమీర్‌పేట వేపు పోతుంటే, జకీర్ తల పట్టుకున్నాడు.

వాచ్‌మెన్ మోహన్‌ను చూస్తూనే లేచి నమస్తే చెప్పాడు. జేబులోంచి చిన్న కాయితం తీశాడు. "ఇదుగో సార్, ఆ పిల్ల అడ్రసు.. ఆ రాజమ్మను కలవడానికి చాలా శ్రమ పడవలసివొచ్చింది సార్"

మోహన్ పర్సు తీసి యాభైరూపాయలు ఇచ్చాడు. జకీర్ నసుగుతూ, "ఏం బ్రదర్, ఇప్పుడే పోవాలా? టైము చూడు, రేపు వుదయం పోవొచ్చుగదా? " అన్నాడు.

"ముందు స్టార్ట్ చేయి"

ఇల్లు కనుక్కునేసరికి తొమ్మిదయింది. "ఇంటి వాళ్లను కలవద్దు. పాపం, క్రితం సారి నా వల్ల దెబ్బలు తిన్నది లక్ష్మి" అంటూ ఆ వీధి మూల పైనున్న కూరగా యల దుకాణం వద్ద ఆగి ఏవో కూరలు కొన్నాడు. డబ్బులిస్తూ, "ఇక్కడ కృష్ణారెడ్డి అని బిల్డింగ్ కాంట్రాక్టరు ఇల్లుతెలుసా? " అడిగాడు.

"అదిగో అదే సార్, ఆ పచ్చ కాంపౌండ్ ఇల్లు"

"ఇప్పుడు దొరుకుతాడా? మాకు బాగా తెలిసిన వారేలే" అన్నాడు మోహన్.

"ఆయన ఎక్కువగా వూర్లు తిరుగుతూ వుంటాడు. యింట్లో భార్య, ఇద్దరు ఆడపి ల్లలు వుంటారు. అన్నట్లు ఓ పని పిల్లను కూడా ఈ మధ్యనే తెచ్చారు.. ఇప్పుడున్నాడేమో పోయి అడిగి చూడండి" అని సలహా యిచ్చాడు దుకాణం మనిషి.

మోహన్ టయిమ్ చూసుకుని, "ఇప్పుడొద్దులే, చాలా పొద్దుపోయింది. రేపు వుదయం వొస్తాంలే.." అని జవాబిచ్చి సంతోషంగా స్కూటర్ స్టార్ట్ చేశాడు.

జకీర్ అభినందించాడు.

"సాధించావు- తర్వాత కార్యక్రమం? "

మోహన్ ఆలోచిస్తూ, "ఈ సారి కొంచెం ప్లాన్డ్‌గా పోవాలి. ఆ పిల్లకు యిబ్బంది కలగకూడదు" అన్నాడు.




**ల**క్ష్మికి గాయాలు కొద్దిగా తగ్గడంతో మెల్లగా పనుల్లోకి దిగింది. సుమతి మొదట్లో కొంచెం కంగారుపడినా తిరిగి తన పూర్వపు అవతారం యెత్తింది. లక్ష్మి మాత్రం శ్రద్ధగా శ్రావ్య వద్ద చదువు నేర్చు కోసాగింది. అది కూడా మధ్యాహ్నం అమ్మగారు బయటకు వెళ్లినప్పుడు మాత్రమే.

సుమతికి శ్రావ్యను చూస్తే మండిపోతు న్నది. 'పనివాళ్లను దూరంగా వుంచాలి. ఇది మరీ నెత్తికెక్కించుకుంటున్నది. ఇలా కాదు- ఆయన వూరినుంచి వొచ్చాక శ్రావ్యకు బాగా చివాట్లు తగిలిస్తే సరి.'

ఆవిడకు రెండోకూతురిపైన చాలా ఆపేక్ష. క్రూరత్వం సమర్థతగా చెలామణీ అవడం మామూలే. ఆ విషయంలో మాధవికి తల్లికీ వున్న తేడా కేవలం వయస్సులో మాత్రమే!

అక్క పనిపిల్లకు చదువు చెప్పడం మాధవి గమనించి, అక్కతో పోట్లాట వేసుకున్నది.

"అక్కా, దాన్ని ఇలా నెత్తికెక్కించుకోవడం ఏమీ బాగా లేదు" అన్నది.

"నోరు మూసుకో, దాని కాళ్లు ఎలా కాలిపోయాయో చూశావా? అమ్మ పిచ్చి కోపంలో ఎప్పుడో దాని ప్రాణాలు తీసేస్తుంది"

"నీకు తెలీదులే, పనులు చేసుకునే వాళ్లకు ఈ గాయాలు మామూలే. దానికేం.. నాలుగు బొబ్బలు ఎక్కగానే హాయిగా కూర్చుని తిన్నది వారం రోజులు ఏ పనీలేకుండా.. అమ్మ కోపమొచ్చి ఓ దెబ్బ వేస్తే ఏమైందిట? నువ్విట్లా దాన్ని దగ్గరకు తీస్తూవుంటే, అది ఇంట్లో మిగిలిన వాళ్లను లెక్క చేస్తుందా?" అని వాదించింది.

"నోరు ముయ్యి, ఈసారి లక్ష్మి సంగతి ఎత్తావంటే వూరుకునేది లేదు- ఫో అవతలకు" అని చీదరించుకుంది శ్రావ్య.

మాధవికి ఉక్రోషంతో కళ్ల నీళ్లు వొచ్చాయి. 'నాన్న ఊరినించి రానీ, నీ సంగతి చెబుతా' అని గొణుక్కుంటూ అవతలకు పోయింది.

ఏదో పుస్తకం చూస్తూ ఇదంతా వింటున్న లక్ష్మి, పుస్తకం మూసేసి, లేచింది- "అమ్మా, నేను వెళ్లి పని చూసుకుంటా- చాలావరకు పుళ్లు తగ్గినయి గదా?"

శ్రావ్య ఏదో చెప్పబోయి వూరుకున్నది. 'తన వల్ల లక్ష్మికి ఏ వుపయోగమూ లేదు. నాన్న వొస్తే తననే తిడతారు. ముగ్గురూ ఒకటైపోతారు..'

## కొత్తగాలి...

**కోర్కెల జాబితా**
**కొత్తచాంతాడంత!**
**దొరికిన జీతం**
**పాతచింతపండంత**

**-శైలూషి, అరసవిల్లి**

గది నుంచి వెలికిరాగానే లక్ష్మిని వెనక నుంచి వొచ్చి జుట్టు పట్టుకున్నది మాధవి. "పాడు ముండా! అక్కచేత తిట్టిస్తావు? నాన్నను రానియ్యి, నీ తోలూడదీయిస్తా" ఒక్క తోపుతోసి వెళ్లిపోయింది.

జుట్టు సర్దుకుని, చీపురు చేతిలోకి తీసుకున్న లక్ష్మికి హఠాత్తుగా మోహన్ సార్ గుర్తుకు వొచ్చాడు. 'సార్ మంచివాడు. తనను వూరికి తీసుకుపోతానన్నాడు- వెళ్లి ఏంచేయాలి? నాయన వూరుకుంటాడా?'

విచిత్రంగా ఆ రోజే దానికి బజార్లో మోహన్ కనబడ్డాడు. దగ్గరకు వొచ్చాడు.

"బాగున్నావా లక్ష్మీ? నేను గుర్తున్నానా?" లక్ష్మికి భయం వేసింది. యింటివైపు చూసింది.

పరమయ్య తలెత్తి చూశాడు.

"ఎవరు సార్?"

లక్ష్మి అయోమయంగా చూసింది.

"నా పేరు మోహన్, ఇంతకు ముందు లక్ష్మి పనిచేసిన యింటివాళ్లు నాకు తెలిసినవాళ్లు. అక్కడే చూశా..." తనను పరిచయం చేసుకున్నాడు. పరమయ్య కూడా తన గురించి చెప్పాడు.

"లక్ష్మీ, మీ వాళ్లకు నువ్విక్కడున్నావని తెలుసా? ఎప్పుడైనా వొచ్చిపోయారా?"

"వొచ్చారు"

మోహన్‌కు ఇంకా సంభాషణ ఎలా పొడిగించాలో తెలియక అలాగే నిలబడ్డాడు.

సరుకులు కొనడం ముగించి, డబ్బులిచ్చేశాక, "సార్, యింటివరకూ వస్తే, కూర్చుని మాట్లాడుకోవొచ్చు, పద లక్ష్మీ" అంటూ బయలుదేరాడు పరమయ్య.

"అవసరం లేదులెండి" పర్సులోంచి తన కార్డు తీసి, "ఇది వుంచుకో లక్ష్మీ. దీనిలో నా అడ్రసూ, ఫోను నంబరూ వున్నాయి" అంటూ పర్సులోంచి వందరూపాయల నోటు తీసి యివ్వబోయాడు.

లక్ష్మి తీసుకోలేదు. పరమయ్య చేతికి యిచ్చాడు. "మీ వద్ద వుంచండి, అవసరమైనవి కొనిపెట్టండి"

లక్ష్మి మొహంలో పూర్వపు కళాకాంతులు లేకపోవడం, దెబ్బతిన్న గొడ్డులాగా బెదురు చూపులు చూడడం గమనించాడు. పాదాలమీద కనబడుతున్న తెల్లటి మచ్చలు చూశాడు. "ఏమైంది? ఏమిటా మచ్చలు?"

పరమయ్య వెంటనే, "వేడివేడి నీళ్లు పడినాయి బాబూ, ఇక పోదాం పద లక్ష్మమ్మా, లేటయిపోతోంది" అని బయలుదేరాడు.

కూరగాయల సంచీ మోస్తూ నడుస్తూ వెనక్కి తిరిగి చూసింది. అతనికి గుండె పట్టేసినట్లయింది.

ఆరోజు రాత్రి టీవీలో ఒక వార్త మోహన్‌ని ఎంతో కలవరపరిచింది. బదిలీమీద వచ్చి ఒంటరిగా నగరంలో ఉంటున్న ఓ ప్రభుత్వోద్యోగి తనింట్లో పనిచేస్తున్న పసిపిల్లను అత్యంత రాక్షసంగా కొట్టి చంపాడన్నది ఆ వార్త సారాంశం. అసలు ఆ పసిపిల్లలు పనిపిల్లలుగా ఎట్లా మారిపోతున్నారు? పిల్లలను కనడమే కానీ, పెంచే బాధ్యతను గుర్తించలేని తల్లిదండ్రులు, ఒకవేళ గుర్తించినా సక్రమంగా పెంచలేని దరిద్రం... కుటుంబాన్ని పెంచుకోవడమే కానీ నియంత్రణపట్ల సరైన ప్లానింగ్‌లేని పెద్దలు... అందరూ దోషులే... అని నిట్టూర్చాడు మోహన్. లోకంలో పనిపిల్లలుగా మారిన ప్రతి చిన్నారినీ బయట పడేయలేకపోయినా.. ఒక్కరికైనా మేలు చేకూర్చేలా ప్రయత్నిస్తే జన్మ సార్థకం.. అనుకున్నాడతను.

"అందరూ పెద్దమనుషులే, నీతిపాఠాలు వల్లించేవారే. ఒక చిన్నపిల్ల, దానికి బాల్యం లేదు, చదువు లేదు, ప్రేమించేవారు లేరు- బానిసబతుకు తప్ప. దీనికి ఎవరు కారణం? చట్టాలు చేసి చేతులు దులిపేసుకునే పెద్దమనుషులా? పసిపిల్లల చేత ఇంటిపనంతా చేయించుకుని హింసలు పెట్టే మర్యాదస్తులా? కనీసం పశుప్రేమ కూడా లేకుండా వీళ్లను నరకంలోకి నెట్టే తల్లిదండ్రులా? కార్మికులకూ, గృహిణులకూ, మధ్యతరగతికీ, విద్యార్థులకూ- అన్ని వర్గాలవారికీ ఈ సమాజంలో హక్కులున్నాయి. కాని ఈ నోరులేని పసిపిల్లలకు అన్ని హక్కులూ నిరాకరిస్తున్నారు కదా?"

చేతిలోని సిగరెట్టు నేలకేసి విసిరికొట్టి, స్కూటరు స్టార్టు చేశాడు. 'బర్కత్‌పుర చమన్' ఏరియా దాటి ఒక సందులోకి మళ్లాడు. పార్కింగ్‌లో స్కూటరు ఆపి, మెట్లెక్కాడు.

"హలో మోహన్! బాగున్నారా? కూర్చోండి"

"ఆ పిల్ల సంగతి- సుదర్శనరావు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోతూ, తన స్నేహితుడొకరికి అప్పగించాడు"

శాంతాదేవి లేచి లోపలకు వెళ్లబోతూ ఆగింది- "రోమన్‌కాలపు బానిస సమాజపు ఛాయలు ఇంకా మిగిలివున్నాయి"

మోహన్ ఆలోచిస్తూ, "నిజమే, దేశం ఇంత ప్రగతి సాధించినా మానవహక్కుల విషయంలో మాత్రం వేలాది సంవత్సరాలు వెనకబడే వున్నది. అంటరానితనం, చిన్న పిల్లలచేత బండెడు చాకిరీ చేయించు

కోవడం, కట్నాల చావులు- ఇంకా చెప్పా లంటే ఈనాటికీ అక్కడక్కడ జరపబడు తున్న సతీసహగమనాలూ.. ఒక్కటే తేడా, ఆనాటి సమాజం ఇవన్నీ ఆమోదిస్తే, ఈనాడు అనేక చట్టాలున్నా.. ఇవన్నీ నిరా టంకంగా జరుగుతున్నాయి. కొంతకాలం క్రిందట రాజస్థాన్‌లో ఒక 'సతి' సంఘటన ఒక మంత్రివర్యుల ఆధ్వర్యంలో జరిగినట్లు వార్త వచ్చింది" అన్నాడు.

శాంతాదేవి రెండు కప్పుల్లో కాఫీ తీసుకు కొచ్చింది.

"ఇప్పుడా పిల్ల కృష్ణారెడ్డి అనే సివిల్ కాంట్రాక్టర్ యింట్లో- చిక్కడపల్లిలో వుంటున్నది. అదలా వుంచి ఒక భయంకరమైన విషయం- ఈ మధ్య డ్యూటీమీద ఎమ్మెల్యే క్వార్టర్సుకు వెళ్లాము. అక్కడ డజనుమందిపైగా 'బాల బాని సల్ని' చూశాను. దానికేమంటారు? .. లాభంలేదండీ, మనం చేస్తున్న కార్యక్ర మాలు కేవలం కంటితుడుపు మాత్రమే.." అన్నాడు మోహన్.

"వ్యవస్థ అలా వున్నది. అలా అని ఏ పనీ చెయ్యకుండా అస్త్రసన్యాసం చేయలేం గదా? కనీసం ఇలాంటివి జరుగుతున్నా యనే విషయాన్ని సమాజం దృష్టికి తీసు కురావడం మంచి పనేగదా.. ఎప్పుడు వెళ్లాలి మనం? " అందామె.

మోహన్ విసుగ్గా, "వెళ్లి ఏం చేయా లండీ? ఆ పిల్లను బయటకు తీసుకు వస్తాం, ఏ సంక్షేమ హాస్టల్లోనో పెడతాం. అక్కడ వాతావరణం మనకు తెలియనిది కాదు. అదీ పరిస్థితి. దీనివల్ల ప్రయోజనం ఏమిటి? "

ఆవిడ చిరాకుపడింది. "మానవహక్కుల పోరాటం నిరర్థకం. పోలీసు వ్యవస్థా, చట్ట సభలూ, చివరకు కోర్టుల వల్ల కూడా ఏ ప్రయోజనం లేదు. కాబట్టి అన్నీ భరిస్తూ బ్రతకాలి. లేక చావాలి. అదేగా మీర నేది? "

## కొత్తగాలి...

**సిటీ బంగ్లాలు**
**సిమెంటుకొండలు**
**ప్రజలుండేది**
**గుహల్లోనేకదా!**

**-పెరుక రాజు, నర్సింగాపూర్**

మోహన్ పశ్చాత్తాపపడుతూ, "సారీ మేడమ్, ఏదో నిరాశతో మాట్లాడాను. మీరన్నది నిజమే. ప్రజాస్వామ్యంలో దొరికే ప్రతి అవకాశాన్నీ వినియోగించుకో వాలి" అంటూ కుర్చీలోంచి లేచాడు.

మెట్లు దిగుతూ జకీర్‌కు ఫోను చేశాడు. "మేడమ్‌ను కలిశాను. సాయంత్రం ఆరు గంటలకు చిక్కడపల్లి ప్రోగ్రాం- నోనో, తప్పించుకోవాలని చూడకు.. కెమెరాతో సహా వొచ్చెయ్యి..."

★ ★ ★

లక్ష్మి పరిస్థితి రోజురోజుకూ దిగజారి పోతున్నది. మోహన్ వాళ్లు వొచ్చి వెళ్లాక పరిస్థితి మరింత దుర్భరం అయింది. చాలా ఘర్షణ పడ్డారు. వొచ్చినవాడు సుమతితో చిన్నపిల్లను బానిసలాగా ఇంటి పనంతా చేయించడమేగాక భౌతికంగా కూడా హింసిస్తున్నారనీ, అది చట్ట విరుద్ధ మనీ- వాదించాడు.

ఆవిడ మండిపడింది. "ఎవరు మీరు? ఇంటిమీదకు వొచ్చి గొడవ చేస్తున్నారు- దాన్ని మేమేమీ కట్టిపడెయ్యలేదు. దాని అమ్మా బాబూ వొచ్చి కాళ్లావేళ్లాపడి చదువు చెప్పించమన్నారు. మేమేమీ యింటిపనులు చేయించుకోవడంలేదు. జీతాలిచ్చి మనుష్యుల్ని పెట్టుకోలేనంత లేనివాళ్లంకాదూ.. యింట్లో మగవాళ్లు లేని సమయంలో వొచ్చి ఇంట్లో దూరితే వూరు కోవడానికి మేం చేతగాని వాళ్లం కాదు-

మర్యాదగా బయటకు నడవండి..” అని బెదిరించింది.

శాంతాదేవి మెల్లగా నచ్చచెప్పింది.

“సుమతిగారూ, మీరు ఆవేశపడకండి. ఒక విషయం- మీర్రాపిల్లను పెంచుకోదలిస్తే, చట్టప్రకారం ఆ పని చేయొచ్చు. కాని యిలా పిల్లల్ని తెచ్చి యింట్లో వుంచుకుని, పనులు చేయించడం చట్టవిరుద్ధం. అలా కాకుండా 'ఎడాప్ట్' చేసుకోదలిస్తే, సహాయం చేయడానికి మేమూ సిద్ధమే”

“అసలు మీరెవరండీ చెప్పడానికి? గవర్నమెంట్ వుద్యోగులా? మాకు తెలిసిన వాళ్ల పిల్లను యింట్లో వుంచుకోవడానికి మాకు మీ పర్మిషన్ కావాలా? ఇంక చాలు, వెళ్లండి.”

వొచ్చినవాళ్లు లేచారు.

“మంచిది, మీ భర్తగారు ఎప్పుడు వొస్తారో తెలియజేస్తే, మేం మళ్లా వొస్తాం. ఈ రోజు మిమ్మల్ని యిబ్బంది పెట్టవలసి వొచ్చింది, క్షమించండి.”

ఆవిడ అలా మాట్లాడడంతో సుమతి శాంతించింది. “ఆయన శనివారం వొస్తారు. ఆ రోజు రండి- కాని నేను మళ్లా చెపుతున్నాను- ఆ పిల్లతో ఇంటి పనులు చేయించుకోవడం లేదు. ఇంటిమనిషిగానే చూస్తున్నాం” అంది.

వాళ్లు వెళ్లిపోయాక ఆమె ఉగ్రరూపం దాల్చింది. “ఇట్లారా నువ్వు, పాడుముండా! తినే తిండికి బాగా కొవ్వు పట్టిందా? వాళ్లు నీకెలా తెలుసు? వాళ్లకేం చెప్పావు? నోరు విప్పు”

లక్ష్మికి భయంతో నోట మాట రావడం లేదు. లోపలినుంచి శ్రావ్య వచ్చింది. “ఊరుకో మమ్మీ, దానికేం తెలుసు? అదసలు బయటకే వెళ్లదు. బైట వాళ్లతో అసలు మాట్లాడడమే దానికి భయం.”

“మరి వాళ్లు మనింటికే ఎందుకొచ్చినట్లు? ఇది ఇక్కడ వుందని కలగన్నారా?”

“వాళ్ల పనే అది, ఇంటింటికీ సర్వే చేస్తారు.. ఇప్పుడు అదేం లేదని తెలుసుకున్నారు గదా?”

ఆవిడకు కొంచెం కోపం తగ్గింది.

“ఏయ్ పిల్లా! నీకు ఇక్కడ ఉండడం ఇష్టం లేకపోతే చెప్పు, మీ వాళ్లను పిలిపిస్తా. వాళ్లతో ఫో- అంతేగాని బైట ఎవరితోనైనా ఏమైనా వాగావా.. తోలు తీస్తా.. జాగ్రత్త”

“నేను పోను”

లక్ష్మికి ఇప్పటికి మాట పెగిలింది. ఒళ్లంతా చెమటలు కారుతున్నాయి. సుమతి అసహ్యించుకున్నది.

“మురికి ముండా, దాని చెమటలు చూడు- మురికిలోనే పుట్టి పెరుగుతారు” గొణుక్కుంటూ లోపలకు పోయింది. భయానికి చెమటలు పడతాయని ఆవిడ గ్రహించలేదు..

శ్రావ్య లక్ష్మిని లోపలకు తీసుకెళ్లి బట్టలు, టవలూ ఇచ్చి స్నానానికి పంపింది. స్నానం ముగించుకువచ్చాక, “ఇప్పుడు పనేమీ లేదుగా.. చదువు మొదలు పెడదామా?” అన్నది పుస్తకాలు తీస్తూ.

ఆరోజు నుంచే లక్ష్మి పట్ల ఇంటావిడలో కోపం, అసహనం ఎక్కువయ్యాయి. ఏదో వంక చూసుకొని తిట్టడం, అప్పుడప్పుడు దెబ్బలు కొట్టడం పరిపాటి అయింది.

“దీన్ని పెట్టుకున్నప్పటినుండీ ఏదో గొడవే! ఆ వెధవ- దాని బాబు రావడం డబ్బులు వసూలు చేసుకుపోవడం తప్ప, మనం చెప్పేది వినిపించుకోడు. దీనికి బొత్తిగా ఇంట్లో వాళ్లంటే భయం లేకుండా పోయింది. దానికి నీ సపోర్ట్-” అంటూ కూతుర్ని తిట్టింది.

“అసలు ఇలా కాదు, దాని బాబును పిలిపించి వాడితో తీసుకుపొమ్మనాలి. ఈ

## కొత్తగాలి...

**గాలానికి**
**కలలు చిక్కవు**
**ధనంతో**
**మమతలు దక్కవు**

**-ఏవిఆర్ మూర్తి, విశాఖపట్నం**

మాత్రం పనిపిల్లలు ఇక్కడ దొరక్కనా? నెలకో రెండొందలు పారేస్తే కుక్కల్లా పడుంటారు- పాడుముండ!"

ఆవిడకు ఎదుట పడాలంటేనే లక్ష్మి భయంతో ఒణికిపోతున్నది.

★ ★ ★

ఒకనాటి రాత్రి లక్ష్మి ఆ ఇంట్లోంచి బయట పడింది!

టైము పదకొండు దాటింది. ఆ రోజుల్లో దానికి ఏవేవో పిచ్చి ఆలోచనలు! 'వెళ్లిపోవాలి, నాయన తన్నినా సరే. ఇక్కడ తను ఉండలేదు!'

వంటింటి ముందు దుప్పటి పరుచుకుని పడుకున్న లక్ష్మి, పదకొండు గంటలకు లేచింది. బట్టలు ఓ గుడ్డలో మూటకట్టి, బయటకు వొచ్చింది. వీధి నిర్మానుష్యంగా వున్నా దానికి భయం వేయలేదు.

దానికి దారి తెలీదు. ఆలోచన ఒక్కటే బస్సు పట్టుకోవాలి. తన వూరికి పోవాలి. ఆ 'సార్' ఇచ్చిన డబ్బులున్నయి.

దానికి చెల్లెళ్లూ, తమ గుడిసా, వూరి చెరువూ అవన్నీ గుర్తుకువొచ్చి ఏడుపొచ్చింది. రోడ్డు పక్కన లైటు స్తంభం వద్ద కూర్చుని, కాస్సేపు ఏడిచి, కళ్లు తుడుచుకుని లేచి మళ్లా నడక సాగించింది.

"ఏం పాపా ఒక్కతివీ ఎక్కడకు పోతున్నావు ఇంత రాత్రి? "

ఉలిక్కి పడింది. ఆటో ప్రక్కనే ఆగింది.

"మా వూరికి పోవాలి- బస్సుకోసం"

"ఇప్పుడా? ఒక్కదానివే పోతున్నావేం? ఏ వూరు? "

వూరు పేరు చెప్పింది.

"పెద్ద వాళ్లెవరూ తోడు లేకుండా పోతున్నావు? "

లక్ష్మి కొంత అబద్ధం, కొంత నిజమూ చెప్పింది. చుట్టాలింట్లో దింపి అమ్మా నాయనా వెళ్లిపోయారు, చుట్టాలు కొడుతూవుంటారు, అందుకే ఎవ్వరికీ తెలీకుండా రాత్రికి రాత్రి వూరెళ్లిపోతున్నానని చెప్పింది.

ఆటో డ్రయివరు జాలిపడ్డాడు.

"మరి బస్సుకు పైసలున్నయ్యా" అడిగాడు. గౌను జేబులోంచి వంద రూపాయల నోటు తీసి చూపింది రుజువుగా.

"సరే, ఆటో ఎక్కు, బస్సు డిపో కాడ దింపుతా.. ఒక్కదానివే ఇట్టా రాగూడదు బిడ్డా.. ఇప్పుడు బస్సు వుందో లేదో, రాత్రికి ఆడనే పండుకో, పొద్దునే లేచి బస్సు పట్టుకో.. "

డిపో వద్ద దింపిన, అతను పైసలు తీసుకోకపోగా ఒంటరిగా వొచ్చినందుకు మరోసారి కోప్పడి వెళ్లిపోయాడు. లక్ష్మి భయం భయంగా లోపలకు నడిచింది.

చాలా రాత్రి అవడంతో జనసమ్మర్దం లేదు. వున్న కొద్దిమందీ బెంచీల మీద పడుకుని నిద్రపోతున్నారు.

తనూ పోయి ఓ బెంచీ మీద కూర్చుని, బట్టలమూట వొళ్లో పెట్టుకుంది.

కొంచెంసేపటికి తప్పు చేశానేమోనని భావన కలిగి భయం వేసింది. తండ్రి చావగొట్టి మళ్లా తీసుకువొచ్చి వీళ్లకే అప్పచెబుతాడు. 'అమ్మగారు' చావ చితగ్గొడుతుంది.

దానికి వెంటనే లేచి తిరిగి వెళ్లిపోవాలనిపించింది. కానీ ఎలా వెళ్లాలో తెలీదు. ఈ రాత్రివేళ మరో ఆటో దొరుకుతుందో లేదో?

ఏడుపొచ్చింది. తనని తానే తిట్టుకున్నది. మళ్లా ధైర్యం తెచ్చుకున్నది. తన దగ్గర డబ్బులున్నాయిగా, తెల్లారినాక వెళ్లి పోవొచ్చు, వాళ్లు నిద్రలేవక ముందే!

"ఏ వూరు పోవాలి బిడ్డా? " బెంచీ మీద పడుకున్న ముసల్ది ఎప్పుడు నిద్రలేచిందో పలకరించింది.

"ఒక్కతివే పోతున్నావు? తోడెవరూ లేరా? "

లక్ష్మి జవాబు యివ్వలేదు.

"ఏం బిడ్డా, ఇంట్లకెల్లి పారిపోతున్నావు? ... ఏమే పోరి, జవాబు చెప్పవు? "

లక్ష్మి మెల్లగా చెప్పింది.

ముసల్ది తలగోక్కుంటూ, "అర్థమైందిలే- వూరికి బస్సు ఇప్పుడు ఎక్కడుంది? బువ్వ తిన్నావా? ఇంద, బిసికట్లు తిను, తీసుకో బిడ్డా" ప్రేమగా తినిపించింది. సంచిలోంచి ప్లాస్టిక్ సీసా తీసి నీళ్లు తాగించింది.

"ఈడ పండుకో, పొద్దున బస్సు ఎక్కించుతా" లక్ష్మి బెంచి మీద పడుకున్నది. మెల్లగా నిద్ర పట్టింది.

లక్ష్మిని చూస్తుంటే ముసల్దానికి ముచ్చటేసింది. లంకెబిందెల్లోని నిధినిక్షేపాలు ఒక్కసారిగా తన పెరట్లో ప్రత్యక్షమైనంత ఆనందం కలిగింది. వెదుకుతున్న తీగె కాలికి తగిలినట్లు, వేటాడకుండానే లేడి చిక్కినట్లుగా తోచిందామెకు. మత్తులోనే ఈ అమ్మాయిని కొన్నాళ్లు ఉంచేసి ముంబాయికి తరలించాలనుకుందామె. ముంబాయిలో తన తమ్ముడికి ఈ పిల్లను అప్పగిస్తే అందే నజరానా మీదనే ఆమె దృష్టంతా ఉంది. వాడు ఆడపిల్లల్ని వ్యభిచారగృహాలకు అమ్మేస్తాడనుకుంటా. అయినా అవన్నీ తనకెందుకు? తనకు దొరికే పెద్దమొత్తం తనకు చాలు.

ఇంతలో హఠాత్తుగా మెలకువ వచ్చింది లక్ష్మికి. ఏవో మాటలు, తలుపు వేసిన శబ్దం.. లేచి కూర్చుని కళ్లు నులుముకుంటూ చుట్టూ చూసింది. తనెక్కడున్నదో దానికి ఒక్కక్షణం అర్థం కాలేదు- చిన్నగది, ఓ మూల వంట గిన్నెలు, మరో మూల ముసల్ది గుర్రుకొట్టి నిద్రపోతున్నది.

దానికి అంతా గుర్తుకు వొచ్చింది. ఈ ముసలమ్మ తనను ఎక్కడకు తీసుకు వొచ్చింది? ఎందుకు తీసుకు వొచ్చింది? తన వూరి బస్సులో ఎందుకు ఎక్కించలేదు?

మెల్లగా లేచింది. ముసల్ది నిద్రలో ఏదో గొణుకుతున్నది. నోట్లోంచి చొంగ కారుతోంది. చుట్టుపక్కల ఖాళీసీసాలు పడివున్నాయి.

లక్ష్మికి ఏం చేయాలో అర్థం కాలేదు. ముందుగా ముసల్దాన్ని నిద్ర లేపుదామనుకున్నది. కాని ఎందుకో భయం వేసింది. దాని చింపిరి జుట్టు, కంపు గొడుతున్న శరీరం, ఆ గది వాతావరణం- అంతా అసహ్యంగా ఉంది.

మెల్లగా లేచి బైటకు వొచ్చింది. గది ముందు సన్నని సందులో నడవగా మెయిన్‌రోడ్డు కనబడింది. అంతే, ఒక్క పరుగు తీసింది...




"**పో**లీసు రిపోర్టిద్దాం మమ్మీ"

"నోరు మూసుకో, రిపోర్టిస్తే అసలు ఆ పిల్ల మీ యింట్లో ఎందుకున్నదంటారు?

# కొత్తగాలి...



**ఖద్దరు...ధర**
**ధరించేవాడికేం తెలుసు**
**ఒక చేనేతవాని**
**జీవితం కంటే ఖరీదని**

**-వోలేటి శ్రీనివాసరావు, విజయనగరం**

పాడుముండ- ఇంట్లో ఏ దొంగతనం చేసుకుపోయిందో! దెయ్యం- ముంగిలా మాట్లాడేది కాదు- ఓసారి అన్నీ చూడాలి, ఏం దొంగతనం అయిందో?" సుమతి తిట్లపురాణం హఠాత్తుగా ఆపివేసింది.

జుట్టంతా రేగిపోయి, బట్టలు దుమ్ముకొట్టుకుపోయి, అలసటగా గుమ్మంలో నిలబడింది లక్ష్మి. శ్రావ్య గబగబా దగ్గరకు వెళ్లింది.

"ఏమిటి లక్ష్మీ, ఎక్కడకి పోయావు? మేమెంత కంగారుపడ్డామో తెలుసా? అలా చెప్పకుండా ఎందుకు వెళ్లావు?"

సుమతి భద్రకాళిలా లేచింది.

"దొంగముండా చెప్పకుండా ఎటుపోయావే, కాళ్లు విరగ్గొడతా..."

"అబ్బ, నువ్వూరుకో మమ్మీ, మెల్లగా అడిగి తెలుసుకుంటా గదా! అదసలే భయపడిపోతున్నది" లక్ష్మిని లోపలకు తీసుకుపోయి, మొహం కడిగింది బట్టలు మార్పించింది.

"ఏమిటి లక్ష్మీ, ఎక్కడకు వెళ్లావు?"

లక్ష్మి ఏడ్చేసింది. శ్రావ్య బుజ్జగిస్తూ అన్నీ అడిగి తెలుసుకున్నది.

"పిచ్చిదానా, ఒక్కదానివే ఎలా వెడదామనుకున్నావు? నాకు చెబితే నేనే పరమయ్యను తోడుగా పంపేదాన్ని కదా! మళ్లా ఎప్పుడూ యిలా చెయ్యకు- మీ వాళ్లని చూడాలని వుంటే చెప్పు.." అడిగింది భుజంపైన చెయ్యి వేసి.

లక్ష్మికి ఏం చెప్పాలో తెలియలేదు. దానికేం కావాలో దానికే అర్థం కావడం లేదు. ఇంటికి వెడితే ఏం జరుగుతుందో దానికి తెలుసు, ఇక్కడనుంచి ఎక్కడకు వెళ్లాలి? అంతా అయోమయంగా వుంది.

దాని ఆలోచనలు గ్రహించినట్లుగా జాలిగా చూస్తూ, "సరే, తర్వాత మాట్లాడుకుందాం, ముందు టీ తాగుదాం" అంటూ లేచి హాలులోకి వొచ్చింది.

"ఏమంటుందే అది? దానికేమయినా అయితే మనం ఎంత చిక్కులో పడేవాళ్లం? వాళ్లెవరో వొచ్చి నానా గొడవా చేసిపోయారు- మనకెక్కడ దొరికిందే ఈ శనిముండ!"

శ్రావ్య విసుకున్నది. "దీనికంతకూ నువ్వే కారణం. ఊరికే దాన్ని తిట్టడం, కొట్టడంతో వుండలేకపోయింది. ఎవరో ముసలిది మత్తు మందిచ్చి తనతో తీసుకుపోయిందట- అది నిద్రపోతుండగా ఇది పారిపోయి వొచ్చేసింది. నిజంగానే దీనికేమయినా జరిగితే ఏమయ్యేదో.."

తల్లి నోరు తెరుచుకుని విన్నది.

"అమ్మో, ఏదయినా జరిగితే దీని బాబు మనల్ని బతకనిచ్చేవాడా? పాడుపీనుగ.."

"అదిగో, మళ్లా తిట్లు-"

కూతురి మీద విరుచుకుపడింది.

"నువ్వు నోరు ముయ్యవే, అసలు దీన్ని ఈవాళే వొదిలించుకోవాలి. మనకు అనవసరం. మళ్లా దీనికి ఏపాడు బుద్ధి పుట్టి పారిపోతుందో! మనకు ఎందుకీ పీడ! నాన్న వూరి నుంచి రాగానే.."

కూతురు తల్లికి నచ్చచెబుతూ,

"అదిగాదమ్మా, నేచెప్పేది విను. పనంతా చక్కగా చేస్తుంది. చెప్పిన మాట వింటుంది. దొంగబుద్ధి లేదు. దీన్ని పంపించి వేస్తే మనం చేసుకోగలమా? మళ్లా మరో పిల్లను తెచ్చిపెట్టుకోక

తప్పదు- అది ఎలాంటిదౌస్తుందో? అందు కని నా మాట విని దానితో కాస్త మంచిగా వుంటే మనకు నష్టమేముంది? పాపం, దాన్ని చూస్తుంటే జాలివేయటం లేదూ? " అన్నది.

"చాల్లే వూరుకో, మనకెందుకీ గోల! ఆ చైల్డ్ లేబర్ వాళ్లెవరో వొచ్చి ఏం గొడవ పెడతారోనని కంగారు పడుతుంటేను.. మనకెందుకీ శని.." లేచి కిచెన్‌లోకి వెళ్లిం దామె..

శ్రావ్య ఆలోచనలో పడింది. 'ఏం చేయాలి? తన తల్లి ఇంక ఈ పిల్లను వుంచుకోవడానికి చచ్చినా వొప్పుకోదు ఇంత జరిగాక! నాన్న వొచ్చాక, దీని తండ్రిని పిలిపించి తప్పక పంపించివేస్తుంది. త ర్వాత వాడు దీనిని మరో 'నరకం'లోకి పంపుతాడు.. ఒక మార్గం వున్నది- దీన్ని ఎలాగయినా ఆ మోహన్‌గారి దగ్గరకు పంపితే ఆయనే చూసు కుంటాడు, ఏ హాస్టల్లోనో జేర్పిస్తాడు.."

ఆ పిల్లకు మనస్సు కొంత తేలిక పడింది. లేచి తన గదిలోకి వెళ్లింది.

నేలమీద అలాగే పడుకుని గాఢంగా నిద్రపోతున్నది లక్ష్మి...

నాలుగు రోజుల తర్వాత పాపయ్య వొచ్చాడు. వాడిని చూస్తూనే సుమతి అర వడం మొదలు పెట్టింది. "ఏమయ్యా, నీకు బుద్ధివుందా లేదా? జాలిపడి పిల్లను తీసుకువచ్చి ఇంట్లో పెట్టుకుంటే, పెట్టే చేతినే కరిచింది. రెండు పూట్లా భోజనం, టిఫిన్లూ, చాయిలూ దానికి వెగటైనాయి. రాత్రికి రాత్రి యింట్లోంచి పారిపోతుందా? అది వొచ్చినప్పటి నుంచీ ఏదో గొడవే! మేమేం బలవంతాన కట్టిపడేయలేదు. ఇష్ట పడే తీసుకువొచ్చావు. ఇష్టం లేకపోతే తీసుకుపో-" అరుస్తున్న భార్యను ఆగమ న్నాడు కృష్ణారెడ్డి.

"నువ్వాగు, దాన్ని ఇట్లా పిలువు- పాపయ్యే చెప్పవలసింది చెబుతాడు- దానికి ఇక్కడుండటం యిష్టం లేదేమో? "

పాపయ్య నిలబడినవాడు నేలమీద గొంతు కూర్చున్నాడు. "అదేంది దొరా, ఎందుకిష్టం వుండదు? మంచి తిండీ, బట్టా- ఏంరోగం సారు వుండక! వుండు దొరా.. నే కనుక్కుంటా.." మెల్లగా వొచ్చి నిలబడిన లక్ష్మిని చేయిపట్టుకుని దగ్గరగా లాగాడు.

"ఏందే పోరి, నువ్వు చేసినపని? తోలు దీస్తా. సారూ, అమ్మోళ్లు మంచోళ్లు గాబట్టి నిన్ను మంచిగ చూసుకుంటు న్నారు. ఎందుకు చేశావీ బాడకోవ్ పని..? "

"ఉండవయ్యా, నువ్వూరికే అరవకు. అసలు దానికేం కావాలో కనుక్కో

## శిక్ష

'ఒకమ్మాయిని ప్రేమించి, పెళ్లాడతానని మాటిచ్చి, ఆ తర్వాత చేసుకోనంటూ ప్లేటు ఫిరాయించిన వంచకుడికి ఏం శిక్షేయాలంటావ్ రాజేశ్?' ఫెమినిస్ట్ అగ్నిహోత్రి తన మిత్రుడ్ని అడిగింది.

'జస్ట్ సింపుల్. ఎలాగోలా బలవంతపెట్టి ఆమెతో పెళ్లిచేసేయడమే వాడికి తగిన శిక్ష' అన్నాడతను కూల్‌గా.



ముందు. దానికి ఇష్టం వుందో లేదో..." విసుక్కున్నాడు కృష్ణారెడ్డి.

"ఏందే, యిష్టం లేకపోతే చెప్పు.. వూరికి పోదాం. అంతేగాని రాత్రికిరాత్రి ఇంట్లో కెల్లిపోతావ్? "

లక్ష్మి తండ్రి మొహంలోకి చూసింది. సారాకంపు, ఎండు గడ్డిలా పెరిగిన జుట్టు, నెరిసిన గడ్డం, ఎర్రటి మిడిగుడ్లు.. తండ్రి అవతారం చాలా కాలానికి చూసిన లక్ష్మి భయపడింది.

"మాట్లాడవేం? వొస్తావా చెప్పు- ఇప్పుడే పోదాం. అనవసరంగా సారోళ్లను ఇబ్బంది పెట్టడం దేనికి? నీ సంగతి చూస్తా వూరు పోయాక.."

"నే రానయ్యా, ఈడనే వుంటా" మొదటి సారి నోరు విప్పింది లక్ష్మి.

"ఎందుకే నువ్విక్కడా? మళ్లా కొంపమీదికి గొడవలు తీసుకురావడానికి.. పో ఇక్కడుండక్ఖర్లేదు" అరిచింది సుమతి.

ఈ గొడవంతా వింటున్న శ్రావ్య ముందుకు వొచ్చి లక్ష్మి దగ్గర నిలబడింది.

లక్ష్మి ఏడవసాగింది. "లేదమ్మగారూ, నేనీడనే వుంటా. ఇంకెప్పుడూ ఇట్లా చేయను, మా అయ్యతో పంపించొద్దు.."

"ఊరుకో లక్ష్మీ, ఏడవకు. నువ్వు వెళ్లనవసరం లేదు" అన్నది శ్రావ్య భుజంమీద చెయ్యివేసి.

పాపయ్య నవ్వు మొహంతో "చూశారా అమ్మగారూ, పిచ్చిముండ, మిమ్మల్ని వొదిలి అది యాడకు పోద్ది? ఏదో పొరపాటయింది. అట్లా మళ్లా చెయ్యదు.." అన్నాడు బుర్రగోక్కుంటూ.

కృష్ణారెడ్డి భార్యవేపు చూశాడు. ఆవిడ చిరాకు చూపిస్తూ, "వొద్దులేవయ్యా, నేను కోపంతో ఓ మాట అంటే మళ్లా అది పారిపోవడం- చాలు, చాలు" అన్నది.

"అదేందమ్మా, తల్లిలాంటోరు. ఒక దెబ్బ వేస్తే తప్పేంది? అప్పుడప్పుడు నాలుగు తగిలిస్తా వుండండి.. ఇదిగో బిడ్డా, మళ్లా ఇట్టా చేశావంటే, నిన్ను చూడ్డానికి కూడా రాను. ఏంది.. చెప్పేది బుర్రలోనికి ఎక్కుతున్నదా లేదా? " అరిచాడు తండ్రి.

లక్ష్మి తల వూపింది.

పాపయ్య అలాగే చతికిలబడి కూర్చుని లేవకుండా బుర్ర గోక్కుంటున్నాడు.

"ఇంకపోయి రావయ్యా" అని లేచాడు కృష్ణారెడ్డి.

"దొరా, పైసలకు శానా ఇబ్బందిగా వుంది. ఇంటిదానికి జరం, మందుకు పైసలు లేవు, తింటానికీ లేవు.."

పర్సుతీసి మూడొందలు ఇవ్వబోయాడు. "ఇదేమూలకి దొరా? మల్లా మీ కాడికొస్తే చెప్పుతో కొట్టుదొరా" మరో రెండొందలు వసూలు చేసుకుని, కూతుర్ని మరోసారి హెచ్చరించి వెళ్లిపోయాడు పాపయ్య.

లక్ష్మి కిచెన్‌వైపు చూస్తూ, ఒకసారి వెనక్కి తిరిగి మెట్లు దిగుతున్న తండ్రిని చూసింది.




**"ఏ**య్ పిల్లా, నీ పేరేంటి? "

పాన్ తిని గారపట్టిన పళ్ళు, మొహం మీద ఎర్రటి మచ్చలూ, జుట్టుపైకి ఎగదువ్వి, వెనక్కు తోకలా రబ్బరు బ్యాండు పెట్టింది.

ఆ మనిషి ఎవరో లక్ష్మికి తెలుసు. ఇక్కడో రెండు మూడిళ్లలో పాచిపని

చేస్తుంది. కాంపౌండులో మొక్కలకు నీళ్లు పోస్తున్న లక్ష్మిని గోడమీద నుంచి పలకరించింది.

"ఏ వూరు? ఇంతకు మునుపు కనబడలేదే? కొత్తగా వొచ్చావా?"

ఈ ప్రశ్నకు జవాబు ఏమివ్వాలో తెలియక మౌనం వహించింది. ఇంటివేపు చూసింది భయంతో. 'అమ్మగారు' కనబడలేదు.

"మాట్లాడవేం పిల్లా? మాటలు రావా? బైటి వాళ్లతో మాట్లాడొద్దని మీ యింట్లో వాళ్ళ ఆర్డరా?"

లక్ష్మి మాట్లాడలేదు.

"ఎప్పుడూ బయటకు రావేం? సిన్మాకు తీసుకుపోతూ ఉంటారా? లేక యింట్లోనే కట్టిపడేసి వుంచుతారా?"

లక్ష్మి నీళ్లపైపు కింద పడేసి, పంపు కట్టేసి, లోపలకు వెళ్ళిపోయింది. తను యిలా బైటి మనుష్యులతో మాట్లాడటం చూసిందంటే 'అమ్మగారు' చంపేస్తుంది.

"ఎవరితో మాట్లాడుతున్నావు పిల్లా?" పరమయ్య అడిగాడు.

లక్ష్మి భయపడింది.

"అమ్మగారు కూడా చూశారా, నేను ఆవిడతో మాట్లాడడం?"

"అదా నీ భయం? చూడలేదు."

"పక్కింట్లో పని చేస్తుందామె. నా గురించి అడిగింది."

"దానితో ఎక్కువ మాట్లాడకు. ఇంతకు ముందు ఇదే వీధిలో దొంగతనం జరిగితే దీన్ని పట్టుకుపోయారు పోలీసులు. అది ఇక్కడి మనిషి కాదు, ఒరిస్సా నుంచి వొచ్చిందట-"

"నన్ను సినిమాలు చూస్తూ వుంటావా అని అడిగింది"

కొన్ని రోజుల తర్వాత ఆ మనిషి దుకాణం వద్ద కలిసింది.

"ఏం పిల్లా! నన్ను చూసి ఎందుకట్లా భయపడతావ్? నేనేం దెయ్యాన్నా?" అన్నదావిడ భుజం పైన చెయ్యి వేసి.

ఆ చెయ్యి తీసేసి, "భయం లేదు" అన్నది లక్ష్మి. చేతిలో సామాన్ల లిస్టు దుకాణంలో కుర్రాడికి ఇచ్చింది.

"నన్ను చూసి అట్టా పారిపోతావేం? నన్ను అక్కా అని పిలు. నా పేరు శోభ. మంచి సినిమా వుంది, మధ్యాహ్నం ఆటకు పోదామా, ఇక్కడకు దగ్గరేలే.."

లక్ష్మి భయపడి పోయింది. కాని సినిమా చూడాలని వుత్సాహం కలిగింది.

"ఫరవాలేదు, ఆరు గంటలకంతా యింట్లో వుండొచ్చు. మీ అమ్మగారు మధ్యాహ్నం లేడీస్ క్లబ్బుకు పోతారుగా!"

లక్ష్మి ఆశ్చర్యపడింది.

శోభ నవ్వుతూ, "వొస్తావా? ఎవరికీ తెలియదు. మంచి సినిమా- ఎప్పుడయినా 'కోకాకోలా' తాగావా? నిన్ను చూస్తుంటే మా చెల్లి గుర్తుకొస్తుంది. చాలా దూరం మా వూరు- నేనెప్పుడో ఏడాదికోసారి పోతా, నువ్వు అచ్చంగా మా చెల్లిలానే వుంటావు-" ఆపేక్షగా వీపు తడిమింది.

"అమ్మగారూ-"

"ఏందే ఆ భయం? ఆవిడేం చేస్తుంది? చంపుతుందా యేం? అట్టా భయపడితే ఎట్టా?"

లక్ష్మి మాట్లాడకుండా అలాగే నిలబడింది. దుకాణం మనిషి సామానులు పొట్లాలు కడుతున్నాడు.

శోభ వొదలకుండా "అస్సలావిడకు తెలిస్తే కదా? నువు రెండు గంటలకల్లా బైటకు వొచ్చి ఈ దుకాణం కాడే నిలబడు. నేను వొచ్చి తీసుకుపోతా. నువ్వుగాని రాకపోతివా, నేనే మీ ఇంటి కొస్తా" అన్నది సగం నవ్వుతూ కొంచెం సీరియస్‌గాను.

లక్ష్మికి భయం ఎక్కువైంది. ఈ మనిషి గనక యింటికొస్తే, అమ్మగారు తనను

చంపి పారేస్తుంది. కాని ఎలా తెలుస్తుంది? అమ్మగారు వుండదు, తనూ చిన్నమ్మాయి వుంటారు. మాధవి బైటకు రానే రాదు. ఆ పిల్లకు పరీక్షలు. పరమయ్య ఏడు గంటల వరకు రాడు. కాని వీళ్లల్లో ఎవరికైనా తను బైటకు వెళ్లిందని తెలిస్తే?

"నువ్వు రావొద్దులే అక్కా! ఈరోజు వద్దు, ఇంకెప్పుడైనా-" సరుకుల సంచి తీసుకుని వేగంగా వెళ్లిపోయింది లక్ష్మి.

లక్ష్మి వేపు చూస్తూ శోభ పక్కనే ఉన్న పాన్‌షాపు వద్దకు నడిచింది.

ఒకనాడు అన్నీ అనుకూలంగా కనబడ్డాయి. మాధవి ఫ్రెండింటికి చదువు కొనడానికి వెళ్లింది. పరమయ్య చుట్టాలెవరో చనిపోయారని వూరు వెళ్లాడు. అమ్మగారు కూడా క్లబ్‌కు వెళ్లారు. ఆవిడ వెళుతూ అన్ని జాగ్రత్తలు చెప్పింది. బైటకు ఎక్కడకూ ఇల్లొదిలి పోవద్దని గట్టిగా చెప్పింది, తాళం చెవి కూడా ఇవ్వలేదు-

టయిమ్ రెండు దాటింది. లక్ష్మి బయటకు కొచ్చి తలుపు వేయగానే తాళం పడటంతో దానికి భయం పట్టుకున్నది.

దూరం నుంచి శోభ కనబడి చేయి వూపింది. లక్ష్మి ఆమె దగ్గరకు పరుగెత్తుకు వెళ్లింది. "ఏం పిల్లా, ఇంట్లో ఎవరూ లేరా? "

"లేరుగాని, తలుపు తాళం పడిపో



యంది -నేను మళ్లా వెళ్లేది ఎట్లా? "

"ఇంటికి వెడదాం పద, కాస్త 'చాయి' తాగి పోదాం"- లక్ష్మి అయోమయంగా ఆమె వెంట నడిచింది.

ఆమె ఏం చేసిందో గాని తలుపు తెరుచుకున్నది. "చూశావా లక్ష్మి, నువ్వు సరిగా తాళం వేయనేలేదు" ఇద్దరూ లోపలకు వెళ్లారు.

"నువ్వు హాల్లో కూర్చో, జబర్దస్తు చాయి తాగిపిస్తా" అంది లోపలకు రాబోతున్న లక్ష్మిని సోఫాలో కూర్చోబెట్టి తను కిచెన్ లోకి వెళ్లింది.

సోఫా మెత్తగా వుండటంతో లక్ష్మి ఆనందపడింది. ఎంత హాయిగా ఉంది. అనుకుంటూ వెనక్కు చారబడి, కళ్లు మూసుకున్నది.

"ఏం పిల్లా, ఏంటా నిద్ర? ఇదుగో చాయి"

ఉలిక్కిపడి లేచింది లక్ష్మి. ఇద్దరూ టీ తాగి బయటకు వచ్చారు. తలుపు వేసి రెండు మూడుసార్లు హాండిల్ తిప్పి చూసింది శోభ.

"ఇప్పుడు చూడు, తాళం మంచిగా పడింది- పదపద, టయిమ్ అవుతుంది, భయం లేదులే, టిక్కెట్లు ముందే కొన్నా.."

ఈ రోజు సినిమాకు పోయేది శోభకు ముందే ఎలా తెలిసింది? టిక్కెట్లు ఎలా





తెప్పించింది? శోభ తొందర పెట్టడంతో ఈ ప్రశ్నలు మరచి పోయి ఆమె వెంట నడిచింది లక్ష్మి.

పట్నం వొచ్చి ఇంతకాలమయినా ఆ పిల్ల ఇంతవరకూ బయట సినిమాలు చూసింది లేదు, అప్పుడప్పుడు టి.వి.లో తప్ప. థియేటర్లో అడుగు పెట్టినప్పటి నుండి దానికి గాబారాగా, కంగారుగా ఉన్నది.

లోపలకు పోయేముందు చిప్సుకొని పెట్టింది శోభ. మధ్యలో కోకాకోలా తాగించింది. సినిమా చూసి బైటికి వొస్తూ, "ఈరోజు బలేవుంది గదక్కా" అన్నది లక్ష్మి అమాయకంగా నవ్వుతూ.

"మరేమనుకున్నావు? సిటీలో చూడడానికి ఎన్నో ఉన్నాయి. నీకెందుకు, మనం వీలయినప్పుడల్లా సిటీ అంతా తిరుగుదాం, దొంగతనంగా" అన్నది శోభ కన్నుకొడుతూ.

ఇంటికొచ్చేసరికి ఇంట్లో లైట్లు వెలుగుతూ వుండడం చూసి దాని గుండె ఆగింది. శోభ చెయ్యి గట్టిగా పట్టుకున్నది.

"ఎవరో వొచ్చేశారు? నేను బైటికి పోయానని తెలుస్తుందక్కా"

"ఎక్కడో పిరికిపందలా వున్నావు! ఏంటా భయం? ఏదో ఓటి చెప్పెయ్యి- బైటకు రాగానే తాళం పడిపోయిందనో ఏదో చెప్పు..." శోభ వెళ్లిపోయింది.

లక్ష్మి కాలింగ్ బెల్ నొక్కింది.

"ఏయ్, ఎక్కడకు పోయావు? ఇంట్లోంచి కదలొద్దని చెప్పలా?" అరించింది మాధవి. లక్ష్మి తేలిక అయింది- అమ్మయ్య, అమ్మగారింకా రాలేదు. ఏదో జవాబు గొణిగింది.

"సరే, పోయి కాస్త టీ తయారుచేయి- త్వరగా కదులు మొద్దా"

లక్ష్మికి హాయిగా గాలిలో తేలిపోతున్నట్లున్నది. 'పట్నం ఎంత బాగుంది? డబ్బు ఉండాలేగాని, ఆ షాపులూ, బట్టలూ, వస్తువులూ-' దానికి చెల్లెళ్లు గుర్తుకు వొచ్చి కళ్ల వెంబడి నీళ్లు వొచ్చాయి. పాపం, వాళ్లివన్నీ చూడలేరు గదా. తను పెద్ద అయ్యాక, వుద్యోగం చేసి బోలెడు డబ్బులు సంపాదించి, వాళ్లకు అన్నీ చూపాలి. మంచి మంచి బట్టలు కొనివ్వాలి..'

దానికి మరో ఆలోచన వొచ్చింది. తను పెద్ద అయ్యేదాకా ఎన్ని యిళ్లల్లో పనులు చేయాలో? తను పెద్దది అయ్యాక వాళ్లు వెళ్లిపొమ్మంటే ఏంచేయాలి, డబ్బు లెక్కణ్ణుంచి వొస్తాయి? తనను పంపేసి మరొక చిన్న పిల్లను తెచ్చిపెట్టుకుంటే-? అప్పుడు తను ఎక్కడికి పోవాలి? అయినా.. వాళ్లెవరూ పెద్దవాళ్లను పనిలో ఇంట్లో పెట్టుకోకుండా ఎప్పుడూ చిన్నపిల్లల్నే వుంచుకుంటారెందుకో-?'

ఈ ప్రశ్నలతో దాని బుర్ర వేడెక్కింది. 'తను ఎప్పటికీ చిన్నగానే వుంటే ఎంత బాగుంటుంది? ఎవరింట్లోనో పనికి కుదిరి పోయి వుండిపోవొచ్చు. పెద్ద అయ్యాక ఎవరి దగ్గరో శోభక్కలాగా పాచిపనికి కుదురుకుని చెల్లెళ్లను తీసుకు వొచ్చి తన దగ్గరే వుంచుకోవొచ్చు.' దానికి ఈ ఆలోచన నచ్చింది. కాని శోభక్క చూడు, దాన్నెవరూ కొట్టరు, తిట్టరు- జీతంతో మంచి బట్టలు కొనుక్కోవచ్చు, సినిమాలు చూడొచ్చు. అందుకని చిన్నగా వుండకూడదు అన్నీ కష్టాలే, ఎప్పుడూ దెబ్బలే-'

ఏదో దిగులుతో టీ సంగతి మరిచి పోయి కిటికిలోంచి చూస్తూ అలాగే నిలబడింది.

"మొద్దుపీనుగా, ఎంతసేపయిందే నీకు టీ యివ్వమని చెప్పి..?" వీపు మీద ఒక్కటి చరిచింది చిన్న యజమానురాలు.



ఉదయమే నిద్రలేచిన లక్ష్మి ఏదో గొడవ జరుగుతున్నట్లు తెలుసుకున్నది.

# బాల్ పెన్ను ప్రస్థానం

**రా**కెట్లో అంతరిక్షానికి వెళ్లిన వ్యోమగాములు ఇంక్ పెన్‌తో రాస్తే, పెన్ లీకయ్యేది. దాంతో రీసెర్చికి కోటి డాలర్లు ఖర్చుచేసి అమెరికన్ శాస్త్రజ్ఞులు బాల్ పాయింట్ పెన్‌ను కనుగొన్నారు. అయితే రష్యన్ వ్యోమగాములు అంతరిక్షంలోకి తమ వెంట పెన్సిల్‌ని తీసుకెళ్లారు - ఇదీ వాస్తవమనిపించే ఒకప్పటి జోక్. నిజానికి చాలామంది భావించినట్లు బాల్‌పాయింట్ పెన్‌ని కనుగొన్నది అంతరిక్షంలో రాయడానికి కాదు.






హంగరీ దేశస్థుడు లాజ్‌లో జోసెఫ్ బైరో 1943లో బాల్‌పెన్‌ని కనిపెట్టి, దాన్ని అమెరికాలో పెన్ను, పెన్సిళ్లని తయారుచేసే ఎబర్ హర్డ్ కంపెనీ ప్రెసిడెంట్‌కి పంపాడు. సంవత్సరం తర్వాత దాని ప్రెసిడెంట్ జె.సి.ముస్సర్ ఆ పెన్ హక్కులను కొన్నాడు.

అక్టోబరు 29, 1945లో న్యూయార్క్‌లోని ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లో ఒక డాలర్ ఖర్చుతో తయారు చేసిన బాల్‌పెన్‌ను ఆ కంపెనీ, 12 నుంచి 50 డాలర్ల చొప్పున అమ్మితే మొదటిరోజే ఐదువేల మంది దాన్ని కొన్నారు. ఆ తొలి బాల్ పెన్‌లు లీకవుతుండటంతో దుస్తుల మీద ఇంకు మరకలు ఏర్పడేవి. అయినా వాటికి ఆదరణ తగ్గలేదు. ఇంకు లీక్ కాకుండా చేసేందుకు ఎవర్ షార్ప్ అనే కంపెనీ 20 లక్షల డాలర్లను రీసెర్చికి ఖర్చుచేసింది.

ఈలోగా 54 ఏళ్ల మిల్టన్ రెనాల్డ్స్ అనే వ్యాపారి అర్జెంటీనా వెళ్లినప్పుడు బైరో బాల్ పెన్‌ను చూశాడు. వాటి అమెరికన్ హక్కులు ఎవర్ షార్ప్, ఎబర్ హార్డ్ కంపెనీలకు ఉన్నాయని తెలుసుకున్నాడు. దాంతో తన సొంత డిజైన్‌ను రూపొందించాడు. బాల్‌పెన్నులో ఇంకు కిందకి దిగే విధానాన్ని రెనాల్డ్స్ కనిపెట్టాడు. దాంతో ఏ కోణంలోనైనా ఆ పెన్ను రాస్తుంది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత చౌకగా దొరికిన, యుద్ధంలో మిగిలిన అల్యూమినియంతో తయారుచేసిన ఆ పెన్నులకి బాగా ఆదరణ లభించింది. యాభైవేల పెన్నులు తయారు చేస్తే మొదటి ఐదు రోజుల్లోనే ముప్పైవేలు అమ్ముడుపోయాయి. ఏడాది తిరిగేసరికి 80 లక్షల రెనాల్డ్స్ బాల్ పెన్నులు అమ్ముడయ్యాయి. అతనికి ట్యాక్స్‌లు పోను 25 లక్షల డాలర్ల లాభం వచ్చింది. ఎవర్ షార్ప్, రెనాల్డ్స్‌ల మధ్య ధరల యుద్ధం మొదలవ్వడంతో బాల్ పెన్నుల ఖరీదు బాగా తగ్గింది. దాదాపు వందమంది చిన్న వ్యాపారులు కూడా మార్కెట్‌లోకి ప్రవేశించారు.

లాస్ ఏంజెలెస్‌లో స్థిరపడ్డ హంగేరియన్ ఫ్రాన్‌సీక్ కొత్తరకం ఇంక్‌ను కనిపెట్టాడు. దాని రాయల్టీని పేపర్‌మేట్ పెన్నుల కంపెనీ తీసుకుని అద్భుతమైన పెన్నులని తయారు చేయసాగింది. ఈ కొత్త ఇంకు వెలిసిపోదు. వెంటనే ఆరిపోతుంది. ఆ కంపెనీ 1953లో రెండు కోట్ల విలువ చేసే పెన్నులను అమ్మింది. 1960 నాటికి అమెరికాలో ప్రతి ముగ్గురిలో ఇద్దరు బాల్‌పెన్‌నే ఉపయోగించడం మొదలు పెట్టారు.

ఆదేదో తన గురించేనేమోననే అనుమానం కూడా కలిగింది.

లేచి త్వరగా పక్కబట్టలు సర్దేసి, బాత్ రూంకు పోయింది. మొహం కడుక్కుని హాల్లోంచి వంట గదిలోకి పోతున్న లక్ష్మిని అమ్మగారు పిలిచింది.

"ఇలారా నువ్వు" సుమతి చాలా చిరాకులో వున్నది.

"ఇదిగో, నిన్న నువ్వు బయటకు ఇల్లు వొదిలి వెళ్లావా? "

"లేదమ్మగారూ" భయంతో అబద్ధమాడింది మాధవి సంగతి మరిచిపోయి.

లోపలనుంచి మాధవి, "అబద్ధమాడుతోంది మమ్మీ. నేను శిరీషా వాళ్లింటికిపోయొచ్చేసరికి అది యింట్లోలేదు. పొరపాటున మెయిన్ డోర్ పడిపోయిందని చెప్పింది. అదసలు యింట్లోంచి బయటకు ఎందుకెళ్లిందో అడుగు" అంటూ హాలులోకి వొచ్చింది.

"బెడ్ రూం అల్మారాలో బంగారు గొలుసు పోయింది. ఇంట్లోకి కొత్తవాళ్లెవరొచ్చారు, ఎలాపోయింది? అసలు, నువ్వు బయటకు ఎందుకు వెళ్లావు? " గుడ్లురిమి చూస్తున్న సుమతిని చూస్తూ లక్ష్మికి వొళ్లంతా చెమట పట్టింది. దానికి ఏదో పోయిందనీ అర్థమైంది. వివరాలు అర్థం కాకపోయినా.

"మొక్కలకు నీళ్లు.."

"నోరుముయ్, అబద్ధమాడకు. మొక్కలకు నీళ్లు పోసినట్లు లేదు, నాలిక తెగ్గోస్తా. నిజం చెప్పు"

దానినోరు ఎండిపోయింది. శోభతో సినిమాకు వెళ్లానని చెపితే, చావు తప్పదు.

శ్రావ్య తల్లి బెడ్ రూం నుంచి బయటకు వచ్చింది. "అంతా వెదికాను మమ్మీ ఎక్కడా లేదు. లాకర్ లోనే పెట్టావా లేక బ్యాంకులో గాని.."

"నువ్వు వూరికే నన్ను కంగారు పెట్టకు. సుధక్క పెళ్లికి వెళ్లినప్పుడు బ్యాంకునుంచి తీసుకువొచ్చా- అలాగే లాకర్ లో వుండిపోయింది..."

నిస్పృహతో, చిరాకుతో సోఫాలో కూర్చుండిపోయిందావిడ.

"నువ్వు టెన్షన్ పడకు మమ్మీ, తప్పకుండా దొరుకుతుంది.."

"లక్ష్మీ, మమ్మీకి టీ తీసుకురా"

లక్ష్మి కిచెన్ లోకి పోయింది. దానికి ఒకటే ఆలోచనలు- గొలుసు ఏమైనట్లు? పరమయ్య సార్? ఛా, సార్ అలాంటోడు కాదు.. మరి కొత్తవాళ్లెవరూ రాలేదే? " దానికి గుండె ఆగినంత పనయింది. పొంగిపోతున్న టీని అలాగే గుడ్లప్పగించి చూస్తూ నిలబడింది.

లోపలకు వొచ్చిన శ్రావ్య విసుకున్నది. "ఏవిటి పిల్లా, ఎన్నిసార్లు పిలవాలి? వినబడలేదా?.. అయ్యో, టీ అంతా అలా పొంగిపోయిందేం? " అంది. టీ గిన్నె స్టవ్ మీద నుంచి దించి, "ఏమైంది నీకు? త్వరగా మళ్లా చెయ్యి" అని హాల్లోకి వెళ్లింది.

"డాడీకి ఫోను చెయ్యి" అన్నది సుమతి.

"నాకు బుద్ధిలేదు, వెంటనే బ్యాంకులో పడేస్తే పోయేది- అయినా లాకర్ లో పెట్టింది ఎలా పోయినట్లు? " అంది మళ్లీ.

"ఇది లక్ష్మివల్ల అయ్యేపని కాదు, అంతవరకూ చెప్పగలను" అన్నది శ్రావ్య. ఇంతలో కృష్ణారెడ్డి వొచ్చాడు.

"ఎలా పోయింది? అన్నిచోట్లా వెతికారా? కొత్తవాళ్లెవరూ రాలేదు గదా? " వంటి మామూలు ప్రశ్నలన్నీ వేశాడు.

"అన్నిచోట్లా వెదికాం డాడీ. ఎలా పోయిందో అర్థంకావడం లేదు".

ఫోను తీశాడు. "చేసేదేముంది, పోలీస్ కంప్లైంటు ఇవ్వాలి."

"ఏమని ఇస్తాం, ఇంట్లో దొంగలు పడ్డారనా? "

"అందర్నీ ఇంటారాగేట్ చేస్తారు, కాని వాళ్లని కూడా... లక్ష్మినీ, పరమయ్యను కూడా... అన్నట్లు అతను వూరికి పోయే ముందు గొలుసు వున్నదా? "

"అబ్బే, అతనలాంటి వాడు కాదు" భార్య అభ్యంతరం చెప్పింది. "బాగుంది, అతన్ని అనుమానించవద్దా, మరి ఎలా పోయి నట్లు? మాయమయిపోయిందా? " అన్నా డాయన చిరాగ్గా.

సుమతీ, శ్రావ్య, కృష్ణారెడ్డి ముగ్గురు ఒకే సారి లక్ష్మివైపు చూశారు. అది అయోమ యంగా నిలబడి వున్నది.

"ఇలా రా నువ్వు" దగ్గరకు వొచ్చింది.

"నువ్వు చెప్పు. ఈ మధ్యలో ఎవరైనా కొత్తవాళ్లు వొచ్చారా? గొలుసు గురించి నీకు తెలిస్తే భయపడకుండా నిజంచెప్పు"

"నాకు తెలియదు సార్, ఎవరూ రాలేదు..'

సుమతి గద్దించింది.

"నిజం చెప్పు, అబద్ధం చెప్పావా.. ఈసారి చిన్నదానివని కూడా చూడను. అసలు ఇది వచ్చినప్పటినుండి ఏదో గొడవే! అన్నట్లు మరో విషయం, ఈ మధ్య ఎవరో వొచ్చి, చిన్నపిల్లల్ని పనికి పెట్టుకోవడం నేరమనీ, ఇంకా ఏదేదో అన్నారు.. అసలు వాళ్లకెలా తెలిసిందో? "

ఆయన పోలీసులకు ఫోను చేశాడు. ఫోను పెట్టాక, "ఎక్కడ వస్తువులక్కడే వుండనివ్వండి, ఏదీ కదిలించవొద్దు" అని లేచి లోపలికి వెళ్లాడు.

లక్ష్మిని కిచెన్‌లోకి వెళ్లి బుజ్జగిస్తూ అడి గింది శ్రావ్య. "నాకు చెప్పు లక్ష్మి, ఎవర యినా కొత్తవాళ్లు వొచ్చారా? భయపడ కుండా చెప్పు- మళ్లీ పోలీసులు వొస్తే అదో గొడవ! నీకేమయినా తెలిస్తే ఇప్పుడే చెప్పు.."

తనూ, శోభా కలిసి సినిమాకు వెళ్లిన సంగతి చెప్పేద్దామా అని నోటిదాకా వచ్చింది. కాని మళ్లీ భయపడింది, ఆ

## కొత్తగాలి...

**నిలవాలంటే పరువు**
**కాకూడదు నువ్వు**
**ఎవ్వరికీ**
**బరువు**

*-జెట్టిగుండ్ల రఘునాథరెడ్డి, సామిరెడ్డిపల్లె*

విషయం తెలిస్తే అమ్మగారు కొట్టబోయే దెబ్బలు తలుచుకుని. అవును, ఆ రోజు కాళ్లపైన వేడినీళ్లు పొయ్యలేదూ? అమ్మో, చెబితే ఇంకేమయినా వుందా...? "

కాలింగ్ బెల్ మోగింది.

లక్ష్మి వెళ్లి తలుపు తెరిచింది. ఎదు రుగా నిలబడిన ఇద్దరు పోలీసులూ దాని కంటికి దెయ్యాల్లా కనబడి జడుసుకున్నది.

సుమతి హాల్లోకి వొచ్చింది.

"కూర్చోండి, ఆయన్ను పిలుస్తా"

ఒకాయన పెద్దాయన- పొట్టిగా, లావుగా, పెద్ద పెద్ద మీసాలూ. రెండో పోలీసు చిన్నవాడే..

కృష్ణారెడ్డిని చూసి లేచి నిలబడ్డారు పోలీసులు. వాళ్లను కూర్చోమని సంజ్ఞచేసి, తనూ సోఫాలో కూర్చున్నాడు.

"మీ సార్ రాలేదేవయ్యా.. అంత బిజీగా వున్నాడా? "

"అవును సార్, కమిషనర్ ఆఫీసుకు అర్జంటు పనిమీద వెళ్లారు. నా పేరు.." తననూ, తన అసిస్టెంటునూ పరిచయం చేసుకున్నాడు హెడ్ కానిస్టేబుల్.

రెండో అతను నోట్‌బుక్, పెన్నూ తీశాడు. వివరాలన్నీ నోట్ చేసుకున్నాడు.

"అదీ విషయం- ఇంట్లోకి బైటివాళ్లెవరూ రాలేదు. ఈ పిల్ల మా యింట్లోనే వుంటుంది. తెలిసినవాళ్ళ పిల్లే! వంటా యన నాలుగు రోజుల క్రిందటే- అంటే

గొలుసు కనబడకుండా పోవడానికి ముందే- ఎవరో చనిపోయారని వూరు పోయాడు. రెండు రోజుల్లో వస్తాడు..."

హెడ్డుగారు కళ్లద్దాల గుండా లక్ష్మిని తీక్షణంగా చూశాడు. "ఏం పిల్లా, నీకేమైనా తెలుసా? తెలిస్తే చెప్పు- దాచిపెట్టావా? పోలీసు వాళ్ల సంగతి నీకు తెలవదు. తోలు వొలిచి నిజం చెప్పిస్తాం. చెప్పు నీకు తెలిసిందేమిటో? "

లక్ష్మి పోలీసు వేపూ, అయ్యగారి వైపూ ఓసారి చూసి పెద్దగా ఏడ్చేసింది. దాని వద్దకు రాబోయిన శ్రావ్యను తండ్రి వారించడంతో ఆగిపోయింది.

పోలీసాయన గొంతు తగ్గించి, సున్నితంగా "చూడు తల్లీ, నువ్వు ఏడిస్తే పోయిన వస్తువు తిరిగి రాదు గదా! అది దొరికే వరకూ నువ్వెంత ఏడిచినా ఏం లాభం లేదు.." అన్నాడు. తర్వాత కృష్ణారెడ్డితో, "ఈ రోజుల్లో చిన్న పిల్లలే ఆరితేరి పోతున్నారు సార్. ఎన్ని కేసులో! నాలుగు రోజులు పనిచేసి, నమ్మకం కలగ్గానే ఏ వస్తువో చేజిక్కించుకుని మాయమయిపోతారు. ఇంక వాళ్లను పట్టుకోవడం మా తరం కాదు. వాళ్ళ కేస్ షీట్లు వుండవు" అన్నాడు మీసం మెలేసుకుంటూ.

"సరే సరే, మీ డ్యూటీ మీరు చేయండి. మా వస్తువు మాకు తిరిగిరావాలి, అంతే.. కంప్లెయింటు రాయాలా? "

"వొద్దు సార్, కంప్లెయింటు రాస్తే లేనిపోని చిక్కులు- మీ కెందుకు సార్! మీ వస్తువు మీ కప్పజెప్పే పూచి మాది.. పదవే పిల్లా పోదాం.." అంటూ టోపీ చేతిలోకి తీసుకుని లేచాడు.

శ్రావ్య బతిమాలుతూ, "డాడీ! అది చిన్నపిల్ల, స్టేషన్‌కు తీసుకు పోవడమెందుకు? అడిగేదేమిటో ఇక్కడే అడగొచ్చు గదా? " అన్నది.

హెడ్డుగారు నవ్వి, "పాపా, ఇక్కడెలా అడుగుతాం? అడిగే పద్ధతిలో అడిగితేనే పనిజరుగుతుంది.. ఏందే ఇంకా నిలబడ్డావు, నడు" అని అరిచాడు లక్ష్మికేసి చూస్తూ.

గుమ్మంలో నిలబడిన సుమతి, "పాడు ముండ, ఎక్కడ్నుంచో మా ప్రాణాల మీద కొచ్చింది.. తిన్న తిండికి కొవ్వెక్కి.." అంటూ తిడుతున్నది అప్పటికే నేరం రుజువయినట్లు.

"ఏమిటమ్మా నువ్వు? అదే తీసిందని నీకు తెలుసా? దాని దగ్గర దొరికిందా? అదెక్కడ దాస్తుంది? " అన్నది శ్రావ్య.

పోలీసాయన బిగ్గరగా నవ్వి, "పాపా, దొంగ సొమ్ము దగ్గరుంచుకుంటారా? అప్పుడే దాటించేస్తారు. నీకెందుకమ్మా, నిజాన్ని దాని నోటెంబడే కక్కిస్తాం, చూడు.." అన్నాడు బెల్టు సర్దుకుంటూ.

## ఇష్టంలేక

'ఎప్పటిలాగే మీరు ఈసారీ మర్చిపోయారు ఇవ్వాళ నా పుట్టినరోజని..'బుంగమూతి పెట్టింది భైరవి.

చటుక్కున నాలుక కొరుక్కున్న భాస్కర్- 'భలేదానివే.. ఇవ్వాళ నీ పుట్టిన రోజన్న విషయం నేను కల్లోనైనా మర్చిపోతానా? నువ్వింకో సంవత్సరం పెద్దదానివై పోయావన్న బాధాకరమైన విషయం చెప్పడం ఇష్టంలేక..' అంటూ నసిగాడు.



"అంకుల్, దాన్ని కొట్టకండి, చిన్న పిల్ల- భయపెట్టండి చాలు" అన్నది శ్రావ్య చివరి ప్రయత్నంగా.

దానికి జవాబివ్వకుండా లక్ష్మిని రెక్క పట్టుకుని నడిపించాడు.

★ ★ ★

పోలీస్‌స్టేషన్ ముందు జీపు ఆగింది. హెడ్ కానిస్టేబుల్ కిందకు దిగుతూ- "నీకు బొట్టెట్టి ప్రత్యేకించి చెప్పాలేంటి.. కిందకు దిగు.." అంటూ గట్టిగా గదమాయించాడు. కారాకిల్లీ తెగనమిలే అలవాటుందేమో.. అతని నోరంతా ఎర్రగా, పళ్లన్నీ గారపెట్టి అసహ్యంగా కనిపించాయి లక్ష్మికి. భయం భయంగా కిందకి దిగిందామె. హెడ్డు ముందుకు నడుస్తుండగా కానిస్టేబుల్, లక్ష్మి అనుసరించారు.

పోలీస్‌స్టేషన్ చూడడం లక్ష్మికి అదే మొదటిసారి. నగరానికి రాకముందు ఇక్కడెన్నో వింతలుంటాయని ఎంచక్కా చూడొచ్చని తండ్రి ఎంతో ఊరించాడు. సినిమాలు, షికార్లు తిరగొచ్చని, రోజుకు మూడుపూటలా కడుపునిండా తిండి తినొచ్చని... ఇలా ఎన్నో విషయాలు చెప్పాడు. అయితే... తండ్రి చెప్పినదానికీ ఇక్కడ అనుభవిస్తున్న జీవితానికి ఎంతో తేడా ఉంది. లేచిందగ్గర్నుంచీ పనిపాటలు, కసుర్లు, విసుర్లు, అపుడపుడూ కమిలిపోయేలా బెల్టుదెబ్బలు చవి చూసింది. తను పనిచేసే ఇంట్లో పెద్దటీవీ ఉన్నా ఒక క్షణమైనా చూసే అవకాశం చిక్కలేదు. అందుకే... శోభ సినిమా చూపిస్తానంటే ఆశపడి మొట్టమొదటిసారిగా సిన్మాకి వెళ్లింది. ఆ సిన్మా ఎంతో నచ్చింది. తెరపై కనిపించి, ఆడిపాడిన వారిని యాక్టర్లంటారుట! శోభ చెప్పింది. వారెంతో బాగున్నారు. ఇక వారం వారం సిన్మా చూపిస్తానని శోభ మాటిచ్చింది. ఒక స్వర్గంలోకి వెళ్లి వచ్చిన ఆనందాన్ని మూటగట్టుకుని వచ్చిన లక్ష్మి- ఇపుడు నరకానికి వచ్చినట్లు బెంబేలు పడుతోంది. పోలీస్‌స్టేషన్‌ని తొలిసారిగా చూస్తున్న ఆమెకు భయం విపరీతంగా కలిగింది. అంతమంది పోలీసులు కనిపించడంతో తానేమైపోతానోనని ఆందోళన చెందింది. అమ్మానాన్నా ఒక్కసారి గుర్తొచ్చారు. పుస్తకాలు కొనిస్తా... చదువుకోమని ఎంతో అభిమానంగా చెప్పే శ్రావ్య గుర్తుకొచ్చింది. రోజూ తాను నీళ్లు పోసే మొక్కలు గుర్తొచ్చాయి. అవి తొడిగే మొగ్గలు గుర్తొచ్చాయి. అంతకు మించి పరమయ్య గుర్తొచ్చాడు. 'నీకేం ఫర్వాలేదు... మరెక్కడైనా మంచిగా బతుకుతావా... దారి చూపిస్తాను...'అంటూ ఆప్యాయంగా పలకరించే మోహన్ గుర్తొచ్చాడు.

## కొత్తగాలి...

**ప్రతిభకు**
**పట్టాభిషేకం అరుదు**
**కాకాలతోనే కదా**
**అందేను బిరుదు**

–పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, నెల్లూరు

"దాన్నిలా తీసుకురా!" కళ్లద్దాల హెడ్డు అరిచాడు.

"సార్... చిన్న రిక్వెస్ట్. అది చిన్నపిల్ల. కాస్త నెమ్మదిగా అడగండి"

ఆ మాటలకు అసహనంగా కదిలాడు హెడ్డు. తర్వాత బిగ్గరగా నవ్వి- "అబ్బ పరమేశం... సర్వేజనా సుఖినోభవంతు అనుకుంటూ ఏ గుళ్లోనో పనిచేసుకోవాల్సినవాడివి విధివక్రించి ఈ పోలీస్‌స్టేషన్‌లో పడ్డావు. నేరాలు- ఘోరాలు చేసేవారిని నెమ్మదిగా 'అమ్మాబాబూ' అని బుజ్జగిస్తే విషయం బయటపడదు... అదంతా నీకిప్పటికిపుడే అర్థంకాదు కానీ... నేను చెప్పి

నట్లు ఆపిల్లని పిలుచుకునిరా..."

కానిస్టేబుల్ లక్ష్మిని హెడ్డు ముందు నిలబెట్టాడు.

హెడ్డు లక్ష్మి వంక గుడ్లురుముతూ చూస్తూ.."ఏమే.. ఆగొలుసేడ దాచావే?" అడిగాడు కటువుగా.

కార్ఖానా సైరన్‌లా మోగిన అతని గొంతుకు హడలిపోయింది లక్ష్మి. ఏం చెప్పి తన సత్యసంధతను నిరూపించుకోవాలో అర్థం కాలేదామెకు. అనుకోకుండా కంటనీరు పెల్లుబికింది. అది చూసి హెడ్డు "ఏయ్! ఇలా నోరు మెదపకుండా కన్నీరు కార్చేస్తే వదిలేసేందుకు నేనేం వెర్రి వాజమ్మను కాను. చండశాసన ముండావాడిని. కాకలు తీరిన, గుండెలు తీసిన నేరస్థులనుంచీ క్షణాలలో నిజాలు వెళ్లగక్కించినవాడిని. నీతో ఎంతసేపు నిజం కక్కించడం... చెప్పు... ఆ గొలుసెక్కడ దాచావు?"

మాటాడలేదు లక్ష్మి.

"అసలేం జరిగింది? నీవొక్కర్తివే ఆ గొలుసు దొంగిలించావా? లేక, నీవెనుకెవరైనా ఉన్నారా?"

లక్ష్మికి ఒకటి మాత్రం బోధపడింది. శోభతో సినిమాకు వెళ్లకముందుదాకా ఇటువంటి పరిస్థితిని ఇంటాబయటా ఎదుర్కోలేదామె. అంతలోనే హెడ్డు అడిగాడు... "కాలనీలో ఎవరెవరితో నీకు పరిచయం..."

ఏ ప్రశ్నకూ సమాధానమివ్వకుండా మూగలా నిలబడిన లక్ష్మిని చూసి... ఇందాకటి కానిస్టేబుల్- "అయ్యగారికి కోపం తెప్పించకు. అసలు విషయాన్ని త్వరగా చెప్పేయి. ఇంటికి వెడుదువుగానీ" బుజ్జగించాడు.

అంతే! అంతవరకూ ఎంతో నిదానంగా మాట్లాడుతున్న హెడ్డుకి కోపం తారాస్థాయికి చేరుకుంది. ఒక్క ఊదుటున లేచి చిన్నపిల్లని కూడా చూడకుండా ఆమె చెంప చెళ్లుమనిపించాడు. ఆమె లేతబుగ్గ ఎర్రగా కమిలింది. అయితే, అంతటితో ఆగలేదు ఆ హెడ్డు. అనరాని మాటలంటూ, నానాబూతులూ తిడుతూ "నా సహనాన్ని పరీక్షిస్తావే లం..! పరమేశం అడిగాడని పోనీపాపమని నెమ్మదిగా అడుగుతుంటే వేషాలేస్తున్నావా? చెప్పు... గొలుసెవరెవరు తీసారు? ఏం చేసారు? ఎక్కడదాచారు? చెప్పకపోయావో ప్రాణాలతో బయటపడడంకల్ల. పోలీసు దెబ్బలేంటో రుచి చూపిస్తా.." అంటూ లాఠీని అటూఇటూ తిప్పసాగాడు.

"సార్... వద్దు సార్! పిచ్చుకపై బ్రహ్మాస్త్రం వద్దు..." అని పరమేశం బతిమాల్తున్నా హెడ్డు ఆమెను ఎడాపెడా బాదిపారేశాడు. లాఠీకి కూడా పనిచెప్పాడు. దాంతో... లక్ష్మి ఏడుపు లంకించుకుంది.

అయిదునిముషాల తర్వాత-

ఎవరూ ఇంట్లో లేనపుడు శోభ వచ్చిన సంగతి, ఆమె చొరవగా వంటింట్లోకి వెళ్లి టీ కలుపుకుని వచ్చినది మొదలు అన్ని విషయాలను పూసగుచ్చినట్లు వివరించింది లక్ష్మి. అయితే.. లక్ష్మికి మాత్రం తాను ఇంట్లో ఎవరికీ తెలీకుండా సినిమా చూసివచ్చిన సంగతి తెలిసిపోతుందేమోననే భయపడుతోంది. అంతకుమించి ఆమె ఊహ ముందుకు పోలేదు కూడా.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ సార్, కూర్చోండి... చూశారా, నాలుగు తగిలించేసరికి హిస్టరీ అంతా బైటికొచ్చింది"

కృష్ణారెడ్డి ఆశ్చర్యపోయాడు.

"ఏం చెప్పింది? తనే తీశానన్నదా?"

"లేదు- మీ యింటి దగ్గరే వేరే దగ్గర పాచిపనులు చేసుకునే మనిషి- అదీ తనూ కలసి సినిమాకు పోయామన్నది. వెంటనే

## కొత్తగాలి...

**నా మది కలవరానికి**
**కారణం నువ్వే...**
**నా గుండె గుమ్మానికి**
**తోరణం నువ్వే...**

*-పట్ల యాదయ్యాయాదవ్, గుండాల*

మాకు అర్థమైంది. ఆ మనిషి- దాని పేరు శోభ- పెద్దకిలాడి- ఇంతకు ముందోసారి మాకు చిక్కింది, రుజువు లేక వొదిలాం. ఈసారి మరో నాలుగు కేసులు బనాయించి లోపలేసేదాకా వొదిలేది లేదు.. దాన్ని తీసుకువొచ్చి లోపలపెట్టాం.."

"మరి ఈ పిల్లను.."

"తీసుకుపొండి సార్, మూడొంతులు సాయంత్రానికల్లా మీ వొస్తువు దొరుకుతుంది.."

లక్ష్మిని వెంటబెట్టుకుని వొచ్చి కారులో కూర్చున్నాడు. డ్రయివర్ స్టార్ట్ చేశాడు.

"ఏం పిల్లా, ముందే ఈ సంగతి చెపుతే నిన్ను ఇక్కడకు తెచ్చేవారు కాదు గదా?" అడిగాడు కృష్ణారెడ్డి. లక్ష్మి మొహం పీక్కుపోయి, ఎండిన కన్నీళ్లతో మట్టిగొట్టుకుని వున్నది.

ఇంటికి వొచ్చిన భార్యను పిలిచి లక్ష్మిని ఏమీ అనవద్దని చెప్పాడు. దానికి దెబ్బలు బాగా తగిలివుంటాయని గ్రహించి భర్తను అడిగింది.

"ఇంతకూ వొస్తువు దొరికిందా?"

"దొరుకుతుందన్నారు, ఆ మనిషిని తీసుకొచ్చారు.. ముందుదాన్ని తీసుకుపోయి మొహం కడిగించి తినడానికేమన్నా పెట్టు.. పరమయ్య ఇంకా వూరినించి రాలేదా?"

మధ్యాహ్నమయింది. ఏదో తిని మరుక్షణమే గాఢనిద్రలో పడింది లక్ష్మి. రాత్రి పొద్దుపోయేదాకా అట్లాగే పడివున్నది.

నిద్రలేచి చీపురు తీసుకుని ఇల్లూడవసాగింది. సుమతి వంటగదిలోంచి వొస్తూ, "ఆ చీపురు అలా పారేసి ఇట్లారా" అని పిలిచి, తను కూర్చున్నది.

లక్ష్మి వొచ్చి నిలబడింది.

"నువు మీ వూరెళ్లిపో, మీ బాబుని సార్ పిలిపిస్తానన్నారు- ఇంక ఇక్కడ నువ్వు వుండవలసిన అవసరం లేదు"

లక్ష్మి గుడ్లప్పజెప్పి చూస్తున్నది. వెంటనే ఏడుస్తూ "నన్ను పంపవద్దమ్మగారూ, మీ కాళ్లు పట్టుకుంటా. ఇంకెప్పుడూ ఏ తప్పూ చెయ్యనమ్మా, ఇంట్లోంచి బైటకే పోను- ఎవరితో మాట్లాడను- మా నాయన చంపేస్తాడు- నేను మీకాడే వుంటానమ్మగారూ" అంటూ వెక్కివెక్కి ఏడవసాగింది.

ఆవిడలో ఏమూలో కొంచెం జాలి కలిగింది. "వూరికే ఏడవకు, చెప్పేది విను- ఈ సిటీలో నీకు ఎలావుండాలో చేతగాదు, ప్రతి మనిషినీ నమ్ముతావు. ఇక్కడ అనవసరంగా ఎవరితోనూ చనువుగా వుండగూడదు. నువ్వొక పల్లెటూరి మొద్దువి. అయినా మీవాళ్లను చూడాలనీ, వాళ్ల దగ్గరే వుండాలనీ నీకు లేదా?"

"లేదమ్మగారూ, నేను మళ్లా వూరికి పోను. మీ కాణ్ణే వుంటా" మళ్లీ ఏడవసాగింది.

"సరేలే, సార్‌తో మాట్లాడతా. నువ్వు పోయి నీ పని చూసుకో, పో" అని అవతలకు పంపేసింది. ఏదో మూల, అతి కొంచెం, సూదిమొనంత జాలి కలిగింది- 'పాపం, చిన్న పిల్ల, ఇలా పరాయి యిళ్ళల్లో బతకడం' అనుకుంది.

వెంటనే ఆ ఆలోచనను మనసు నుంచి తుడిచివేస్తూ "లక్ష్మీ, మొక్కలకు నీళ్లు పొయ్యలేదా?" అని కేక పెట్టింది.

మర్నాడు పోయిన నగదొరికింది.

గొలుసు భార్య చేతికిచ్చాడు. "నయమే, లక్ష్మికేమీ సంబంధం లేదని చెప్పిందట. అనవసరంగా ఇది దెబ్బలు తిన్నది..."

"దాని తప్పుకూడా వున్నది లెండి. అసలా మనిషిని యింటికి ఎందుకు తీసుకురావాలి? నాలుగు దెబ్బలు పడితే భయం వుంటుంది" అన్నదావిడ గొలుసును పరీక్షిస్తూ.

ఇదంతా వింటున్న శ్రావ్య మనసు బాధ పడింది. 'అది చెప్పలేదుగానీ పోలీసులు చెయ్యి చేసుకునే వుంటారు. దానికిక్కడ నుండి విముక్తి లేదా ఏం? వూరికి పోనంటుంది. నిజమే, ఆ తండ్రి వెధవ దాన్ని మరెవరికో అమ్మేస్తాడు. ఆ మోహన్‌గారి వద్దకే వెళితే ఏ హాస్టల్లోనో జేర్పిస్తాడంటే వెళ్లనంటుంది.. దానికి మనుష్యులపైన నమ్మకం పోయినట్టుంది' అనుకుంది.

రోజులు గడుస్తున్నాయి. జీవితం యాంత్రికంగా తయారైంది. ఉదయం నుంచి సాయంత్రం వరకు యింటిపనులు చేస్తుంది లక్ష్మి. మధ్యాహ్నం ఒకటి రెండు గంటలు మాత్రం దానికి కొంచెం ఆనందంగా వుంటుంది- శ్రావ్య చదువు చెప్పటం వల్ల.

రెండు పూట్లా తిండి, ఒకసారి చాయి, అప్పుడప్పుడు టీ.వీ.- ఇన్ని వున్నా లక్ష్మికి గాలి ఆడనట్లు వుక్కిరి బిక్కిరిగా వుంది, జైల్లో పెట్టినట్లు!

దాని ధోరణి గమనిస్తూ వొస్తున్న శ్రావ్య ఒకనాడు "ఏవిటి లక్ష్మి, దిగులుగా వుందా? అమ్మావాళ్లని చూడాలని వుందా? ఒకసారి వూరు పోయివొస్తావా? పరమయ్యను తోడు యిచ్చి పంపుతా- నాలుగు రోజులుండి వద్దువుగాని"

లక్ష్మి తలెత్తింది. దాని కళ్ళల్లో నీళ్లు. దాని భుజంమీద చేయి వేసింది శ్రావ్య.

"ఈరోజే అమ్మతో మాట్లాడి వూరు పంపిస్తా, సరేనా? "

దాని కళ్లలో ఏదో అనుమానం...

శ్రావ్య నవ్వుతూ, "నాలుగు రోజులున్నాక మళ్లా పరమయ్య వొచ్చి తీసుకువస్తాడు" అంది.

సుమతి కూడా అభ్యంతరం చెప్పలేదు. కాని పరమయ్య కూడా వెళుతుండటంతో విసుక్కున్నది.

"ఫరవాలేదు మమ్మీ. ఒక్కరోజే కదా.. దింపేసి వచ్చేస్తాడు- ఒక్కపూట ప్రయాణమే కదా? " నచ్చజెప్పింది కూతురు.

"అలాగే- బజారుకు పోయి, వాళ్లకు నాలుగు బట్టలుకొని చేతికియ్యి-" ఆరోజే శ్రావ్య బజారుకు వెళ్లి బట్టలూ, స్వీట్లూ కొని తెచ్చింది.

మర్నాడు వుదయమే పరమయ్యా లక్ష్మి వూరికి బయలుదేరారు. "జాగ్రత్త లక్ష్మి, ఈ డబ్బు వుంచుకో - మీ నాయనకు యివ్వకు... మళ్లా శనివారానికి పరమయ్య వొచ్చి తీసుకువస్తాడు- తప్పకుండా" శ్రావ్యను వొదిలివెళ్లాలంటే లక్ష్మికి దిగులు కలిగింది.

"ఏడుపుగొట్టూ, హాయిగా నాలుగురోజులు చెల్లెళ్లతో ఆడుకుని తిరిగిరా". ఆ పిల్లకూ ఏదో బాధ- లక్ష్మి మంచి చెడ్డలు తనే చూడడం ఆ పిల్లలో ఏదో సంతృప్తి కలిగిస్తున్నది- ఒక దిక్కులేని పక్షిని ఆదరిస్తే కలిగే సంతృప్తి!

లక్ష్మికి వూరంతా కొత్తగా కనబడుతున్నది. వూరంతా మారిపోయినట్లూ, మనుష్యులు కొత్త కొత్తగా కనబడుతున్నారు. నిజానికి అలాంటి వూళ్లు, మనుష్యులూ అంత త్వరగా మారరు. ఆలోచనలూ, అనుభవాలూ విస్తరించిన మార్పు లక్ష్మిలోనే కలిగింది...

బక్కచిక్కి ఎలక పిల్లల్లా వున్న ఇద్దరు చెల్లెళ్లనూ చూసేసరికి దానికి ఏడుపొచ్చింది. వాళ్లు కాస్సేపు దాని దగ్గరకు రావడానికి భయపడ్డారు. ఆ గుడిసె, చింపిరి

గుడ్డలు, ఎండిపోయిన గడ్డిలా వున్న జుట్టూ, కంకాళాల్లాంటి వొళ్లూ- వాళ్లను చూస్తూంటే వాళ్లిలావుండటానికి కారణం ఏమిటనే ఆలోచనకలిగింది. వీళ్లిలా మాడి పోతుంటే, తనక్కడ 'హాయిగా' బతుకుతు న్నదని బాధ కల్గింది.

తనలాగానే వాళ్లను కూడా ఎవరింట్లోనో పనికి కుదిరిస్తే బాగుణ్ణు- కనీసం తిండన్నా వుంటుంది- అనుకున్నది. ఆ క్షణంలో తన బానిస బతుకూ, తిట్లూ దెబ్బలూ, పోలీసులూ- అవేవీ దానికి గుర్తురాలేదు. వీటన్నింటికంటె భయంకర మైనది ఆకలి అనే విషయం దానికెలాగో తెలుసు!

కాస్సేపయ్యాక బెరుకుతగ్గి దగ్గరకొచ్చారు వాళ్లు. బ్యాగులోనుంచి బొమ్మలూ, బట్టలూ తీసియిచ్చింది. వాళ్లు అక్కను భయంతో, భక్తితో చూశారు.

"నాయనెక్కడికి పోయినాడు? " తల్లిని అడిగింది.

"యాడికి పోతాడు! తాగడానికి పోతాడు" సారమ్మ కూతుర్ని పూర్వంకంటె కొంచెం ప్రేమగా చూసింది.

"ఏమే, ఇవన్నీ అమ్మగారు పంపించారా? నిన్ను మంచిగా చూస్తు న్నారా? అప్పుడు మాతో వొస్తానని ఏడ్చి నావు! చూశావు, అణ్ణెవుంటే ఎట్టావున్నావో చూడు. ఈడేముంది మట్టీ మశానం!"

"ఏంది, ఈళ్లు ఇట్టా ఎండిపోయినారు? బువ్వ తినడం లేదా? నాయన పనులకు పోతున్నడా లేక కల్లు దుకాణంకాడనే..."

ఇదంతా, వింటున్న పరమయ్య ఆశ్చర్య పోయాడు. పిల్లకా నిండా పదేళ్లు లేవు! ఎంత బాధ్యతతో మాట్లాడుతోంది! అయితే తమ చిన్నపాపకు ఆ ఇంట్లో సుమతమ్మ ఈనాటికీ అన్నం కలిపి నోట్లో పెడు తుంది!

తండ్రి కోసం లక్ష్మి తల్లి పెద్ద చెల్లిని పంపింది.

"నేను బయలుదేరతా లక్ష్మమ్మా! మళ్లా సాయంత్రానికంటూ వంట పనుంటుంది కదా!" అన్నాడు పరమయ్య.

"చాయ తాగిపోండి సార్, బైటికెల్లి తెప్పించుతా..."

అక్కర్లేదని చెప్పి, మళ్లా శనివారానికల్లా తిరిగివొస్తానని బయలుదేరాడు పర మయ్య.

"ఈన మంచోడేనా? కడుపునిండా బువ్వ పెడతాడా? " అడిగింది తల్లి, పొయ్యి శుభ్రంచేస్తూ.

"ఏంది లక్ష్మమ్మా, చాలా పెద్దయినావే? " అన్నాడు ఆమె తండ్రి వస్తూనే.

చెల్లెళ్లు సంబరంగా అక్కతెచ్చిన బొమ్మలూ అవీ తండ్రికి చూపారు. తండ్రి మండిపడ్డాడు. "ఏందిది? ఎన్ని పైసలు తగలేసినావు? "

"ఉండవయ్యా, నీదంతా లొల్లి! అమ్మోళ్లు పంపారంటా" అన్నది సారమ్మ విసుగ్గా.

పాపయ్య చల్లబడ్డాడు.

"చూసినావు, ఈ కొత్త సారోళ్లు ఎంత మంచోళ్లు! క్రిందటి సారోళ్లు వొక్కనాడన్నా ఇట్టా పంపినారా? ఈళ్లను వొదిలేది లేదు. నువ్వుమళ్లా అట్టాంటి పని చేశావా నా చేతిలో చచ్చావే..."

"ఊరుకోవయ్యా.. సరేగాని, డబ్బు లుంటే ఇయ్యి... దానికేమన్నా చేసి పెట్టాలి."

"నాకాడేముంది! దాని దగ్గర తీసుకో- ఏమే పట్నంపిల్లా! సారు ఎన్ని పైసలి చ్చిండు... ఇట్టా యియ్యి."

లక్ష్మి బ్యాగులోనుంచి మూడువందలు తీసి ఒక నోటు తండ్రికివ్వబోయింది.

"ఏందదీ? మూడొందలా? నువ్వొట్టి మొద్దుముండవి- ఇన్నాళ్లకొచ్చినావు- అడిగి ఎక్కువ తీసుకురావొద్దా..."

## కొత్తగాలి...

**అక్షరం**
**అదో అద్భుతం**
**నిందించకు దాన్ని**
**నినదించు భా'స్వరా'న్ని**

*-లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం*

మూడువందలూ పెళ్లాం అడ్డుపడుతున్నా విదిలించుకుని, బొడ్లో పెట్టుకున్నాడు.

"బియ్యం, పప్పూ, కూరా తీసుకురా, అంతా తాగుడుకు పెట్టమాకు- దాని కష్టం సిగ్గులేకుండా..." అరుస్తున్నది సారమ్మ.

"వూరుకోయే, సరుకులకే పోతుండా- అయినా నా బిడ్డ సొమ్ము మీద నా కధి కారం లేక ఎవరికుంటుందే? "

వెంటనే మాయమయ్యాడు.

"నువ్వాక యెర్రిముండవి- పైసలన్నీ ఆడికెందుకు చూపినావు? - నీ చెల్లెళ్లు చూడు- కడుపునిండా తిని ఎన్నాళ్ళ యిందో- ఆ చచ్చినాడు పైసలన్నీ కల్లుదుకాణంలో ఖర్చు పెట్టేస్తాడు.." అన్నది తల్లి నిస్పృహగా.

లక్ష్మిలేచి బ్యాగునుంచి బిస్కట్లూ, స్వీట్లూ, బ్రెడ్డూ తీసి తల్లి చేతికిచ్చింది.

దానికి తల తిరిగిపోతున్నది. పైసలన్నీ తండ్రి చేతికిచ్చినందుకు పశ్చాత్తాపపడింది. తల్లీ తండ్రీ తన ద్వారా డబ్బు సంపాదించడం తప్ప, తనన్నా చెల్లెళ్లన్నా ఏ మాత్రం ప్రేమ చూపడం లేదనిపిస్తున్నది దాని చిన్న బుర్రకు...

'వీళ్లనూ తమ తండ్రి ఎక్కడో పనికి పెట్టేవాడే వాళ్లు కాస్త పెద్ద వాళ్లయి వుంటే.. ఈ పిల్లలకు కాస్త వయసొచ్చి బలం పట్టాక అట్లాగే చేస్తాడు..' అనుకుంది..

సరుకులు తెస్తానని పోయిన మొగుడు ఎంతకూ రాకపోవడంతో సారమ్మ బూతులు తిట్టుకున్నది. "ఎక్కడ చచ్చాడో- నేనే పోయొస్తా- నీకు బుద్ధిలేదే, పైసలన్నీ ఆడిచేత పెట్టినావు."

అట్లానే కూర్చుంది తను తెచ్చినవి తింటున్న చెల్లెళ్లను చూస్తూ. దానికి స్వంత యింటికి, తల్లిదండ్రుల దగ్గరకు వొచ్చినందుకు ఆనందం.

దానికి ఆకలేసింది. నాలుగు బిస్కట్లు, తనూ తీసుకుని తిన్నది. తండ్రిపైన కోపం వొచ్చింది. చెల్లెళ్లు ఏంతింటారో అని కూడా చూడకుండా అదే పోకపోయాడు. శ్రావమ్మ ఎంత మంచిది. మోహన్ సార్- మంచివాడు. తనను చదివిస్తానన్నది శ్రావమ్మ!

దానికి వింత ఆలోచనే వొచ్చింది- తన తల్లిదండ్రుల వద్ద బాగా డబ్బుంటే, తననూ, చెల్లెళ్లనూ బాగా చూసుకునే వారేమో! 'అయ్యగారు' కూడా బాగా 'తాగు'తారని పరమయ్య చెప్పాడు. డబ్బున్నవాళ్లు ఎంత తాగినా ఎవరికీ బాధలేదు. తన తండ్రి విషయం ఎప్పుడొచ్చినా 'ఆ తాగుబోతు వెధవ' అంటుంది 'అమ్మగారు!'

తండ్రిని నడిపించుకుంటూ తీసుకువచ్చింది తల్లి. గుడిసెలో అడుగు పెడుతూనే కుక్కిమంచం మీద కూలబడ్డాడు పాపయ్య.

"ఆ దుకాణం మనిషిని బతిమిలాడి ఓ వందకు తెచ్చినా.. మూడొందలూ బాకీ తీర్చాడంట చచ్చినాడు! ఇట్టా అయితే ఏంతినాలి? ఎదవ బతుకు" తిట్టుకుంటూనే తిండి ప్రయత్నం మొదలెట్టింది అతడి భార్య.

లక్ష్మికి తండ్రిమీద జాలి కలిగింది. వొచ్చిన పైసలన్నీ తాగేస్తున్నాడు. వూర్లో పనుల్లేవు. ఏ కూలో చేస్తే వొచ్చిన పైసలు

# చర్చే జైలు

పరాగ్వేలోని సెంట్రల్ జైలులో 3200 మంది ఖైదీలు ఉంటారు. వారిలో కరడుగట్టిన నేరస్థులు చాలా మంది ఉన్నారు. ఆ జైలులోనే లిబెర్టా అనే చర్చి కూడా ఉంది. అది చాలా విషయాల్లో జైలులాంటిదే. భక్తులైన 500 మంది ఖైదీలు ఇందులోనే నివాసం ఉంటూ శిక్షననుభవిస్తున్నారు. వారంతా జైలులోని ఆ చర్చికి సంబంధించిన నియమాలను పాటిస్తామని ప్రమాణపత్రం మీద సంతకం చేస్తేనే, అక్కడ ఉండనిస్తారు. ఇక్కడ కూడా తుపాకులు ధరించిన కాపలాదార్లు ఉంటారు. ఆ చర్చిని ఖైదీలే నిర్వహిస్తున్నారు. ఫాదర్‌కూడా ఓ ఖైదీనే.




అంతా తెల్లవారుజామునే లేచి బైబిల్‌ని పఠిస్తారు. అందరూ గ్రూపులుగా విడిపోయి బైబిల్ చదువుతారు. తర్వాత దాని గురించి చర్చించుకుంటారు. సాధ్యమైనంత వరకు బైబిల్‌లో చెప్పిన విధంగా జీవించే ప్రయత్నం చేస్తారు. పద్దెనిమిదేళ్ల జైలు శిక్షను అనుభవిస్తున్న ఓ ఖైదీ గత పదిహేనేళ్లుగా లిబెర్టాలో నివసిస్తున్నాడు. మూడేళ్ల తర్వాత అతను బయటకు వెళ్లాక ఏదైనా చర్చికి ఫాదర్‌గా పనిచేయాలనుకుంటున్నాడు.



కరడుగట్టిన నేరస్థులు కూడా కొంత కాలం ఈ చర్చి విభాగంలో నివసిస్తే వారిలో మార్పు వస్తుంటుంది. వివిధ క్రైస్తవ దేశాలనుంచి అనేకమంది ఉన్నత ప్రభుత్వోద్యోగులు, మతాధికారులు లిబెర్టాకు వచ్చి తమ దేశంలో కూడా ఇలాంటి కార్యక్రమం చేపట్టడానికి అధ్యయనం చేస్తున్నారు. అమెరికన్ బైబిల్ సొసైటీ ఇటీవల ఇలాంటి అధ్యయనాన్ని లిబెర్టాలో నిర్వహించింది.

మనిషిని నిజంగా ఖైదు చేసేది గోడలు కాక అతడి హృదయంలోని పాపమేనన్న బోర్డు ఈ చర్చి ముఖద్వారంవద్ద కనిపిస్తుంది. లిబెర్టానుంచి ఇంతదాకా ఒక్క ఖైదీకూడా పారిపోయే ప్రయత్నం చేయకపోవడం విశేషం.

పరాగ్వే అధ్యక్షుడు తరచూ ఈ చర్చికి వచ్చి ఖైదీలతో కలిసి ప్రార్థన చేస్తుంటాడు. కరడుగట్టిన ఖైదీలు సైతం ఇక్కడికి వచ్చాక సున్నిత హృదయులుగా మారడం గమనార్హం.



తాగుడుకే పోస్తాడు. "ఏం చేయాలి బిడ్డా, వొచ్చిన పైసలు దేనికీ చాలవు- అందుకే తాగి హాయిగానిద్రబోతా.." అంటాడు తండ్రి.

లక్ష్మికి ఇక్కడనుండి పట్నం పోవాలని పించింది. వెంటనే తను హాయిగా చదువు కుని, వుద్యోగం చేస్తూ, వీళ్లందర్నీ తనతో తీసుకుపోవొచ్చు. అందరికీ రెండు పూట్లా తిండీ, 'చాయా', కట్టుకోవడానికి మంచి

బట్టలు..

"ఏ పిల్లా, కూర్చునే కునుకుతున్నా వేంది? లేచి బియ్యం రాళ్లేరు, నేపోయి నీల్లు తెస్తా.."

లక్ష్మికి తను కనే కలలనుంచి మేలుకోవాలని లేదు. అయిష్టంగానే లేచింది. దానికి తల్లి వంట రుచించలేదు. రుచీపచీ లేని కూర, నీళ్ళచారు, మసాలా లేని మాంసం కూర- పరమయ్య వంట అలవాటయి ఈ తిండి నోట పెట్టుకోలేకపోయింది. మళ్లా కలల్లోకి వెళ్లిపోయింది- 'మంచి వుద్యోగం చేస్తే మంచి తిండి వుంటుంది..'

గిన్నెలు, కడుగుతున్న తల్లిని చూసి జాలిపడింది. అమ్మగారు చక్కగా నీటుగా వుంటారు. సినిమాలకు, క్లబ్బుకూ వెడతారు. తండ్రి తాగొచ్చి చావగొడితే తన తల్లి ఏడుస్తుంది. తిడుతుంది. పాపం, ఎప్పుడన్నా సినిమా చూసిందో లేదో.. తను వుద్యోగం చేస్తే తల్లికి వారానికొకసారయినా సినిమా చూపాలి, డ్రింకు తాగించాలి..

చెల్లెళ్ల వేపు చూసింది. వాళ్లు 'ముక్కల' కొరకు కొట్లాడుకుంటూ పులుసు జుర్రుకుంటున్నారు- 'ఇయాల బువ్వ బలేగా వుంది' అనుకుంటున్నారు.

పాపయ్య బైటికెప్పుడు పోయాడో చీకటి పడినాక తప్పతాగి వొచ్చాడు.

"ఏందే బువ్వ తింటున్నారా? దుకాణపాయన చేప మంచిగా చేశాడు- బాకీ కొంత తీర్చినా గదా? ఏం లక్ష్మమ్మా, మీ యింటో కూడు బాగుంటదా, ఈడ బావుందా?"

'మీ యిల్లు' అన్న తండ్రి మాటకు వులిక్కిపడి చూసింది.

"అది నా యిల్లా?" అన్నది.

"అవునే, అదే నీ యిల్లు.. ఆడ మంచిగ పనులు చేసుకుంటే, అదే నీ యిల్లవుతది. ఈడేముంది బూడిద?"

"అదేంది నాయనా? నేనెప్పటికీ ఆ యింట్లనే వుండాల్నా? ఈడకెప్పటికీ వొచ్చేదిలేదా?"

తండ్రి పరాయిపిల్ల కింద జమకట్టి మాట్లాడుతుంటే దాని గుండె బరువెక్కింది. ఎప్పుడు పరమయ్య వొస్తాడా, ఎప్పుడు వెళ్లిపోదామా అనిపిస్తోంది ఒక్కోసారి. ఈరోజు ఇంకా గురువారమే. మరో రెండ్రోజులు ఆగాలి. దానికి తన బతుకు అర్థం కావడం లేదు.. తనకు ఇల్లూ, తన మనుష్యులూ లేరా? 'అక్కడ చావు దెబ్బలు తింటూ పడివుండాలా? ఎంతకాలం?' అనిపిస్తోంది మరోసారి. దాని పసిమనస్సుకు రకరకాల ఆలోచనలు.

"అక్కా, మమ్మల్ని కూడా నీతో తీసుకుపోయే, ఆడ బస్సులూ, కార్లు, మేడలూ- అన్నీ చూడాల, సినిమా చూస్తాం" అంటున్నారు చెల్లెల్లు.

"మీరేడకు పోయేది? నాలుగేళ్లాగితే మీ అయ్య మిమ్మల్ని కూడా యాడనో పనికి పెడతాడు. అప్పటిదాకా ఆగండి" అంటున్నది తల్లి.

లక్ష్మి తల్లిని భయంగా చూసి తిండి వొదిలేసి, లేచింది...

## 9

పట్నం వొచ్చినప్పటినుంచీ లక్ష్మికి దిగులుగా వుంటున్నది. ఇంకా ఎప్పటికీ తను తల్లిదండ్రులతో, చెల్లెళ్లతో కలిసి వుండడం జరగదని దానికి అర్థమయింది. ఈ యిల్లు కాకపోతే మరో యిల్లు, మరో మనుష్యులు.. మళ్లా పాత కలలు, ఎప్పుడూ వొచ్చే కలలు- తనూ వుద్యోగం చేయడం, తనవాళ్లను తన దగ్గరే వుంచుకుని, చెల్లెళ్లకు చదువు చెప్పించడం...

వాళ్లను ఏ యింట్లోనూ పనికి పెట్టగూడదు.. 'గవర్మెంటు ఆస్టల్లు' వున్నాయన్నాడు మోహన్ సార్! సార్ పిలిచినప్పుడే తను పోతే ఎంత బాగుండేది! మళ్లా కలుస్తాడా?

దానికి గుర్తుకొచ్చి లేచి బ్యాగు వెదికింది. మోహన్ యిచ్చిన కార్డు దొరికింది.

రెండు రోజులుగా లక్ష్మికి ఒక అనుమానం కలుగుతున్నది, మరో యింటికి తనను పంపే ఏర్పాటేదో జరుగుతున్నట్లు! ఒకరోజు విన్నది.

"..ఆ తాగుబోతు వెధవను పిలిపించి, పంపేయడం మంచిదనిపిస్తోంది. ఇది పెద్ద అవుతున్నది. కొన్నాళ్లకు మాటకు ఎదురు చెపుతుంది.."

"ఇలా చేద్దాం- మా ఇంజనీరు సూర్యనారాయణ మొన్న మనింటికి వొచ్చినప్పుడు దీన్ని చూసి, తనకూ ఇలాటి పనిపిల్ల దొరికితే బాగుణ్ణని అన్నాడు. వాళ్లావిడకు ముగ్గురు పిల్లలతో చేసుకోవడం కష్టంగా వుందట.. పాపయ్యకు కబురుచేసి మాట్లాడదాం, ఏమంటావు?" అన్నాడు కృష్ణారెడ్డి.

"ఇంకా ఆలోచిస్తారేం? వాడెవడో జర్నలిస్టట, మనింటిముందే తచ్చాడుతున్నాడు- దీన్ని త్వరగా వొదిలించుకుంటేనే మనకు మంచిది" అన్నది భార్య.

లక్ష్మికి భయం వేసింది. 'మరో యింటికా? ఆనాడే మోహన్ సార్‌తో వెళ్లిపోతే బాగుండేది, ఎక్కడో స్కూల్లో చదివించేవాడు!' మరొక విషయం గుర్తుకొచ్చింది.

'ఆ సార్ అమ్మగారికి కనబడ్డాడంటే తనకూ కనబడవొచ్చు-' ఆశ కలిగింది.

రెండు రోజుల తర్వాత నిజంగానే అవకాశం దొరికింది. 'చిన్నమ్మ'గారు ఏవో పుస్తకాలు యిచ్చి, పక్క వీధిలో వున్న తన స్నేహితురాలికి ఇచ్చిరమ్మని పంపింది.

లక్ష్మి బయటకువొచ్చి, వీధి చివరి పబ్లిక్ ఫోనువద్ద నిలబడింది. మాట్లాడి బయటకువొస్తున్న పెద్ద మనిషి దాన్ని చూసి ఆగాడు. అది కార్డు చేతికి యిచ్చింది. ఆయన డయల్ చేసి ఇచ్చాడు.

"హలో, ఎవరు?"

"నేను లక్ష్మిని సార్.."

"నువ్వా, బాగున్నావా లక్ష్మీ? ఏమిటిలా ఫోను చేశావు? ఏం కావాలి?"

"సార్, నన్ను ఎక్కడో హాస్టల్లో జేరిపిస్తానన్నారు సార్? నేను చదువుకోవాలి సార్.. నన్ను మరెవరికాడకో పంపుతారంటున్నారు సార్"

"అలాగా, సరే, భయపడకు. నేను వచ్చి మాట్లాడతా- అప్పుడు మాత్రం భయపడకుండా నాతో బయలుదేరు, సరేనా?"

"అలాగే సార్"

బైటకువొచ్చి పైసలు ఇస్తున్న లక్ష్మిని ఫోన్‌షాపాయన విచిత్రంగా చూశాడు. "ఏం పిల్లా, ఏడుస్తున్నావు? ఏమైంది?" అడిగాడు. లక్ష్మి కళ్లు తుడుచుకుంటూ ఇంటికి బయలుదేరింది. పుస్తకాలు యిచ్చేసి ఇంటికి వొచ్చి మొక్కలకు నీళ్లు పెట్టసాగింది.

"ఏయ్ మొద్దూ, ఎన్నిసార్లు పిలవాలి? పుస్తకం యిచ్చానని చెప్పొద్దా?" ఒక్క మొట్టు మొట్టింది మాధవి.

తల తడుముకుంటూ, "అనవసరంగా కొట్టొద్దమ్మా" అన్నది లక్ష్మి. మాధవి నిర్ఘాంతపోయింది.

"ఏమే పొగరెక్కిందా? ఎదురుతిరిగి మాట్లాడుతున్నావు? ఏమైంది నీకు?" జుట్టు పట్టుకోబోయింది.

తప్పించుకుని, "వూరికే ఎందుకు కొడతారు? నేనూరుకోను" అన్నది గట్టిగా. మాధవికి నోటమాట రాలేదు. నోరు తెరుచుకుని చూసి, "ఇవాళ నీకు మూడింది, మమ్మీ రానీ.." లోపలకు వెళ్లిపోయింది

తిట్టుకుంటూ.

లక్ష్మి అలాగే నిలబడింది. తను నోరు మూసుకున్నంత వరకూ దెబ్బలు పడుతూనే వున్నాయి. ఈనాడు తను కొంచెం ఎదురుతిరిగేసరికి మాధవి మాట్లాడకుండా వెళ్లిపోయింది. మళ్లా దానికి భయంవేసింది- 'పెద్దమ్మగారు' ఎట్లా కొడుతుందో? ఆరోజులాగా.. తను పిచ్చిపని చేసింది. అట్లా ఎందుకు మాట్లాడాలి? ఏమయినా సరే, తన తప్పులేకుండా తన్నులు తినగూడదు..

అనుకున్నట్లుగా, సుమతివొచ్చాక మాధవి కోపంగా తన మీద చెప్పింది. "..ఎదిరించి మాట్లాడింది మమ్మీ. కొడితే వూరుకునేది లేదని బెదిరించింది. బాగా పొగరెక్కింది మమ్మీ. అసలు ఇదీ, ఆ శోభా కలిసే దొంగతనం చేసివుంటారు- దీనంతటికీ అక్కే కారణం, దీన్ని నెత్తినెక్కించుకున్నది"

"ఏమే, ఏమైంది? దెయ్యం పట్టిందా? చిన్నపాపను ఎదిరిస్తావా? " జుట్టు పట్టుకుని గుంజింది సుమతి.

"లేదమ్మగారు, మాధవమ్మే వూరికే కొట్టబోయిందమ్మా" ఏడుస్తూ జవాబు చెప్పింది.

"నోరుముయ్- రెండురోజులు డొక్కమాడిస్తే సరి, నీ రోగం.."

"నన్నవసరంగా ఎందుకు కొట్టాలి? అట్లాగయితే మావూరు పోతా, ఈడ వుండను"

తల్లీకూతుళ్లు కొయ్యబారిపోయారు.

"చూశావా మమ్మీ, నేనేం చెప్పాను? దానికి నాలుగు తగిలించు..." అంటూ జుట్టు పట్టుకుని వీపుమీద బాదింది. సరిగా అదే సమయానికి బెల్లు మోగింది. మాధవి లక్ష్మినొదిలి వెళ్లి తలుపు తెరిచింది. సుమతి మాటలేకుండా కూర్చుండిపోయింది.

మోహన్ ఒక పోలీసు కానిస్టేబుల్,

## కొత్తగాలి...

నీకూ నాకూ
పగలుకీ రాత్రికీ మధ్య
ఏముందో...అదే
సృష్టి రహస్యం

*-బి. గీతిక, తాడేపల్లిగూడెం*

మరో పెద్దమనిషి లోపల అడుగు పెడుతూనే ఏడుస్తున్న లక్ష్మిని చూశారు. మాధవి లక్ష్మిని త్వరగా లోపలకు తీసుకుపోయింది. మొహం కడిగించి తలదువ్వి, ఎవరు పిలిచినా హాలులోకి రావద్దని గట్టిగా బెదిరించి, కిచెన్‌లోకి పంపి, తను హాలులోకి వచ్చింది.

"..పిలుస్తారా? "

"ఏమిటండీ ఇదంతా? మీరిలా వొచ్చిపోతూ వుంటే మాకు న్యూసెన్స్‌గా వుంటుంది. క్రితంసారి ఆ పిల్లనే అడిగారు గదా? ఇంకా ఎందుకీ ఎన్‌క్వయిరీలు..? "

వొచ్చిన పెద్దాయన మాట్లాడాడు.

"మాకు కంప్లెయింటు వొచ్చింది. మీరొక చిన్నపిల్లను ఇంట్లో పెట్టుకుని పనులు చేయించుకుంటున్నారని. అది చట్టవిరుద్ధం- అందుకే ఆ పిల్లనిలా పిలవమంటున్నాం.. నేను ప్రభుత్వోద్యోగిని, మా డ్యూటీకి అడ్డు రావొద్దు."

ఆవిడ కూతురుతో లక్ష్మిని తీసుకు రమ్మని చెప్పింది. ".. మీరు మాటిమాటికీ ఇలా వొచ్చి డిస్టర్బ్ చేయడం బాగా లేదు. ఇంట్లో మగవాళ్లున్నప్పుడు వొచ్చి మాట్లాడాలి.. కావాలంటే దానిని దాని తల్లిదండ్రుల దగ్గరకు మీరే చేర్చండి, మాకేం అభ్యంతరం లేదు."

"మేం చేసేది మేం ఎలాగో చేస్తాం- నేరం రుజువయితే కేసు కూడా బుక్

చేస్తాం"

లోపలనుంచి లక్ష్మి అడుగులో అడుగు వేసుకుంటూ వొచ్చి నిలబడింది.

"..మీరే అడగండి. క్రిందటి నెల కూడా దాని వూరికి వెళ్లి నాలుగు రోజులుండి వొచ్చింది. ధాన్నే అడగండి- దాన్ని పనిమనిషిగా చూస్తున్నామేమో! మా యింట్లో మనిషిలానే.."

ఆవిడను ఆగమని, "ఏం పాపా, నీ పేరు లక్ష్మి కదూ! ఈ యింట్లో ఎందుకుంటున్నావు? ఇంట్లో ఏమేం పనులు చేస్తూ వుంటావు? " అడిగాడు పెద్దాయన.

"మా అమ్మోళ్లు ఈడ వుంచారు- ఈడ పనులు చేస్తా."

"అంటే, గిన్నెలు కడగడం, బట్టలు తకడం- ఇలాంటి పనులా? "

"అన్ని పనులూ సార్"

సుమతి కుంగి పోయి కూర్చున్నది.

"ఇక్కడ బాగుందా నీకు? అమ్మగారు ఎప్పుడయినా దెబ్బలు వేస్తారా? "

అది చెప్పేదంతా రాసుకున్నాడాయన. "ఈ పిల్లను మాతో తీసుకువెడుతున్నాము. తల్లిదండ్రుల అడ్రసు ఇవ్వండి. మీకు కూడా 'సమన్స్' వొస్తాయి.. పద పాపా, బట్టలు సర్దుకో.."

సుమతి చివరి ప్రయత్నం చేసింది. "కేసు ఎందుకు? తల్లిదండ్రులే దింపి వెళ్లారు- మేమేమీ బలవంతాన కట్టి పడేయలేదు. దానికి కావలసిన వన్నీ చూస్తున్నాం- దాన్ని తీసుకుపోయి హాస్టల్లో పెడతారో, వూరికి పంపుతారో మీ యిష్టం. అంతేగాని, మా మీద కేసులెందుకండీ? " అన్నది బలహీనంగా.

లక్ష్మి బట్టలు చిన్నబ్యాగులో పెట్టుకుని వారితో బయలుదేరింది. దాని కొకటే బాధ- శ్రావ్యను చూడకుండా వెళ్లవలసి వొస్తుందని. శ్రావ్య వూరికి వెళ్లింది...

అరగంట తర్వాత జకీర్‌ని మోహన్ కలిసాడు.

"చూడు జకీర్, నాకో సాయం చేసిపెట్టాలి"

"తప్పుతుందా? " నవ్వాడు జకీర్.

"లక్ష్మి.. తెలుసుకదా!" అన్నాడు మోహన్ లక్ష్మిని చూపిస్తూ. తెలుసన్నట్లు తలాడించాడు జకీర్.

"అమ్మకు బాగోలేదని కబురొచ్చింది? "

"ఏమైంది అమ్మకి.." జకీర్‌కి కూడా తెలుసు మోహన్ కన్నతల్లి.

"ఏముంది? వృద్ధాప్యం. ఇపుడో రేపో అన్నట్లుందిట. నేను ఊరెళ్లాలి. అందుకే ఈ పాప బాధ్యత నీకప్పగిస్తున్నాను. ఓ మంచి హాస్టల్ చూసి చేర్పిస్తావు కదూ!" అడిగాడు మోహన్.

"లక్ష్మి విషయం దిగులుపడక ఊరెళ్లు. అమ్మ ఆరోగ్యం జాగ్రత్త సుమా! ఇక్కడి విషయాలు నేనెప్పటికపుడు నీకు తెలియపరుస్తాను" అంటూ భరోసా ఇచ్చాడు జకీర్.

లక్ష్మి సమస్య ఒక కొలిక్కి వచ్చిందనే సంతృప్తితో మోహన్ ఊరికి బయల్దేరాడు.

★ ★ ★

హాస్టల్ జీవితం లక్ష్మికి కొత్తగా వున్నది. వార్డెనమ్మకు నవ్వడం చేతకాదు. పిల్లల్ని బూతులు తిట్టకుండా పిలవదు. ఆవిడ దృష్టిలో హాస్టల్లో వున్న పిల్లలంతా బికారులు, దొంగలు. ఎవరో కనిపడేస్తే ఇక్కడ తెగతిని బలుస్తున్నారు ముండలు! వీళ్లకు చదువులూ, బట్టలూ, తిండీ- శుద్ధ దండగ.

తిండి పెట్టే సమయంలో ఆవిడ- నాగరత్నమ్మ- అజమాయిషీ చేస్తూ వుంటుంది. పులిని చూస్తూ మేకలు తినలేవు!.. ఏది పెడితే అది మాట్లాడకుండా, మారు అడగకుండా తినాల్సిందే..

లక్ష్మికి మొదట్లో ఆ వుడికీ వుడకని రాళ్లఅన్నం, నీళ్లచారు, చారుకంటే కొంచెం





చిక్కగా వుండే పప్పు సహించక వొదిలేసేది. ఎవరూ చూడకుండా దొడ్లో పారేసేది. అది ఓనాడు నాగరత్నమ్మ కంటపడి గొడ్డును బాదినట్లు బాదింది. "ముండా తిండి దొరక్క చస్తుంటే పారేస్తావు? పెద్ద బంగాళా నుంచి వొచ్చావాయేమే? ఈసారి వొక్క మెతుకు పారేసినట్లు తెలిసిందా.. వొంటినిండా వాతలు పెడతా.."

ఆ రోజు నుంచీ ఏ పాచిపట్టిన కూరలూ, అన్నం పెట్టినా మారు మాట్లాడకుండా తిని ఆకలి తీర్చుకోవడం నేర్చుకున్నది. అది మరో విషయం కూడా తెలుసుకున్నది. తను వొదిలేస్తే, ఎగబడి తినడానికి మిగతా పిల్లలంతా ముందుకొస్తారని!

రాత్రి మిగిలిన అన్నమే పొద్దున్న పులిహోర, వొండిన కూరలు మిగిలితే ఎన్ని రోజులయినా పారెయ్యకుండా పెట్టడం- పాచికంపు కొట్టే తిండి బలవంతాన తినడం..

లక్ష్మి కంటే కూడా చిన్నపిల్లలు అక్కడున్నారు. తల్లిదండ్రులెవరో తెలీని వాళ్లు, చెత్తకుండీల్లో దొరికినవాళ్లూ.. ఆ పిల్లలకు ఎవరూ లేరు, నాగరత్నమ్మ తప్ప. వాళ్లు ఆవిడ దయాదాక్షిణ్యాలమీద బ్రతకవలసిందే! వాళ్లు ఈ తిండే గబగబా ఆబగా తింటూ వుంటే లక్ష్మికి జాలి వేసింది. నాగరత్నమ్మకు చిన్నపిల్లలనే కనికరం లేనే లేదు. చిన్నప్పటి నుంచీ భయభక్తుల్లో పెంచాలని ఆవిడ వుద్దేశం. అందుకే వాళ్లెంత చిన్న తప్పు చేసినా క్రూరంగా దండించేది..

ఇక మురికి కూపాల్లాంటి గదులూ,

గచ్చు పగిలిపోయి, నేలలోంచి జెర్రులూ, బొద్దింకలూ రాత్రింబవళ్లూ తిరగడం, చిన్న గదుల్లో పది పన్నెండుమంది పడుకుంటారు. ఒకటే పాయిఖానా డెబ్బయిమంది పిల్లలకు.. స్నానాలు పంపు దగ్గరే.. ఎవరి బట్టలు వారు వుతుక్కుని ఆరేసుకోవాలి. ఎంత చిన్నపిల్లలయినా సరే!

లక్ష్మికి ఇదంతా ఒక కలలాగా వుంది. దానికి తల్లిదండ్రుల మీద కృతజ్ఞతాభావం కలిగింది. వాళ్లు ఎంతో మంచివాళ్లు, మంచి మంచి యిళ్లల్లో పనులకు పెట్టారు, మంచి తిండి, బట్టలు, చాయి దొరికేచోట. ఈ బ్రతుకుతో పోలిస్తే అదంతా స్వర్గంలా తోచింది. వాళ్లు దెబ్బలు కొట్టినా 'వార్డెనమ్మ' లాంటి దెబ్బలు కాదు. ఈవిడ కొట్టే దెబ్బలు జంతువుల్ని కొట్టినా భరించలేవు.

ఎప్పుడయినా పెంపుడుకుక్కల్ని షికారుకు తీసుకుపోయినట్లు, ఈ పిల్లల్ని కూడా ఏ పార్కుకో, ఎగ్జిబిషన్‌కో తీసుకుపోతారు..

లక్ష్మి రోజూ తనని తానే తిట్టుకోవడం- హాయిగా అక్కడే వుండక ఇక్కడికి ఎందుకొచ్చినట్లు? తను ఎప్పటికీ ఇక్కడే వుండాలేమోననే ఆలోచన కలిగినరోజు ఆ బెంగతో దానికి నిద్రపట్టదు..

ఎప్పుడన్నా ఎవరో పైవాళ్లు తనిఖీకి వొస్తారు. "తిండి బాగుందా, 'వార్డెనమ్మ' ప్రేమగా చూస్తుందా, మంచి బట్టలిస్తున్నారా? " ఇలాంటి ప్రశ్నలు అడుగుతారు. వాటికి ఏ జవాబులివ్వాలో ఎవరూ చెప్పకపోయినా ఆ పిల్లలకు తెలుసు!

తమను 'వార్డెనమ్మ' బాగా చూసుకుంటుందనీ, రోజూ కూరలూ, పాలూ, గుడ్లూ ఇస్తారనీ, వారం వారం డాక్టరు వొచ్చి పరీక్షలు చేస్తాడనీ, చదువు బాగా చెపుతున్నారనీ.. ఎంతో హాయిగా వున్నామనీ ఆ పిల్లలు చెబుతారు.

అదంతా రాసుకున్నాక మంచి హోటలు నుంచి భోజనం వస్తుంది. అది తిని నాగరత్నమ్మను అభినందించి ఆ పెద్దమనుషులు వెళ్లిపోతారు.

వాళ్లకు అంతా నిజం చెప్పాలని లక్ష్మికి అవేశం కలిగింది. కాని అలా చేస్తే ఏం జరుగుతుందో దానికి తెలియకపోలేదు.

ఒకనాడు సరస్వతి అనేపిల్ల- అప్పటికి నాలుగురోజులుగా జ్వరంతో మూలుగుతున్నది- పెద్ద మనుష్యుల ముందుకు వొచ్చి ఏడుస్తూ జ్వరంగా వున్నా పట్టించుకోవడం లేదనీ, మందు ఇవ్వడంలేదనీ చెప్పింది.

వొచ్చిన వారిలో ఒక పెద్దమనిషి, ఆ పిల్లను పరీక్షగా చూసి, "ఏం పిల్లా, నీకిక్కడ జలుబు చేసినా డాక్టర్లు కావాలా? ఏ దిక్కూలేని వాళ్లను తెచ్చి అన్ని సౌకర్యాలూ ఇస్తుంటే కోరికలెక్కువయ్యాయి. రెండు రోజులు తిండి పెట్టకండి, అన్ని రోగాలూ తగ్గుతాయి" అన్నాడు నాగరత్నమ్మతో.

ఆవిడ ఆ పిల్లవైపు గుడ్లురిమి చూస్తూ, "నిజమే సార్, కొన్ని రోగాలు తిండి ఎక్కువై వొస్తయి..." అన్నది.

పెద్దలంతా భోజనాలు చేసి వెళ్లిపోయాక ఆవిడ రాక్షసాకారం దాల్చి "ఏమే, నీకు డాక్టర్లు కావాలీ? పెద్దసార్లకు చెబుతావు? " అంటూ జుట్టు పట్టుకుని నేలకేసి కొట్టింది. దాని వొళ్లు హూనంచేసి రొప్పుతూ, "సోమయ్యా, ఈ ముండను గదిలో పడెయ్యి- రెండుపూటలు తిండి పెట్టకపోతే సరి- బాగా తినమరిగారు.." అంటూ గదిలోకి పోయింది.

పిల్లలంతా తిండి తినేసి పడుకున్నారు. లక్ష్మి మెల్లగా లేచి తను దాచిన బ్రెడ్ రహస్యంగా సరస్వతిని పిలిచి కిటికీలోనుంచి అందించింది. ఆ పిల్లకు జ్వరంతో మొహం కందగడ్డలా వుంది. వొణుకుతూ "లక్ష్మి.. వొళ్లంతా నెప్పులు- నేను చచ్చిపోతానేమో!" అంటూ ఏడుస్తు

న్నది.

లక్ష్మికి వార్డెనమ్మను చంపాలన్నంత కోపం వచ్చింది...

ఒక రాత్రివేళ లక్ష్మికి మెలకువ వచ్చి వెళ్లి కిటికీ గుండా చూసింది. సరస్వతి కదలకుండా, పిలిచినా పలకకుండా మెల్లగా మూలుగుతున్నది. దానికి భయంవేసి వాచ్‌మెన్‌ను నిద్ర లేపింది. తప్పతాగి పడుకున్న సోమయ్య బూతులు తిడుతూ లేచాడు. "ఏయి పోరీ, నిన్ను ఎవరు దాని కాడకు వెళ్లమని చెప్పారు? తన్నులు కావాలా, పోయి పడుకో" అని తిట్టాడు. దానికి రాత్రంతా నిద్రపట్టలేదు, అప్పుడప్పుడు వెళ్లి కిటికీగుండా సరస్వతిని చూస్తూనే వున్నది. తెల్లవారుజామున సరస్వతి ప్రశాంతంగా పడుకుని వుండడం చూసి 'హమ్మయ్య జ్వరం తగ్గినట్లుంది' అనుకుని తనూ వెళ్లి పడుకుంది.

తెల్లవారాక లేచి చూస్తే సరస్వతి మొహంపైన చీమలు పాకడం గమనించి భయపడిపోయింది. సోమయ్య వొచ్చి తలుపుతీసి చూసి, పిల్లల్ని అక్కణ్ణుంచి పొమ్మని తిట్టాడు. తను ఆఫీసు గదిలోనికి పరుగెత్తి ఫోను చేశాడు.

నాగరత్నమ్మ అరగంటలో కంగారుపడుతూ వొచ్చింది. సరస్వతిని చూసి, బైటకు వొచ్చి గది తలుపు తాళం వేసింది. సోమయ్యను ఆఫీసు గదిలోనికి పిలిచి మాట్లాడింది. పిల్లలకు ఏదో జరిగిందని చూచాయగా తెలిసిందిగాని అర్థం కాలేదు పూర్తిగా...

లక్ష్మి కిటికీ గుండా సరస్వతిని చూసింది. దాని ఒంటినిండా దుప్పటి కప్పి వున్నది. సోమయ్య వొచ్చి తాళం వేసి, దాన్ని భుజంపైన వేసుకుని ఆఫీసు గదిలోకి తీసుకువెళ్లి, అంతకుముందే వుంచిన మంచంపైన పడుకో బెట్టాడు.

లక్ష్మికి పూర్తిగా అర్థమయింది. దానికి కాళ్లూ చేతులూ వొణుకుతున్నాయి.

**కొత్తగాలి...**

**కారుకాని చిన్నకారు**
**కారులేని సన్నకారు**
**కాలమంతా**
**నీరుగారు**

-సి.ఎస్.వి. రెడ్డి, చింతలగూడెం

డాక్టర్ వొచ్చి సరస్వతిని పరీక్షచేశాడు. గదిముందు గమిగూడిన పిల్లలందరినీ సోమయ్య తిట్టి పంపేశాడు. లక్ష్మి మాత్రం కదల్లేదు.

డాక్టరు వెళ్లాక, నాగరత్నం పిల్లల్ని పిలిచింది. "పాపం, సరస్వతికి పొద్దునకు జ్వరం బాగా ఎక్కువైంది. డాక్టర్ని పిలిపించాను కాని లాభం లేకపోయింది. చచ్చిపోయింది. ఈరోజు టీచర్ రాదు. అందరూ లోపలకు వెళ్లి చదువుకోండి.."

ఆవిడ గదిలోకి పోతూ లక్ష్మిని పిలిచింది. "పాపం జ్వరం ఎక్కువై చచ్చిపోయింది. మందులిచ్చినా లాభం లేకపోయింది. పైవాళ్లెవరొచ్చినా ఇలాగే చెప్పు.."

"మందివ్వలేదమ్మగారూ" అంది లక్ష్మి మెల్లగా.

"ఏవిటే? ఏం వాగుతున్నావు? పొద్దునా, రాత్రీ నేనే యిచ్చా- నువ్వెక్కడ చూశావు?"

"లేదు. రాత్రి జ్వరం ఎక్కువయితే సోమయ్య సారుని పిలిస్తే రాలేదు. పొద్దున్నే సారు చూశాడు- అప్పటికే చచ్చిపోయింది"

"నోర్ముయ్, ఎక్కువ వాగావంటే డొక్క చీలుస్తా ముండా- ఇంక పో"

లక్ష్మి మొండిగా, "దానికి మందివ్వలేదు. అందుకే చచ్చిపోయింది" అని



వాదించింది. ఆవిడ దాని ధైర్యానికి ఆశ్చర్యపడింది.

"ఏవిటే ఎదిరించి మాట్లాడుతున్నావు? నాకు కోపమొస్తే సుభద్రమ్మ హాస్టల్లో పడేస్తా- ఆవిడ కాలిన గరిటెల్తో వాతలు పెడుతుంది, చచ్చివూరుకుంటావు! మీరంతా 'గవర్మెంటు' తేర తిండి తిని బలుస్తున్నారే! మళ్లా చెబుతున్నా- మందులన్నీ యిచ్చాం, దానికి జ్వరం ఎక్కువై చచ్చింది- నోటికొచ్చినట్లు నువ్విలాగే వాగావంటే దానితోపాటే నిన్నూ పాతేస్తా... ఫో"

లక్ష్మికి భయం పూర్తిగా పోయింది. 'ఏమయినా సరే, ఎవరొచ్చినా జరిగింది జరిగినట్లు చెప్పాల్సిందే...' నిర్ణయించుకున్నది.

మరో గంటలో 'పైవాళ్లు' ముగ్గురు రానే వొచ్చారు. వొస్తూనే, బల్లమీద శవాన్ని మొగంమీద గుడ్డ తొలగించి చూసి, వెళ్లి కుర్చీల్లో కూర్చున్నారు. లక్ష్మి లోపలకు వెళ్లబోయేలోగా సోమయ్య ఆపుచేశాడు. "ఎక్కడికి పోతావు? ఎవరూ రాగూడదు- అంతా గదుల్లోకి పొండి"

లక్ష్మి అక్కడినుండే గట్టిగా గొంతు చించుకుని అరిచింది. "సార్, సరస్వతికి మూడురోజుల నుండి జ్వరం వున్నా



మందులివ్వలేదు. డాక్టరుకూ చూపలేదు సార్- అందుకే చచ్చిపోయింది"

సోమయ్య నిర్ఘాంతపోయి ఏంచేయాలో తెలియక అలాగే నిలబడ్డాడు. లోపల నుంచి పెద్దలంతా బయటకు వొచ్చారు.

"నేను నిజం చెపుతున్నా సార్.. దానికి మందులివ్వలేదు. రాత్రే నేను చూశాను- సోమయ్య సార్‌కు కూడా తెలుసు.." గట్టిగా అరుస్తున్నది పిచ్చి పట్టినట్టు.

"నీ పేరేమిటి? నువ్వు లోపలకు రా" అని ఒకాయన లోనికి తీసుకువెళ్లాడు

"ఇప్పుడు చెప్పు నీకు తెలిసింది? " మూడు రోజులుగా జ్వరం వుందనీ, అప్పుడొచ్చిన 'సార్ల'తో కూడా చెప్పాననీ లక్ష్మి చెప్పింది. ఈ రోజు వొచ్చిన వారిలో ఆనాటి పెద్ద మనుషులు కూడా వున్నారని అది గమనించలేదు. రాత్రి దాని మూలుగు విని సోమయ్యను లేపినా, ఆయన నిద్ర లేవకపోవడం, వుదయం సరస్వతి మొహం నిండా చీమలు పట్టి ఉండడం, అప్పుడే సోమయ్య వొచ్చాడనీ- అంతా చెప్పింది.

వొచ్చినవాళ్లు వొకరినొకరు చూసుకున్నారు. "నీ పేరేమిటి పాపా? " అని నవ్వుతూ అడిగాడొకాయన. "ఇదిగో చూడూ, ఆ పిల్లకు రాత్రే మందులిచ్చారు

డాక్టరుగారు. అప్పుడు నువ్వు నిద్రపోయి వుంటావు"

"లేదు సార్, నేను నిద్ర పోనేలేదు. డాక్టరుగారు రాలేదు. వొస్తే దానిని గది లోంచి బైటికి ఎందుకు తీసుకురాలేదు సారు? " అని ప్రశ్నించింది.

దాని వయస్సుకు అంత తెలివిగా మాట్లాడడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. నాగరత్నమ్మ మాత్రం కోపంతో రగిలిపోతూ, "ఏమిటి సార్, దానికి నచ్చ చెబుతున్నారు- బికారి ముండలు- వీళ్లను ప్రజల సొమ్ముతో అనవసరంగా మేపుతున్నాం. మన తిండి తిని, మనకే ఎదురు చెబుతున్నది చూడండి- బద్మాష్" అంటూ లాగి చెంపమీద అక్కడున్న వాళ్లముందే కొట్టింది. "సోమయ్యా, దీన్ని తీసుకుపోయి ఆ గదిలో పడెయ్యి- దీని సంగతి తర్వాత చూస్తా..."

"నేను పోను. నేచెపుతున్నది నిజమే సార్. దానికి మందులివ్వనేలేదు సార్" అని అరుస్తున్న లక్ష్మిని బరబరా ఈడ్చుకు పోయాడు సోమయ్య.

10



రెండు రోజులుగా తిండి లేకుండా పడి ఉన్న లక్ష్మికి ఒక ఆలోచన వచ్చింది. 'ఇక్కడ నుండి పారిపోవాలి' ఎక్కడకు పోవాలో దానికి తెలియదు. ఇంతకు ముందు పనిచేసిన యిళ్లల్లో వాళ్లకి తన పని అవసరం కాబట్టి ఎంత కొట్టినా, ఇన్ని బాధలుండేవి కావు. ఇక్కడి వాళ్లకు తనతో ఏ అవసరమూ లేదు. తనకు వూరికేనే తిండి పెడుతున్నారు. బట్టలిస్తున్నారు- తనతో బాటు ఏ దిక్కూ మొక్కూ లేని పిల్లలు, అడుక్కు తినేవాళ్ళూ, దొంగతనాలు చేసిన వాళ్లూ- వీరందరినీ వుంచుకుని తిండి పెట్టి, చదువు చెప్పించడం- ఇదంతా వార్డెనమ్మ గారు ఎందుకు చేస్తున్నారో దాని బుర్రకు అందదు. ఆవిడ కూడా ఆ పిల్లలమీద సర్వాధికారాలూ తన కున్నాయనే నమ్ముతుంది. వాళ్లను చావ గొట్టినా, సరిగా తిండి పెట్టకపోయినా, మందుల్లేక వాళ్లు చచ్చినా- తనను అడిగే వారు లేరని ఆవిడకు తెలుసు-

ఏ సందర్భం వొచ్చినా ఆవిడ అంటూ వుంటుంది- "మీలాటి దిక్కులేని ముండలకు గవర్నమెంటు ఇంత ఖర్చు పెడుతున్నది, మీ వల్ల ఏ పనీ కాదు, ఏ వుపయోగం లేదు- అది గుర్తు పెట్టుకుని ఏది పెడితే అది తిని నోరు మూసుకుని పడుండండి. బట్టలు లేవు, చలికి దుప్పట్లు లేవు, స్నానానికి సబ్బు లేదు- అని వాగారా కాళ్లు విరగ్గొడతా, నోర్మూసుకు పడి వుండండి-"

లక్ష్మికి ఆవిడ చెప్పేది నిజంలాగానే కనబడుతున్నది. 'గవర్నమెంటు దయ తలచి, తమలాంటి పిల్లలకు ఏదో ఇంత తిండి పడేస్తున్నది. పైగా ఏ పనీ చేయించుకోవడం లేదు. అయినా కూడా లక్ష్మికి ఈ జీవితం బాగుండలేదు. ఆ గాలి, వెలుతురూ లేని మురికి కూపాల్లాంటి గదులూ, కంపుకొట్టే చిరుగుల పక్కబట్టలూ, వాసన కొట్టే చద్దన్నం, నీళ్ల పులుసులో పురుగులూ- వున్న పిల్లలందరికీ వొళ్లంతా చీడ పట్టి ఒకటే దురద. నూనె లేక ఎండుగడ్డి లాంటి జుట్టులో ఒకటే పేలు- ఒళ్ళు గోక్కుంటూ, తల బరుక్కుంటూ నిద్ర లేక ఆ పిల్లలు తమకెందుకీ శిక్ష అని ఎవర్ని

అడగాలో తెలియక అయోమయం అయి పోతున్నారు..

అయిదారు నెలల్లోనే అస్థిపంజరంలా తయారైంది లక్ష్మి. ఇప్పుడు దాని వొంట్లో ఏ పని చెయ్యడానికీ వోపిక లేదు- ఎక్కడ బడితే అక్కడ ఎముకలు వెళ్లుకొస్తు న్నాయ్. ఇప్పుడు నాగరత్నమ్మ కొట్టినా ఏడిచే వోపిక కూడా లేదు. ఇక్కడకు వొచ్చిన కొత్తలో అక్కడి పిల్లల మొహాల్లో కళా కాంతీ లేక, ముసలి కళతో, ఎండిన శరీరాలతో కనబడినప్పుడు దానికి జాలి కలిగింది. ఈరోజు ఆ పిల్లా వారిలాగే తయారైంది. జిర్రబొచ్చులాంటి తలా, మొహంలో ప్రేతకళా, వొళ్లంతా చీడ..

ఒకే టీచరు- తెలుగు పాఠాలూ, చిన్న లెక్కలూ చెబుతుంది. చేతిలో రూళ్ల కర్ర ఆడుతూ వుంటుంది. పిల్లల దృష్టి ఆవిడ మొహం మీద వుండదు, చేతిలోని రూళ్ల కర్ర వేపే. ఏ చిన్న తప్పు చేసినా పచ్చి బూతులు తిట్టడం, పసివేళ్లు తిప్పి కర్రతో బాదడం- ఎవరూ ఏడవడానికి వీల్లేదు. అందరూ తిండి తిని రాత్రి పడుకున్న ప్పుడు ఏడుస్తారు..

ఒకరోజు మోహన్ వచ్చాడు హాస్టల్‌కు. లక్ష్మిని పిలిపించమన్నాడు. ఉతుకుతున్న బట్టలు పక్కన పెట్టి చేతులు తుడుచు కుంటూ వొచ్చింది.

లక్ష్మిని చూసి ఆశ్చర్యపోయాడు. క్రుంగి పోయి, నిర్జీవంగా, నడుం వొంగి, కంకాళం లాంటి పిల్లను చూసి గుండెలు బరువె క్కాయి. చిన్న పిల్లల్ని ఇళ్లలో పనికి పెట్టు కోవడం నేరం, కాని ప్రభుత్వ వసతి గృహాల్లో నరకం చూపడం నేరం కాదు. 'చట్టం తన పని చేసుకుపోతుంది' అంటారు పాలకులు!

"ఏమిటి లక్ష్మి అలా వున్నావు? వొంట్లో బాగా లేదా?" పూర్వం అలా ఎవరైనా అడిగితే దానికి కళ్ల నీళ్లు వొచ్చేవి. ఈ రోజు ఆ ప్రశ్నకూ తనకూ సంబంధం లేద

## కొత్తగాలి...

**దోమల దండకాలు**
**విన్పిస్తున్నాయి**
**దరిలో ధర్మాసుపత్రి**
**ఉంది కాబోలు**

—ఈ. వేమన, శ్రీకాకుళం

న్నట్లు నిర్లిప్తంగా నిలబడింది.

"మాట్లాడవేమే, సార్ అడుగుతుంటే.." గద్దించింది నాగరత్నమ్మ.

"ఒకసారి లక్ష్మిని తీసుకువెడతాను, ఓ గంటలో తిరిగివొస్తాము" అనుమతి అడి గాడు మోహన్.

"పనులు అయ్యాయా? - సరే, పో- ఒక్క గంటలో తిరిగి తీసుకురావాలి- దానికి డబ్బులు ఇవ్వవద్దు."

ఇద్దరూ బయటికొచ్చారు.

"ఇక్కడ ఎలా ఉంది? వార్డెనమ్మ బాగానే చూసుకుంటున్నదా? భోజనం బాగుంటుందా?" అలాంటి ప్రశ్నలు వేస్తు న్నందుకు తనే సిగ్గుపడ్డాడు.

"బాగానే వున్నది సార్.. మా చెల్లీవా ళ్లను చూడాలనుంది.."

మోహన్ ఆలోచిస్తూ, "ఇప్పుడు వీళ్లు పంపరు లక్ష్మి- కావాలంటే వాళ్లనే పిలిపి స్తారు" అన్నాడు.. లక్ష్మి ఏదో అడ గబోయి మానేసింది.

స్కూటర్ ఒక హోటల్ ముందు ఆపి, లోపలకు తీసుకువెళ్లాడు. టిఫినూ, స్వీట్లూ తెప్పించాడు.

"ఇప్పుడు చెప్పు- వార్డెన్ కొడుతూ ఉంటుందా? నీకు ఇక్కడ బాగా లేకపోతే మరో చోటికి పంపటానికి ప్రయత్ని స్తాను.."

లక్ష్మి అమాయకంగా చూసింది.

"అక్కడ వార్డెనమ్మ వుండదా సార్" అడిగింది.

మోహన్ మౌనంగా ఉండిపోయి, "మరో స్వీటు తీసుకో- కడుపునిండా తిను" అన్నాడు.

బయటకు కొచ్చాక పర్సు తీసి డబ్బు ఇవ్వబోయాడు. "వొద్దు సార్, వార్డెనమ్మ తీసుకుంటుంది" ఆ పిల్లకు ఏ సహాయమూ చేయలేని తన అసమర్థతకు తనను నిందించుకున్నాడు.

హాస్టల్ వద్ద లక్ష్మిని దింపి, తన ప్రయాణం కొనసాగించాడు. 'ఇలాంటి పిల్లలకు ఎవరు దిక్కు? తల్లిదండ్రులు గర్భదరిద్రులు. వారి వూరిలోనే పనులు దొరికితే ఈ పిల్లను అక్కడే పనికి పెట్టే వారు. చిన్నపిల్లలను పనికి పెట్టడం నేరం. హాస్టల్లోని పరిస్థితులను ఏ చట్టాలూ బాగు చెయ్యవు. అక్కడ జరిగేవి పెద్దలందరికీ తెలుసు. కాని అక్కడ పిల్లలు సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్నారని ప్రచారం జరుగుతుంది.

తనూ, తనలాంటి వారూ ఈ పిల్లలకు ఒరిగించేదేమిటి? వీళ్ల పనులు చేసే ఇళ్ల లోంచి లాక్కొచ్చి ఈ హాస్టళ్లలో పారేయటం తప్ప! చివరకు ఏం జరుగుతుంది? ఏదో ఒకరోజు ఇక్కడి పరిస్థితులు భరించలేక పారిపోవడం, నేరస్తులవడం లేదా మనిషి మాంసంతో వ్యాపారం చేసేవాళ్లకు చిక్కి నరక కూపాల్లో మగ్గిపోవడం! బాలకార్మిక వ్యవస్థ నుంచి బాలనేరస్తులు తయారవ్వడం..

గదికి వొచ్చి కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాడు- జకీర్‌కు ఫోను చేశాడు.

"జకీర్, ఆ పిల్లను హాస్టల్లో చేర్చాం చూడు- అక్కడ ఒక పిల్ల వైద్యం లేక చనిపోయిందని వార్త వొచ్చింది. ఎన్‌క్వైయిరీ నడుస్తున్నది గుర్తుందా? అక్కడ మనం చేర్చిన పిల్లే ముఖ్యసాక్షి- దాని పరిస్థితి ప్రమాదకరంగా వున్నదని నా అనుమానం- మనం ఎలాగయినా ఆ పిల్లను అక్కడనుంచి తప్పించాలి... రేపు అక్కడకు ఇద్దరంపోయి విషయాలు రాబట్టాలి.."

చనిపోయిన పిల్లను గురించి లక్ష్మిని ఎంత అడిగినా లాభం లేకపోయింది. అది నోరు విప్పడం లేదు. ఈ సెంటర్సులో సరయిన తిండిలేదు. వైద్య సదుపాయం లేదు. శుభ్రత లేదు- అక్కడ పిల్లలు దోమల్లాగా చస్తుంటే ఆశ్చర్యమేముంది? ఈ పరిస్థితులకు ఎవరు కారణం? అధిక సంతానం అని రాజకీయవేత్తలంటారు? అవినీతి, అధికార దాహం అని అభ్యుదయ వాదులంటారు. మనుష్యుల్లో లోపలినుంచి మార్పు రావాలి అని

## చర్చ..

నేనివ్వాళ మీ ఇంటికి భోజనానికివస్తున్న విషయం మీ ఆవిడకు నిజంగా తెలుసా మైడియర్ సుబ్రావ్?' బాస్ అడిగాడు.

'తెలుసుసార్'

'నిజంగా?'

'నిజమే సార్! ఇదే విషయమై ఉదయం మా ఇంట్లో రెండుగంటలపాటు చర్చ కూడా జరిగింది సార్..'

'చర్చల ఫలితం?'

'రెండు గాజుగ్లాసులు, నాలుగు టీకప్పులు భళ్లున పగిలాయ్ సార్'

'???'



ఆధ్యాత్మిక వాదులంటారు- అబ్బే మేం బాలకార్మిక వ్యవస్థను రద్దుచేసి, హాస్టళ్లకు కోట్లాది రూపాయలిస్తున్నాం.. కాని కింద ఉద్యోగుల్లో అవినీతి అలా వున్నది- ఏం చేస్తాం... అంటారు పాలకులు! ఈ దిక్కు లేని పిల్లలు మాత్రం అమాయకంగా ఎదురు చూస్తూ వుంటారు, తమను ఉద్ధరించేవారి కోసం!

వారితో మర్యాదగానే వ్యవహరించింది నాగరత్నమ్మ. ప్రశ్నలకు ఓపికగానే సమాధానాలిచ్చింది.

"...మీరొక విషయం తెలుసుకోవాలి. మాది ప్రభుత్వ సంస్థ కాదు... పునరావాస కేంద్రం. ప్రజల విరాళాలతో నడుస్తున్నది"

"ప్రభుత్వ గ్రాంటుల మాటేమిటి? "

"గ్రాంటులు- మీకు తెలీదా? బడ్జెట్‌లోనే కేటాయింపులు తప్ప మా చేతికెప్పుడు అందుతుంది? ఒకవేళ వొచ్చినా ఎంత? ఇందరు పిల్లలకు తిండి, బట్టా, మందులూ? బ్రిడ్జి కోర్సెస్ అని పేరుకే గాని, కొద్దిగా చదువొచ్చిన పిల్లల్ని వెల్‌ఫేర్ హాస్టల్స్‌కు ట్రాన్స్‌ఫర్ చేయడం, వాళ్లు అంతమంది పిల్లలకు తమ వద్ద సదుపాయం లేదని త్రిప్పి పంపడం- మా బాధలు ఎవరితో చెప్పుకోవాలండీ? మీరే ఆలోచించండి- ఇందరు పిల్లలకు సదుపాయాలకు ఎంత ఖర్చవుతుంది? "

జకీర్ ఈలోగా ఫొటోలు తీస్తున్నాడు. సోమయ్య ఆ విషయం మెల్లగా వొచ్చి చెప్పాడు. ఆవిడ మొదట చిరాకు పడ్డా "ఫొటోలు తీసుకోనివ్వు, అలా అయినా ఈ పిల్లలు పడే బాధ చూసి ప్రభుత్వం కళ్లు తెరిస్తే చాలు.." అన్నది.

"అన్నిటికీ ప్రభుత్వమే కారణమా? జబ్బు పడిన పిల్లలకు వైద్య సహాయం అందదని అందరికీ తెలుసు... అది మీ నిర్లక్ష్యం కాదా? "

"అలా ఎందుకు జరుగుతుంది? ఏ

**కొత్తగాలి...**

కిక్కిస్తేనేగాని
స్టార్టవదు స్కూటరు
స్టార్టయితే గానీ
కిక్కివ్వదు బాటిలు

—సోమంచి రామం, మచిలీపట్నం

జబ్బు చేసినా వెంటనే డాక్టరును పిలిపిస్తాం- అంతేగాక ప్రతి ఆదివారం రొటీన్‌గా వైద్య పరీక్ష చేయిస్తాం."

"అంత శ్రద్ధే వుంటే ఆ మధ్య సరస్వతి అనే పిల్ల వైద్యం లేక ఎందుకు చనిపోవలసి వచ్చింది? "

ఆవిడ ఏమాత్రం చలించలేదు.

"ఆ విషయం మీద అప్పుడే ఎన్‌క్వయిరీ వేయించాం. రిపోర్టు కూడా వొచ్చింది. వైద్య సహాయంలో లోపం లేదనీ, హైఫీవర్ తగ్గక చనిపోయిందన్నారు. మీరిప్పుడా సంగతి అనవసరంగా.."

"ఆ పిల్ల ట్రీట్‌మెంటు లేక చనిపోయిందని మీ పిల్లలే మాకు ఇన్‌ఫర్మేషన్ ఇచ్చారు."

ఆవిడ కోపంగా కుర్చీలోంచి లేచింది.

"ఇంక మీరు అడిగింది చాలు- మాది స్వచ్ఛంద సంస్థ- వాలంటరీ సర్వీసు చేస్తున్నాం- మేము ఎవరికీ జవాబుదారీ కాదు. ఇంక మీరు వెళ్లవచ్చు."

"సారీ మేడమ్, మీరు చట్టాలకు అతీతులుకారు- మీ సంస్థ ప్రజల విరాళాలతో, ప్రభుత్వ నిధులతో నడుస్తున్నపుడు- అందులో రిజిస్టరు అయిన సంస్థ-"

ఆవిడ జవాబిచ్చేలోగా జకీర్ వొచ్చాడు. "నా పని అయిపోయింది బ్రదర్" అంటూ.

"నా ఇంటర్వ్యూ కూడా అయింది-

## కొత్తగాలి...

**జీవనపోరాటం**
**విప్లవం కానేకాదు**
**బతుకు జరుగుబాటుకు**
**తప్పని తిరుగుబాటు**

*-శరగడం నరిసింగరావు, చినముషిడివాడ*

మనకు జవాబివ్వవలసిన అవసరం లేదంటున్నారు వార్డెన్‌గారు- వీళ్ల వ్యవహారమంతా బైట పెట్టించాలి... థాంక్యూ మేడమ్" అంటూ లేచాడు మోహన్.

వారిద్దరూ వెళ్లాక ఆవిడ సోమయ్యను కేకపెట్టి పిలిచింది. "సోమయ్యా, ఇప్పుడొచ్చినవాళ్లు ఈమధ్య ఎవరైనా పిల్లల్ని కలిశారా? "

"అవునమ్మా, ఆ కళ్లద్దాలాయన ఓసారి లక్ష్మిని కలిసి బైటకు తీసుకువెళ్లారు, మిమ్మల్ని అడిగి... మర్చిపోయారా అమ్మా."

"ఆ దయ్యాన్ని ఓసారి ఈడ్చుకురా" అని అరిచింది.

లక్ష్మిని చూస్తూనే "ఏమే పాకీతముండా, తేరతిండి తిని వొళ్లు కొవ్వింది? వాడెవడో పోయినవారం వొచ్చి నిన్ను కలిశాడు. మీరు ఏమేం మాట్లాడుకున్నారు? సరస్వతి గురించి అతనికి ఏం చెప్పావు? అంతా చెప్పకపోయావో నా సంగతి తెలుసుగా? సరస్వతి ఎట్లా చచ్చింది? నీ రక్తం కళ్ల చూస్తా... చెప్పు" టేబుల్ పక్కన వున్న ఇనపచువ్వ చేతిలోనికి తీసుకున్నది. దానితో ఎలుకలు చంపుతూ వుంటాడు సోమయ్య.

లక్ష్మి బెదిరిపోయింది. "నేనేం చెప్పలేదమ్మగారూ- నాకు టిఫిన్ తినిపించాడు"

వీపుమీద బాదింది.

"ఈ రోజు నీప్రాణం తీస్తా.." అంటూ ఒళ్లు హూనం చేసింది.

గట్టిగా కేకలు పెడుతూ, ఏడుస్తూ, "కొట్టకండమ్మగారూ, వొళ్లు వాచిపోతోందమ్మా, నే చచ్చిపోతా.. డాక్టర్ రానేలేదని చెప్పా- నిజం చెప్పినా కొడతారా? నీయమ్మ, నన్ను కొట్టొద్దే- బాడ్కావు.." బాధ భరించలేక లక్ష్మి బూతుల్లోకి దిగింది. దాంతో నాగరత్నమ్మ పిచ్చెక్కినట్లు బాదేసింది. ఆవిడ కొట్టే దెబ్బలు చూసి సోమయ్య కూడా బెదిరిపోయి, ముందుకు వచ్చి "ఇంక చాలు మేడమ్, అది చచ్చేట్లుంది" అంటూ ఆవిడ చేతిలో నుంచి పిల్లను ఇవతలకు లాగాడు.

ఆవిడ రొప్పుతూ "దాన్ని చంపినా అడిగేవాడెవడు? ఏమే, దిక్కులేని ముండా నన్నే తిడతావా! దీన్ని తీసుకుపోయి గదిలో పడెయ్యి- నాకు చెప్పకుండా మంచి నీళ్లు కూడా ఇవ్వద్దు.." అని చేతిలో ఇనప చువ్వ పడేసి కుర్చీలో కూలబడింది.

సోమయ్య లక్ష్మి చేయి పట్టుకుని నీళ్ల తొట్టి వద్దకు తీసుకుపోయాడు. గౌను విప్పి గాయాలు కడిగాడు. వీపుమీద రక్తపు వాతలు చూసి బాధపడ్డాడు. లక్ష్మి ఏడుపు తగ్గింది గాని ఎక్కిళ్లు వస్తున్నాయి.

"ఎన్ని దెబ్బలు తిన్నావు బిడ్డా? రాక్షసి ఎట్లా కొట్టింది? ఏమిటో ఇట్లా పిల్లలు ఇక్కడ పడివుండటం.." అని గొణుక్కుంటూ ఏదో మందు తెచ్చి గాయాలకు రాసాడు.

లక్ష్మి మనస్సులో ఈరోజు సంఘటన గురించి ఏ ఆలోచనా లేదు. ఊరు, చెల్లెళ్లతో ఆటలు, పొలాల దగ్గర కందికాయలు కోసుకు తినడం, 'అమ్మా' కొన్ని చెల్లెళ్లకు కూడా తీసుకుపోతా' గుడిసె పక్క ఎవరిదో కోడి పెట్టిన గుడ్డు, ఏవేవో గుర్తుకొస్తున్నాయి. ఇదంతా ఒక కలలాగా ఎప్పుడో మెలకువ వచ్చేసరికి తమ గుడి

సెలో ఉంటానని దాని భావన!..

ఆ దెబ్బలకు రాత్రికి పెద్ద పెట్టున జ్వరం వచ్చింది. ఆ సంగతి తెలిసినా నాగ రత్నమ్మ "చావనీ దరిద్రం" అని ఖాండ్రించి ఉమ్మేసింది. సోమయ్యే పోయి డాక్టర్ని పిలుచుకువచ్చాడు. ఆయన ఏవో మందులూ, ఇంజెక్షనూ ఇచ్చాడు.

మర్నాడు మధ్యాహ్నానికి గాని లక్ష్మికి తెలివి రాలేదు. నిద్ర లేవగానే చెల్లెళ్లకోసం చుట్టూ చూసింది. సోమయ్య కనబడ్డాడు పాల గ్లాసుతో..

ఓ వారంపాటు మూలుగుతూ, జ్వరంతోనే పడివుండడం చూసి వార్డెనమ్మ కూడా భయపడింది. డాక్టర్ని ప్రతిరోజూ వచ్చి చూడమని చెప్పింది.

మరో వారానికి లక్ష్మి లేచి తిరగసా గింది. నాగరత్నమ్మ చూసి 'భయంలేదు. జ్వరం పూర్తిగా తగ్గింది' అని తనకు తానే ధైర్యం చెప్పుకున్నది. "రోజూ పాలు ఇస్తు న్నారా? దెబ్బలు తగ్గిపోయాయి" అన్నది మెత్తగా మాట్లాడుతూ. ఆ దెబ్బలకు తన ప్రమేయం లేనట్లు, అదేదో లక్ష్మి తెచ్చు కున్న జబ్బయినట్లు.

తర్వాత ఆవిడ సోమయ్యను ఆఫీసు గదిలోనికి పిలిచింది. "దీన్ని పంపేద్దాం. లేదా ఈ పిల్ల మన కొంప ముంచుతుంది ఆ సరస్వతి కేసులో. ఈలోగా దాని దగ్గ రకు ఎవరినీ పోనివ్వకు. ఈసారి బైటికేమన్నా పొక్కిందో నీ ఉద్యోగం ఊడుతుంది, జాగ్రత్త..."

★ ★ ★

"నమస్తే మేడం, నేను లక్ష్మిని కలవా లని వొచ్చాను".

ఇకపై లక్ష్మిని తనింట్లోనే ఉంచుకుని వి ద్యాబుద్ధులు చెప్పించాలని నిర్ణయించుకు న్న మోహన్ పొద్దున్నే హాస్టల్‌కొచ్చాడు.

మోహన్‌కు ప్రతి నమస్కారం పెట్టి కూర్చోమన్నది నాగరత్నమ్మ.

"నేనే మీకు ఫోన్ చేద్దాం అనుకుం టున్నా- లక్ష్మికి ఆ మధ్య బాగా జ్వరం వొచ్చింది. డాక్టర్ని దాని పక్కనే కూర్చో బెట్టాం. వారం పది రోజులకు జ్వరం తగ్గాక, ఓనాడు కనబడకుండా వెళ్ళిపో యింది. కంప్లెయింటు కూడా ఇచ్చాం- ఏ సమాచారం దొరకలేదు."

"ఎక్కడకు పోతుందండీ, వాచ్‌మన్‌కు కూడా తెలియకుండా? అదేమన్నా చీమా, దోమా. పదేళ్ల పిల్ల. ఇలా నడిపిస్తున్నారా మీ రిహాబిలిటేషన్ సెంటర్నును?" మోహ న్‌కు కోపంతో మాట సరిగా రావడం లేదు.

"సరిగ్గా మాట్లాడండి. ఏం చేయాలి? కాళ్లకు గొలుసులు వేయాలా? సోమయ్య ఏ చాయి కోసమో వెళ్ళినప్పుడు పారిపో యింది. ఇదేమైనా జైలా? ఏమో, దానికి చదువుకోవడం ఇష్టం లేక, ఇక్కడ రూల్సు నచ్చకా వెళ్ళిపోయిందేమో!"

"మీరు అందిస్తున్న సుఖమైన జీవితం ఎందుకు నచ్చదులెండి? ఇంతకూ మిస్సింగ్ కంప్లెయింటిచ్చారా, లేక పీడ వొదిలిందని.."

ఆవిడ మండిపడింది.

"ఏవిటిది సంజాయిషీ చెప్పాలా మీకు? అసలు మీరెవరు? పిల్లలకు మీలాంటి వాళ్ళే అవీ ఇవీ చెప్పి చెడగొడతారు. తిండి సరిగా పెడుతున్నారా, మంచి బట్టలిస్తు న్నారా అని రెచ్చగొడుతున్నారు. అనవస రంగా మమ్మల్ని డిస్టర్బు చేయకండి... సోమయ్యా ఎక్కడ చచ్చావు?" అని అరుస్తూ బయటకు వెళ్లింది. మోహన్ బయటకు నడిచాడు.

★ ★ ★

ఆరోజు-

సిటీసెంట్రల్ లైబ్రరీకి వెళ్లి వస్తున్నాడు స్కూటర్ మీద మోహన్.

ఛైర్మన్‌గారి ఇంపార్టెంట్ అసైన్‌మెంట్‌కి

సంబంధించి విషయసేకరణకిగాను లైబ్రరీకి వెళ్లాడతను. లుక్‌కల్చర్ పెరిగి, బుక్‌కల్చర్ కొరవడిందని విమర్శలు వింటున్న మోహన్‌కి లైబ్రరీలో పుస్తకాభిమానులను చూసేసరికి పూనకం వచ్చినట్లయింది. కొన్ని గంటలపాటు లైబ్రరీలో కూర్చుని కావలసిన సమాచారాన్ని ఒడిసిపట్టాడు ఓర్పుగా, నేర్పుగా. దీన్ని పేపర్‌పై ఎలా ప్రజెంట్ చేయాలా అని ఆలోచిస్తూ వేగంగా స్కూటర్‌ని ఆఫీసువైపుకు పరుగెత్తిస్తున్న అతను సందు మలుపు తిరుగుతుంటే... సడెన్‌గా అడ్డం వచ్చిందో పిల్ల. సజ్జనిండుగా కూరగాయలు తీసుకొని వస్తున్న ఆ పదేళ్లబాలికకు అతిలాఘవంగా ప్రమాదం జరగకుండా తప్పించాడు మోహన్. అయినా.. సరే, అదుపు తప్పి కింద పడిపోయిందామె. స్కూటర్‌ని పక్కకు ఆపి స్టాండ్‌వేసి ఆ పిల్ల దగ్గరకి వచ్చాడతను.

"ఏం పాపా! చూసుకుని నడవొద్దా! వేగంగా వాహనాలు వస్తుంటాయి కదా!"

"నేను చూసుకునే వస్తున్నాను. మీరే చూసుకోకుండా గుద్దేశారు.." అందామె కాస్త గడుసుగా. ఆ మాటలు చెబుతూనే తన బట్టలకంటిన మట్టిని దులుపుకుంటూ.. కిందపడి చెల్లాచెదురైన కూరగాయలను ఏరుకుంటోంది.

ఈ పిల్లను ఎక్కడో చూసినట్లుగా తోచింది మోహన్‌కి. అయితే, ఎక్కడ చూసాడో మాత్రం ఎంతాలోచించినా గుర్తుకురావడం లేదు.

"నీ పేరేమిటి? "

"పార్వతి"

ఆ అమ్మాయిని తేరిపారా చూసాక గుర్తొచ్చింది మోహన్‌కి- "నువ్వు లక్ష్మి చెల్లెలివి కదూ!"

ఆమె ఆశ్చర్యంగా చూసిందతనివంక.

"మా అక్క మీకెలా తెలుసు? "

"మీ అక్కే కాదు.. నువ్వూ, మీ చెల్లెలు కూడా తెలుసు" అన్నాడు మళ్లీ.

ఆశ్చర్యం నుంచీ అసలు తేరుకోలేకపోయింది పార్వతి.

"మేం ఎలా తెలుసు? " లక్ష్మి తల్లితండ్రులను కలిసేందుకు నల్గొండ వెళ్లిన సంగతి గుర్తొచ్చింది మోహన్‌కి.

"ఈ ఊరెప్పుడొచ్చావ్? ఇక్కడ ఏం చేస్తున్నావ్?

చెప్పింది పార్వతి. అది పాతకథే. మోహన్‌కి తెలిసిన కథే. లక్ష్మికథే. ఆ కథ మళ్లీ పార్వతికి పునరావృతమైంది. అక్కడకు దగ్గర్లోనే ఓ కాంట్రాక్టర్ ఇంట్లో పనికి కుదిరిందిట పార్వతి. కూరగాయలకని దగ్గర్లోని మార్కెట్‌కి వెళ్లివస్తూ ఇలా ప్రమాదానికి గురైంది.

లక్ష్మి కూడా సరిగ్గా ఇలాగే తన స్కూటర్‌కింద పడి చిన్నదెబ్బలు తగలడం, తాను ఓదార్చి, మందులు కొని, తన స్కూటర్ మీదే దింపడం ఒక్కొక్కటిగా గుర్తొచ్చాయి మోహన్‌కి. ఇంకేం అడగాలనిపించలేదతనికి. మళ్లీ మొదలైన అంతులేని కథ ఇది. నిట్టూర్చాడు మోహన్. అయిదునిముషాల తర్వాత మోహన్ స్కూటరెక్కింది పార్వతి. దార్లో అడిగాడు మోహన్- "లక్ష్మి ఎక్కడుంది? "

"తెలీదు.." పార్వతి సమాధానం.

పార్వతి పనిచేసే బంగ్లాదగ్గర స్కూటరాపాడు మోహన్.

మనసు మనసులో లేదు. డబ్బుల్లేవు, నలుగురిలో మాట్లాడే వయసు లేదు. చిన్న పిల్ల. దాన్ని రాక్షసుల చేతుల్లోంచి తీసుకువచ్చి, పిశాచాలకు అప్పగించింది తనే! అమాయకపు పక్షి, ఎక్కడున్నదో? మళ్లా వెట్టి చాకిరీకో, ఏ నరక కూపం లాంటి హాస్టలుకో, ఏ మంటల్లోకో, ఏ అడవిలోకో.. అక్కడ నుంచి ఎక్కడికో.. మళ్లా ప్రయాణం ప్రారంభమయింది.. ఇలాంటి పిచ్చి తల్లులు మనమధ్య ఎందరో! ©

నివాళి



# రాచకొండ మన బంగారుకొండ

తెలుగు కథకు, నవలకు, అంతర్జాతీయ స్థాయి గుర్తింపు తెచ్చిన అసాధారణ ప్రజ్ఞానిధి రావిశాస్త్రిగా సుప్రసిద్ధులైన రాచకొండ విశ్వనాథశాస్త్రి.

వృత్తిరీత్యా న్యాయవాది కావటంతో ప్రవృత్తిరీత్యా ఆయనకు కావలసిన ఇతివృత్తాలన్నీ నిజజీవితంలో బాగా సన్నిహితంగా తెలిసిన కక్షిదారులు, కోర్టుపక్షులు, పోలీసులు, న్యాయస్థానాలకు వచ్చే బడుగు జీవులు, బాధాసర్పదష్టుల చుట్టే తిరిగేవి.

పేదల పక్షాన నిబద్ధతతో నిలబడి లాయరుగా ఎలా వాదించారో అలాగే సాహిత్యంలోనూ ఆ పేదల కష్టాలను, కన్నీటిని, వారి కడగండ్లను చిత్రించారు.

ఆయన జీవితంలో తమాషా అయిన సంఘటనలెన్నో..

అవి శాస్త్రిగారు లాయరు పట్టాతో ప్రాక్టీసు మొదలుపెట్టిన కొత్త రోజులు..

ఒకరోజు ఓ పేదతల్లి వచ్చి 'లాయరు బాబూ! పోలీసులు మా అబ్బాయిని అరెస్టు చేసి అదేపనిగా బాదుతున్నారు. అణ్ణి మీరే కాపాడాలి బాబూ!' అంది కన్నీళ్లతో. రావిశాస్త్రి వెంటనే పోలీసుస్టేషన్‌కు దౌడు తీశారు.

స్టేషన్ ఎస్.ఐ. దగ్గరకెళ్ళి మృదువుగా 'అయ్యా ఎస్.ఐ.గారూ! ఇతగాడిని ఏసెక్షను క్రింద అరెస్టు చేశారండీ?' అంటూ ఎంతో మర్యాదగా అడిగారు.

'జె అండ్ జె సెక్షను క్రింద!' అంటూ ఠపీమని సమాధానం చెప్పాడు, ఆ ఎస్.ఐ. దూకుడుగా.

శాస్త్రిగారు కంగుతిని, తను న్యాయవాది పట్టాకోసం చదివిన ఏ లా పుస్తకంలోనూ అటువంటి సెక్షను లేకపోవటంతో మరింత కంగారుపడి-

'మీరు చెబుతున్న జె అండ్ జె సెక్షన్ నెంబరెంత సార్? అది ఏ లా పుస్తకంలో వుంది?" అంటూ ప్రశ్నించారు.

'జె అండ్ జె తెలీదా? అంటే జబర్దస్తీ- అండ్ జులుం అన్న మాట! ఈ మాత్రం తెలియనివాడివి నువ్వేం ప్లీడరువయ్యా!' అంటూ తృణకణాన్ని చూసినట్టు చూశాడా ఎస్. ఐ.

రావిశాస్త్రికి లాయరుగా అనుభవం పెరిగాక 'లా' పుస్తకాల్లో లేని అనేక సెక్షన్లు పోలీసుల దగ్గరుంటాయని, వాటితో వాళ్లు పేదల జీవితాల్తో ఇష్టం వచ్చినట్టు ఆడుకుంటారని తరచూ చెబుతుండేవారు.

'ఏ మంచికీ అపకారం చేయకూడదు... ఏ చెడుకూ ఉపకారం చేయకూడదు...

## బయోడేటా

**జననం:** 1922 జులై 30

**పుట్టిన ఊరు:** కోరీ వీధి, శ్రీకాకుళం

**తల్లిదండ్రులు:** సీతామహాలక్ష్మి, నారాయణమూర్తి

**చిన్నప్పటి సరదా:** కథలు రాయడం, నవలా రచనకు ప్రయత్నించడం

**అచ్చయిన మొదటి కథ:** 1938లో వినోదినిలో 'దేముడే చేసేడు'

**వివాహం:** 1945లో లక్ష్మీ సోదెమ్మతో

**విద్యాభ్యాసం:** బి.ఎ(ఆనర్స్), 1946-48లో మద్రాసులో లా డిగ్రీ

**ప్రభావం చూపిన రచయితలు:** చార్లెస్ ల్యాంబ్, డికెన్స్, గురజాడ, శ్రీశ్రీ

అనే సామాజిక బాధ్యతతో, చదివినవాళ్లను చైతన్యపరచాలనే నిజాయితీతో, తెలుగు 'డికెన్స్'లా- వెన్నుతట్టి మేల్కొలిపి ప్రగతిబాటలో ప్రజల్ని నడిపించే కృషి చేశారు- రాచకొండ. ఉత్తమపురుషలో, కథన పద్ధతిని విజయవంతంగా నడిపిన రావిశాస్త్రి నవలల్లో ప్రముఖమైన 'రత్తాలు రాంబాబు', 'అల్పజీవి', 'సొమ్ములు పోనాయండి' వంటి రచనలకు డికెన్స్, చెహోవ్‌ల స్ఫూర్తి కనిపిస్తుంది.

తన విలక్షణమైన 'రాజు-మహిషి'లో వ్యాపారం- పెట్టుబడిదారీ వ్యవస్థలోని దోపిడీని, చిన్న చిన్నకథల్లా రూపొందించడం రావిశాస్త్రికే చెల్లింది.

శ్రీశ్రీ ఈ నవలని ఇరవయ్యో శతాబ్దపు క్లాసిక్ అని ప్రశంసిస్తూ 'పూరీజగన్నాధంలో విశ్వకర్మ తయారుచేసిన అసంపూర్తి విగ్రహం' అన్నారు.

పై నవలలో, మందులషాపు నడిపిన- భీమారావు ముందు కౌన్సిలరై, బాగుపడటానికి వక్రమార్గమే మేలనుకున్నవాడు. భాగ్యలక్ష్మిని పొందటానికి దైవభీతి, లజ్జ, పాపభీతి వంటివి శాశ్వతంగా వదలాలనే లైఫ్ ఫిలాసఫీ ఉన్న కలియుగ మహాత్ముడు.

పోలీసుహెడ్డు గంగరాజు కేసుల్లో లేని వాళ్లని యిరికించటం, అసలువాళ్ళని వదిలేయటం, దొంగలతో సయ్యాటలాడటంలో, దొంగ సాక్ష్యాలు పుట్టించటంలో ఘనాపాఠి. అలాగే రత్తాలిని పెళ్ళి చేసుకుంటానని మోసంచేసి, వెయ్యి రూపాయలకమ్మిన బ్రోకర్.

'సొమ్ములు పోనాయండి' నవలలో పేద రైతు బోడియ్య ప్రెసిడెంట్ దగ్గర బాకీ తీసుకుని వాళ్ళ సాలెగూడులో ఇరుక్కొని, అన్యాయంగా పోలీస్ కేసులో భార్యతో సహా ఇరుక్కుంటాడు.

అనేకమంది పేదసాదల్ని అన్యాయానికి బలికాకుండా బయట పడవేసి, వారికోసం కొండంత అండగా నిలిచిన రాచకొండ, ఎమర్జెన్సీ పుణ్యమా అని, రాజకీయ ఖైదీగా జైలుకు కూడా వెళ్లారు. దీనికి కారణం ఆయన విరసం అధ్యక్షుడవటమే.

అక్కడ వున్నకాలంలో శాస్త్రిగారు తనకు గొప్పపేరు తెచ్చిన 'రత్తాలు-రాంబాబు' నవలను వ్రాయటమే కాక, తను రాసిన

కొన్నికథలు, జైలులో తనతోటి ఖైదీలకు వినిపించే వారు. వాటిని విశ్లేషణతో చర్చిం చేవారు.

నేరాలు చేసి శిక్ష అనుభవిస్తున్న పాత ఖైదీలు, జైలులో ఏదో ఒక పని నిర్బం ధంగా చేస్తుండేవారు. ఎమర్జెన్సీ ఖైదీలు మాత్రం మామూలు బట్టలు వేసుకుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, న్యూస్ పేపర్లు చదువుకుంటూ వుండటం చూసిన ఓ పాతఖైదీ 'డిటెన్యూ ఖైదీలంటే కులాసా ఖైదీలా బాబూ?' అంటూ రావిశాస్త్రినే అడి గాడు.

రావిశాస్త్రి ఆ ఖైదీకి వచ్చిన సందేహానికి నవ్వుకొని 'ఔనౌను! సుఖవ్యాధుల్లో సుఖం లాంటిదే కులాసా ఖైదీల 'కులాసా' కూడా!' అంటూ నిర్బంధంలో వుండే స్వేచ్ఛా రాహి త్యాన్ని గురించి చెప్పారు.

రావిశాస్త్రి ముచ్చటగా మూడు నాటకాలే రాసినా ప్రయోక్తగా, నటుడిగా, దర్శకుడిగా నాటక ప్రదర్శనలో రాణించటం, పరిష త్తులో బహుమతులు పొందడం ఆయన బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనం.

'విషాదం'(నాటిక) 'తిరస్కృతి'(నా టకం) కంటే 'నిజం'(నాటకం) గొప్ప సంచలనం సృష్టించి చరిత్రకెక్కింది. ఉన్న వాళ్ళు, రాజకీయ నాయకులు తమ స్వార్థంకోసం న్యాయవ్యవస్థను ఎలా ఉప యోగించుకుంటున్నారో చెబుతుందీ నాటకం. తర్వాత సినిమాగా కూడా వచ్చింది.

రావి శాస్త్రి మంచి స్నేహశీలి. నిగర్వి. నిజాయితీ, చిత్తశుద్ధి దండిగాగల వ్యక్తి. రచయితల మాత్సర్యం, ప్లీడర్ల మాయలు ఆయనకు తెలియవు.

శ్రీశ్రీ అంటే ఆయనకెంతో గౌరవాభిమా నాలు. శ్రీశ్రీ షష్టిపూర్తి సభా నిర్వాహ కుల్లో ఆయన ప్రముఖుడు. అయితే సదరు సాహితీగోష్ఠి ప్రారంభమైనప్పుడు ప్రసంగించటానికి రావిశాస్త్రి వేదిక ఎక్కక పోవటం గమనించిన జ్వాలాముఖి 'శ్రీశ్రీ సాహిత్య గోష్ఠిలో మీరు ప్రసంగించకపోవ టమేమిటి?' అంటూ అడిగారు.

దానికి ఆయన సరదా సమాధానం- 'ఉస్తాద్ బడే గులాం అలీఖాన్‌లు వచ్చిన ప్పుడు లోకల్ టాలెంట్ తగ్గాలికదా?'. దటీజ్ రావిశాస్త్రి.

ప్రముఖ రష్యన్ రచయిత అలెగ్జాండర్ కుప్రిన్ రచన 'యమా దిపిట్' అనే నవల- యమకూపంలో మగ్గే వేశ్యల దయామయ దీనగాథల్ని చిత్రించి ప్రపం చసాహిత్యంలో పెద్ద సంచలనం రేపింది.

## కులాసా ఖైదీలు

**నేరాలు చేసి శిక్ష అనుభవిస్తున్న పాత ఖైదీలు, జైలులో ఏదో ఒక పని నిర్బంధంగా చేస్తుండేవారు. ఎమర్జెన్సీ ఖైదీలు మాత్రం మామూలు బట్టలు వేసుకుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, న్యూస్‌పేపర్లు చదువుకుంటూ వుండటం చూసిన ఓ పాతఖైదీ 'డిటెన్యూ ఖైదీలంటే కులాసా ఖైదీలా బాబూ?' అంటూ రావిశాస్త్రినే అడిగాడు.**

అలాంటి రచన చేసినందుకు ఆ నవలను తగలబెట్టించి, రచయితను నానా విధా లుగా చిత్రహింసలకు గురిచేసింది, అప్పటి రాజరిక ప్రభుత్వం.

రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు' నవలను జైల్లో రాసినా అదీ వేశ్యావృత్తి యితివృ త్తంగానే రాయబడింది కావడం గమ

నార్థం.

అలంకార శైలివల్ల, ఇతివృత్త వైవిధ్యం వల్ల, శిల్పదృష్ట్యా ఉత్తరాంధ్ర మాండలిక ప్రయోగంవల్ల శాస్త్రిగారి వచనం ఓ కవి తలా సాగిపోతుంది.

ఉపమాలంకారం కాళిదాసుకు మల్లే రావిశాస్త్రికీ ప్రియమైనది. అందుకే ఆయన రచనల్లో 'అతని పండుజుట్టు ఉడతలు పీకిన తాటిటెంకలా వుంది'- లాంటి ఉదాహరణలు కోకొల్లలు.

పాఠకుడికి సందర్భోచితంగా భావం, సందర్భం బాగా గుర్తుండేట్టు చేయడానికి మంచి పదబంధాలతో.. పోలికలతో చెప్పటం అవసరం అంటారాయన.



సోమయాజులనే పాత్ర గురించి చెబుతూ 'సిలకలా అవుపించే సిరతపులి' అంటారు.

రత్తాలు అనే పాత్రను గురించి పోలికలు చెబుతూ-

'ఆ అమ్మాయి విస్కీ సీసాను కన్నకొడుకును ఎత్తుకొచ్చినట్టు ఎత్తుకొచ్చింది' అంటారు.

'ఆ అమ్మాయి నేటివ్ రమ్ములా వుంటుందని నేను అనుకున్నాను! తీరా చూస్తే స్కాచ్‌విస్కీలా వుంది' అంటూ రత్తాలు అందాన్ని వర్ణిస్తారు.

'పులికి-ప్లీడర్‌కి' తేడా హాస్య చమత్కారంగా-

"ఆహారంకోసం పులి అడవంతా తిరగాల. ఆహారం కోసం ప్లీడరు కాలు కదపడు, కుర్చీదిగడు గాని, అదే ఆణ్ణి ఎతుక్కుంటూ, ఆడి ఆఫీసుకే వస్తది" అంటారు.

అనంతం అనే పిసినారి పాత్రను గురించి హాస్యంగా 'ముడ్డికి సెంటూ, మూతికి పేడా రాసుకు తిరుగుతున్నాడు' అని వర్ణిస్తారు.

ఉత్తరాంధ్ర మాండలికంలో రాసి, ఆ భాషకు ప్రాచుర్యాన్ని, సాహిత్య గౌరవాన్ని కలిగించిన రాచకొండ తెలుగు సాహిత్యంలో బంగారుకొండ. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త', 'సొమ్ములు పోనాయండి' నవలల్లో ఎదుట ఎవరోవ్యక్తి కూర్చుని కథ చెబుతున్నట్టు రాయడం అదో ప్రత్యేకతగా ఆనాడు ప్రశంసలందుకుంది.

**(ఈ నెల 11 రావిశాస్త్రి వర్ధంతి)**

**- ఎం.డి.సౌజన్య**

# జె.సి. పెన్నీ



1875లో అమెరికాలోని కెంటకీ రాష్ట్రంలో పుట్టిన జేమ్స్ కేష్ పెన్నీ పేరు అమెరికా ప్రజలందరి నోళ్లలో నానుతుందని అతని తల్లిదండ్రులు ఊహించి ఉండరు. అతని తండ్రి ఓ బాప్టిస్ట్ చర్చ్‌లో మినిస్టర్‌గా పనిచేసేవాడు. వారు క్రైస్తవ జీవితాన్ని గడిపేవారు.

పెన్నీ టీనేజర్‌గా ఉన్నప్పుడు తండ్రి సంపాదన చాలక స్కూల్ వదిలి ఓ స్థానిక దుకాణంలో గుమాస్తాగా చేరాడు. తర్వాత అలాంటి అనేక దుకాణాల్లో పని చేశాక, తను జీవితంలో గడించిన అపారమైన అనుభవంతో రీటెయిల్ వ్యాపారం చేయాలన్న ఆసక్తి కలిగింది. కెమ్మరర్ అనే ఊళ్లో 1902లో ఓ డ్రైఫ్రూట్స్ దుకాణంలో మూడోవంతు భాగస్వామ్యం తీసుకున్నాడు. ఆ దుకాణం అటక మీద పెన్నీ తన భార్యతో నివసించేవాడు. ఖాళీ అయిన పెద్ద డ్రైఫ్రూట్స్ పెట్టెను టేబుల్‌గా, చిన్న పెట్టెలను కుర్చీలుగా వాడేవాడు. భార్య కూడా కౌంటర్ కింద చంటి పిల్లవాడిని పడుకోబెట్టి సేల్స్ లేడీగా పనిచేసేది.



జె.సి. పెన్నీ ఎంతో కఠోర దీక్షతో వ్యాపారాన్ని నిర్వహించేవాడు. త్వరలోనే అతడి దుకాణాలు అమెరికా అంతటా 1700 పైచిలుకు తెరవబడ్డాయి. తన పేరుతోనే ప్రారంభించిన ఆ దుకాణాల సముదాయం, అమెరికాలోని మొదటి అతిపెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ చెయిన్. జె.సి. పెన్నీ విజయానికి రెండు ప్రధాన కారణాలు ఉన్నాయి. ఒకటి క్రైస్తవ కుటుంబం నుంచి వచ్చిన అతను 'ఇతరులు నీకు ఏం చేయాలనుకుంటున్నావో, అది నువ్వు ఇతరులకు చెయ్యి' అనే గోల్డెన్ రూల్‌ను పాటించడం. మరోటి క్రమశిక్షణతో కష్టపడి పని చేయడం. అతడు జీతానికి దుకాణాల్లో పనిచేసేటప్పుడు తోటి ఉద్యోగుల్లాకాక, భోజనవిరామంలో త్వరగా భోజనం తిని వెళ్లి పని చేసేవాడు. 1929లో అమెరికాలో వచ్చిన ఆర్థిక సంక్షోభం సమయంలో కూడా జె.సి. పెన్నీ దుకాణాలకు పెద్దగా ఇబ్బంది కలగలేదు.

అతడిలో ధార్మిక బుద్ధి అధికం. సంస్థలకు, వ్యక్తులకు డబ్బు దానం చేసేవాడు. దానికోసం బ్యాంకునుంచి అప్పు కూడా తీసుకునేవాడు. బ్యాంకులు ఆ అప్పును తిరిగి తీర్చమని జె.సి. పెన్నీని ఎప్పుడూ బాధించేవి కావు.

నేటికీ 'జె.సి. పెన్నీ రీటెయిల్ చెయిన్ స్టోర్స్' అమెరికాలో పనిచేస్తూనే ఉన్నాయి.

# భగవత్ - స్వరూపం

10

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

**లో**కంలో జనులకు భగవంతుడంటే ఎంతో భక్తిశ్రద్ధలున్నాయి. ఆ భగవత్ సాక్షాత్కారానికి వివిధ రకాల ఉపాసనలు, ఆరాధనలు, పూజలు చేస్తారు. మానవ జీవన సాఫల్యానికి- పరమాత్మ సాక్షాత్కారానికి మించిన గొప్పకార్యం ఈ జన్మకు మరొకటి లేదు. అందుకే ఈ వేదభూమిలో జన్మించిన ఎందరో మహర్షులు వేద కాలంలో ఈశ్వర సన్నిధిని చేరేందుకు జపతపస్సులు ఆచరించారు. బ్రహ్మచర్యాది మహావ్రతాలను పాటించారు. వారి జీవనాన్ని పరమార్థ మార్గం వైపు నడిపించుకున్నారు.

జీవనం సఫలం కావాలంటే వేదశాస్త్రాలను అన్వేషించాలి. వాటిని అధ్యయనం చేయాలి. శాస్త్ర ధర్మాలను తెలుసుకోవాలి. ముక్తిమార్గాన్ని అందుకోవాలి. అందుకు కళ్యాణ కారకమైన వేదాలే శరణ్యమని మహర్షులు బోధించారు. వేద ఋషులు వేదంలోని పరాత్పరుడైన పరమాత్ముని ఏ విధంగా ఉపాసించాలో ఆ పరమపురుషుని స్వరూప స్వభావాలేమిటో మనకు స్పష్టంగా తెలియచేశారు.



ఈనాటికీ భగవంతుని పేరు మీద మన భారతీయ సమాజంలో చాలా పెద్ద వ్యాపారమే జరుగుతుంది. కారణం అందరికీ భగవంతుడు కావాలి. ఆ కావలసిన భగవంతుని అందుకోవడంకోసం మనిషి ఎంతో అవస్థపడుతున్నాడు. ఆత్రుత పడుతున్నాడు. ఆత్మశాంతి లేకుండా చేసుకొంటున్నాడు. కష్టపడిన ధనం వదులుకోవడానికి సిద్ధపడుతున్నాడు. ఇదంతా ఎందుకు చేస్తున్నాడంటే తనకు భగవద్దర్శనం కావాలి. మోక్షాన్ని పొందాలి. ఈ జన్మను తరింపచేసుకోవాలనే ఆరాటంతో చేస్తున్నాడు. మరి ఆ ప్రయత్నం సరైనదా? భగవత్ సాక్షాత్కారం మనకు ఈ జన్మలో లభిస్తుందా? ఈశ్వర సన్నిధి- ముక్తి అంత సులభమయినదా? అంటే కాదని వేదం సమాధానం చెప్తుంది. భగవత్ సాక్షాత్కారానికి మనిషి ప్రాపంచిక సుఖా

లను వదిలి యోగి కావాలని వేదమం టుంది. ముందుగా భగవంతుని లక్షణమే మిటో తెలుసుకోమని వేద ఋషులు ప్ర బోధం చేశారు.

**ఓం ఇంద్రం మిత్రం వరుణం**
**అగ్ని మా హురథో దివ్యస్స సువర్ణః।**
**ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం**
**యమం మాతరిశ్వాన మాహుః॥**

(ఋగ్వేదం 1-22-164-46)

భగవంతుడొక్కడే. విద్వాంసులు ఆ భగవంతునే ఇంద్రుడు, మిత్రుడు, వరు ణుడు అగ్ని మొదలైన నామాలతో పిలు స్తారని ఈ మంత్రం వర్ణిస్తుంది.

మనం ఒక్కొక్క భగవంతుని నామానికి ఒక్కొక్క రూపాన్ని ఊహించుకుంటాము. మరి ఈ వేదమంత్రం ఈ పేర్లన్నీ ఒకే భగవంతునివని స్పష్టంగా చెప్పింది. వేదంలో ఇట్లాంటి మంత్రాలు చాలా ఉన్నాయి.

బ్రహ్మ అంటే అన్నింటికంటే గొప్పవా డని, విష్ణువంటే అంతటా వ్యాపించి వున్న వాడని, మహేశ్వరుడంటే గొప్ప ఐశ్వర్య వంతుడని, శంకరుడంటే శుభాన్ని ఇచ్చేవా డని, మహాదేవుడంటే దేవుళ్లందరికంటే గొప్ప దేవుడని, రుద్రుడంటే దుష్టులను ఏడ్పించేవాడని అర్థాలున్నాయి. ఇవేకాక స్త్రీ లింగానికి సంబంధించిన నామాలు లక్ష్మి, సరస్వతీ, శక్తి మొదలైన పేర్లు కూడా వేదంలోని పరమాత్మునివే. 'ఓం' అనే ప్రణవ నామం కూడా ఆ పరాత్పరునిదే. ఇవేకాక భగవంతుని అసంఖ్యాకమైన నామాలెన్నో మనకు వేదంలో కనిపి స్తాయి. ఇవన్నీ సందర్భానుసారంగా ప్రక రణానుసారంగా పరమాత్మనుద్దేశించి వాడి నవేనని తెలుసుకోవాలి.

ముఖ్యంగా వేదంలోని భగవతత్త్వం ఇంద్రియాలకు తెలిసేదికాదు.

**పరీత్య భూతాని పరీత్య లోకాన్**
**పరీత్య సర్వాః ప్రదిశోదిశశ్చ।**
**ఉపస్థాయ ప్రథమ జామృత స్యాత్మ**
**నాత్మాన మభి సం వివేశ॥**

(యజుర్వేదం 32-11)

ఆకాశాది పంచభూతములయందు సూర్యాది లోకాలలోను, పూర్వాది దిక్కు లందు, ఆగ్నేయాది దిక్కోణములందు పర మాత్మ నిరంతరం వ్యాపించి ఉన్నాడు. ప్రతి అణువులో అంతర్యామి రూపంలో దాగివున్నాడు. ఆ భగవంతునిలోనే సృష్టి రహస్యాలన్నీ ఇమిడి వున్నాయి. ఆ పర మానంద మంగళ స్వరూపుడైన పరమా త్ముడే మోక్షప్రదాతగా తెలుసుకోవాలని వేదమంటుంది.

ఆ బ్రహ్మ పదార్థం అన్నిటికంటే పెద్దది. అది మానవులందరికి పూజనీయం. సమ స్తలోకాలకు ప్రాణులకు ఉపాసింపదగినది, విజ్ఞానాది గుణాలలో అన్నిటికంటే పెద్దది. అంతరిక్షాకాశాలకు ఆధారమై అందులోనే వ్యాపించి జగత్తు ప్రళయమైన తరువాత కూడా నిత్యమై, నిర్వికారమై వుంటుంది. ఆ పరమాత్మునిలోనే సమస్త లోకాలు, భువనాలు స్థిరంగా వున్నాయి. ఆయనలోనే అష్టవసువులు ఇతరదేవతలు స్థితంగా వున్నాయి.

**'వృక్షస్య స్కంధః పరితః శాఖా'**

ముందుగా భూమినుండి అంకురముద్భ వించి అదే స్థూలమై స్కంధగా (కాండం) మారి క్రమంగా శాఖలకాధారమవుతుంది. అట్లాగే సమస్త బ్రహ్మాండానికి ఆధారం పరమాత్ముడే.

**పరాంచిఖాని వ్యతృణత్ స్వయం భూః।**

**తస్మాత్ పరాజ్ పశ్యతి నాంతరాత్మన్॥**

(కఠోపనిషత్)

పరమాత్మ ఇంద్రియాలను బహిర్గతం చేశాడు. అవి బయటనే చూస్తాయి. కాని లోపలచూడలేవు. అందుకే భగవంతుని



బాహ్యేంద్రియాలతో దర్శించలేమని ఉపని షత్కారులన్నారు. అంతరాత్మలోని అంత ర్యామి రూపంలోనున్న జగత్ స్రష్టయైన పరమాత్మను దర్శించడమే ఈ మానవ జన్మకు లక్ష్యం కావాలని వేద ఋషుల న్నారు.

పరమాత్మతత్త్వం ఇంద్రియాలకు గోచర మయ్యేదికాదు. అది స్వయం ప్రకాశంతో సృష్టి అంతటా వ్యాపించి వుంది. దానిని మించి మానవులు వరించదగిన శ్రేష్ఠ తత్త్వం మరొకటిలేదు. అందుకే ఋగ్వే దాది చతుర్వేదాలు ఆ పరమాత్ముని విశే షంగా కీర్తించాయి. వేదాలలో ప్రత్యక్షంగా పరోక్షంగా పరతత్త్వమే వర్ణించబడింది.

వేదంలోని పరమాత్ముడు అంతటా ఉంటాడు. ఆ భగవంతునిలో దేశకాల వస్తు భేదంలేదు. అతడు ఒకచోట వున్నాడు, ఇంకొకచోట లేడు. ఒక కాలంలో వున్నాడు, మరొక కాలంలో లేడు. ఒక వస్తువులో వున్నాడు ఇంకొక వస్తువులో లేడనే దేశకాల వస్తుభేదం పర మాత్ముకు వర్తించదు.

వేదంలో పరమాత్మతత్త్వం విలక్షణమ యింది. అదొక మహత్ పదార్థం. అది సమస్త పదార్థాలలో ఓతప్రోతమై వుంటుంది. ఈ సృష్టిలోని సమస్త పదార్థా లలో పరమాత్మతత్త్వం నిండివుంది. అన్ని వస్తువులలో, పదార్థాలలో భగవంతుడు లోపల, బయట వ్యాపించి వున్నాడు. కాని ఆ వస్తువులు, పదార్థాలు భగవంతుడు కాదనే సత్యం మనం తెలుసుకోవాలి. అంతటా వ్యాపించివున్న భగవంతుడు ప్రతిమలలో-మూర్తులలో, శిల్పాలలో, విగ్ర హాలలో కూడా వుంటాడు. కాని అవేవీ భగవంతుడు కాదనే సత్యాన్ని తెలుసుకో వాలని వేదమంటుంది.

భగవంతుడు జ్ఞానేంద్రియాలకు, కర్మేం ద్రియాలకు అంతరింద్రియమైన మనస్సుకు గోచరం కానివాడని ఉపనిషత్‌లలో ఋషులు వర్ణించారు.

'ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిధిధ్యాసితవ్యః"

(బృహదారణ్యక ఉపనిషత్)

ముందుగా పరమాత్మను గురించి ఉన్నది ఉన్నట్లుగా వినాలి. విన్నదానిని మననం చేయాలి. మననం చేసిన దానిని యోగాంగానుష్ఠానం ద్వారా అనుభవం లోకి తెచ్చుకోవాలని మహర్షి యాజ్ఞవల్క్యు డన్నాడు.

'శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః'

పరమాత్మను వేదవాక్కుల ద్వారా వినాలని మహర్షులన్నారు. భగవంతుడు అంతటా ఉన్నాడనే ఆలోచన, విశ్వాసం జనులలో వుండాలి.

'పతిః ఎక ఆసీత్' ఈ ప్రపంచాన్ని సృజించి పాలించి పోషించే పరమాత్మ ఒక్కడేనని యజుర్వేదమంటుంది.

**న ద్వితీయో నతృతీయ శ్చతుర్థో నాప్యుచ్యతే**

**న పంచమో న షష్ఠ సప్తయో నాప్యుచ్యతే**

**న అష్టమో న నవమో దశమో నాప్యుచ్యతే।**

**తదిదం నిగతం సహః స ఏష ఏక ఏక వృదేక ఏవ**

**సర్వే అస్మిన్ దేవా ఏక వృతో భవంతి॥** (అధర్వ వేదం)

పరమాత్మ ఒక్కడే. అతనికంటె వేరుగా రెండవ, మూడవ, నాల్గవ వాడైన పరమాత్మ ఎవరూ లేరని వేదమంటుంది. ఐదవ, ఆరవ, ఏడవ వాడైన ఈశ్వరుడు లేడని వేదం స్పష్టం చేస్తుంది. ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ వాడైన పరమాత్ముడింకొకడు లేడని వేదం నిర్దేశిస్తుంది.

సర్వ సంఖ్యలకు మూలం ఒకటి. ఈ సంఖ్యతో భగవంతుడొక్కడేనని, వేదములందిక ఈశ్వర వర్ణన లేదని నిర్ణయించారు. భగవంతుని ఏకత్వమందు ఏవిధమైన భేదంలేదు. భగవంతుడు శూన్యుడుకాదు పరిపూర్ణుడు. ఆ దేవుడు సచ్చిదానందాది లక్షణ యుక్తుడు, సర్వజ్ఞుడు. సర్వదా సమస్త జగత్తులో వ్యాపించి వున్నాడు. నిరంతరం జడచేతనాత్మకమగు సమస్త జగత్తును భగవంతుడు వీక్షిస్తున్నాడు.

ఈ మంత్రంలో ఏకః అనే పదం మూడుసార్లు ప్రయోగింపబడింది. అందువలన పరమాత్మ ఒక్కడేనని నిశ్చయంగా తెలుస్తుంది.

మనుష్యుడు పరమాత్మను సాక్షాత్కారం చేసుకునేందుకు వీలైన స్థానం హృదయమే. శరీరానికి బయట పరమాత్మను అన్వేషించడం ఆత్మ విదుల దృష్టిలో శాస్త్ర



విరుద్ధం.

దేవుడు ఒక్కడే. వేదంలో అనేక మంది దేవుళ్లు లేరు. కాని వేదం ఒకే పరమేశ్వరుని అనేక నామాలతో వర్ణించింది. ఆ నామాలు కూడా గుణకర్మ స్వభావాలకు ఆధారంగా వేదం ఆయన చేసే పనిని బట్టి వ్యాఖ్యానించింది.

దేవుడు పొట్టిగా, పొడవుగా, నల్లగా, తెల్లగా వుండడు. బరువుగాగాని, తేలిగ్గా

కాని వుండడు.

'నతస్యప్రతిమాఆస్తి' వేదం భగవంతునకు ఆకారంగాని, పరిమాణంకాని లేదని వివరించింది.

సృష్టికర్తయైన పరమాత్ముని అంతటా అన్నిచోట్లా దర్శించాలి. కాని పరిమితంగా ఊహించుకోకూడదు. ఆయన మహిమలు జగద్విఖ్యాతములు, అనంతములు. ఈ అనంతమైన సృష్టిని చేసినవాడు అనంతుడు. ఆయన గుణములు అనంతములు. అట్లాంటి పరమేశ్వరుడు ఏకదేశీయుడుకాడు. అతడు సర్వత్ర వ్యాపకుడు, సర్వసాక్షి. మనం చేసే శుభ, అశుభ కర్మలకు భగవంతుడే సాక్షి. అందుకే వేదం భగవంతుని సర్వసాక్షి అంటుంది. అట్లాంటి సాక్షీభూతుడైన పరమాత్మ ఒక చోట వుండి మరొకచోట లేకుండాపోడు. ఎక్కడెక్కడ ఆయన సృష్టివుందో అక్కడంతా ఆ జగదేశ్వరుడుంటాడు. అందుకే సర్వవ్యాపి అంతర్యామియైన ఆ పరమాత్ముని అంతటా వున్నాడనే విశ్వాసంతో ఉపాసించాలి, కాని ఒకేచోట ఈశ్వరుడున్నాడనే భావంతో కాదు. భగవంతుని ఖండించి విభజించుటకు వీలు లేదు.

బ్రహ్మతత్త్వం జగత్తులో గొప్పది. ఆకాశాదులకంటే పెద్దది. అది అద్వితీయం. అది స్వయం జ్యోతి స్వరూపం. లోకంలోని వస్తువులను, పదార్థాలను ఇంద్రియాల ద్వారా తెలుసుకోవచ్చును. మనస్సులో వాటి రూపాన్ని ఆలోచించవచ్చు. కాని బ్రహ్మస్వరూపం అట్లా ఆలోచించేందుకు వీలులేనిది, వీలుకానిది. అది గొప్ప విభుపదార్థం. అది ఎప్పుడూ ఒక్కటిగా వుంటుంది. అది మార్పులేనిది. అది అవినాశితత్త్వమని వేదమంటుంది.

**అపాణి పాదో జవనో గ్రహీతా**
**పశ్యత్యచక్షుః స శృణోత్య కర్ణః।**
**స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా**
**తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్॥** (శ్వేతాశ్వతర ఉపనిషత్)

పరమాత్మునకు చేతులు లేవు కాని, తన అనంత శక్తితో ఈ ప్రపంచాన్ని నిర్మిస్తాడు, గ్రహిస్తాడు, పోషిస్తాడు. ఆయనకు కాళ్లు లేవు కాని సర్వ వ్యాపకుడు కావడం వలన అన్నిటికంటే వేగంగా వుంటాడు. ఆయనకు కన్నులు లేవుకాని, సమస్త బ్రహ్మండాన్ని వున్నది వున్నట్లుగా చూస్తాడు. ఆయనకు చెవులు లేవు కాని, అందరి మాటలు వింటాడు. ఆయనలో అంతఃకరణ లేదు కాని సమస్త జగత్తును తెలుసుకుంటాడు. అన్నీ ఆయనకు తెలుసు కాని ఆయనను సంపూర్ణంగా తెలుసుకున్నవారు లేరు. ఆయన సనాతనుడు. సర్వశ్రేష్ఠుడు మహా పురుషుడని అదొక విలక్షణ తత్త్వమని ఉపనిషత్ శ్లాఘిస్తుంది.

వేదం ఉపనిషత్ వాక్యాల ద్వారా పర తత్త్వం అంటే ఏమిటో కొంత బోధ పడుతుంది. మనం ఉపాసించే దైవం మన లాగే వుంటుందని దానికి ఆకలి దప్పికలు, సుఖదుఃఖాలు, మానావమానాలు, శీతోష్ణాలు వుంటాయని భ్రమ పడుతున్నాము. కాని వేదంలోని పరమాత్ముడు వీటన్నిటికి అతీతుడు. అతనికి భార్యాబిడ్డలు, బంధుమిత్రులు వుండరు. అతడు పరంధాముడు, అందరికి ముక్తిని ప్రసాదించేవాడు. సృష్టి స్థితి, లయలకు కర్త. ఆ భగవంతుడు ఈ జగత్తును సృజించేందుకు ఎవరి సహకారం తీసుకోడు. అందుకే వేదం ఆ వేద పురుషుని సర్వశక్తిమంతుడని కీర్తిస్తుంది.

మనం భగవంతుని సత్య స్వరూపాన్ని తెలుసుకోవాలంటే వేదాన్నే ఆశ్రయించాలి. ఆ వేద భగవానునే ఉపాసించి తరించాలి.

**లోకాః సమస్తా స్సుఖినోభవంతు**

*(ఈ శీర్షిక ఇంతటితో సమాప్తం)* 

# వానపాముల వ్యాపారం




ప్రపంచంలో అధికంగా మానవులకు సాయం చేసే జీవి తెలుసా? ఆవు.. గేదె.. కుక్క... ఇవన్నీ కావు. వానపామే మనిషికి మంచి నేస్తం.

రైతు విత్తనం నాటేందుకు అనువుగా పొలాన్ని సిద్ధం చేసే వానపాము మనిషికి అత్యంత సహాయకారి. అమెరికాలో టెర్రా సైకిల్ కంపెనీ రైతులకు వానపాముల మ్మే వ్యాపారం చేస్తుంది. ఇళ్ల యజమానులు తమ పెరటితోటల కోసం వీటిని అధికంగా కొంటున్నారు. అమెరికాలోని నేషనల్ చెయిన్స్ అయిన వాల్‌మార్ట్, టార్గెట్, హోమ్ ఫుడ్స్, హోమ్ డిపోలాంటి సూపర్ బజార్లలో ఇవి దొరుకుతున్నాయి. అమెరికా, కెనడాల్లో ఇవి మొత్తం పదివేల దుకాణాల్లో లభ్యమవుతున్నాయి.




టెర్రా సైకిల్ కంపెనీ భాగస్వామి టామ్ సాకీ. 2004లో అతను దీన్ని స్థాపించినప్పుడు 70 వేల డాలర్ల విలువగల వానపాములను అమ్మాడు. 2005కు వీటి అమ్మకాలు ఐదులక్షల డాలర్లకు, 2006కు పదిహేను లక్షల డాలర్లకు, 2007కు నలభై అయిదులక్షల డాలర్లకు పెరిగాయి. 2008లో ఎనభై అయిదు లక్షల డాలర్ల విలువగల వానపాములు అమ్ముడవుతాయని అంచనా.

వానపాములు ప్రకృతి సహజంగా రీసైక్లింగ్ చేస్తాయి. అవి చెత్తను తింటాయి. అవి వదిలే వ్యర్థ పదార్థం చక్కటి ఎరువుగా ఉపయోగపడుతుంది. నేలలో మొక్కల వేళ్లు పాకేందుకు ఈ వానపాములు చక్కటి దారిని చేస్తాయి.

సాకీ తొమ్మిదో ఏట, అతడి తల్లిదండ్రులు హంగరీలోని సోవియట్ పాలన నుంచి పారిపోయి కెనడాకు వచ్చారు. ప్రిన్స్‌టన్ యూనివర్సిటీలో చదువుకున్న సాకీ 2003లో తన మిత్రుడు పెంచే మార్జువానా మొక్క బాగా పెరగడం గమనించి దాని రహస్యాన్ని శోధించాడు. దానికి కారణం వానపాముగా గుర్తించాడు. వాటిమీద వెలువడే ఎర్త్‌వామ్ డైజెస్ట్ అనే పత్రికలను చదివి, వాటిని పెంచే విధానం తెలుసుకున్నాడు. మరో రియల్ ఎస్టేట్ వ్యాపారి సాకీ ఐడియా విని వానపాముల వ్యాపారానికి తగిన పెట్టుబడి పెట్టాడు. రీసైకిల్ చేసిన సీసాల్లో వానపాములను నింపి అమ్మసాగాడు సాకీ.

వాల్‌మార్ట్ కంపెనీకి ఫోన్ చేస్తే ఎవరూ ఎత్తలేదు. రోజుకు పదిసార్ల చొప్పున ముప్పై రోజులపాటు ఫోన్ చేస్తే గాని, వారి కొనుగోలు విభాగాన్ని కాంటాక్ట్ చేయలేకపోయాడు. కెనడాలో ఇతని వ్యాపారం మీద డాక్యుమెంటరీని టీవీలో ప్రసారం చేశాక, 'ది న్యూయార్క్ టైమ్స్'లో ఓ వ్యాసం వచ్చాక అతని వ్యాపారం బాగా అభివృద్ధి చెందింది.




# బ్యూటీక్వీన్

సాయంత్రం ఆరున్నర! కనుచీకటి పడుతున్న వేళ! విశాల్ కారు ట్యాంక్‌బండ్ పైకి వచ్చేసరికి హఠాత్తుగా మబ్బులు కమ్మి, వర్షం మొదలైంది. తలదాచుకోవడానికి జనం చెల్లాచెదురుగా పరుగులు తీయడం అతనికి తమాషాగా ఉంది..

ఎవరైనా అందమైన అమ్మాయి లిఫ్ట్ అడిగితే బావుణ్ను!

ఈ చలిగాలిలో.. ముందుసీట్లోకి ఎవరైనా అందగత్తె వచ్చి పక్కన వెచ్చగా కూర్చుంటే ఎంత బావుంటుందో? గత వారం తన కొలీగ్ సుధీర్‌గాడికి అలాంటి అందమైన అనుభవమే ఎదురైందట! అతని ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయి.. తడిసిన బట్టల్లో దిక్కుతోచక పరుగులు పెడుతున్న అమ్మాయిల అందాలను కళ్లతోనే జుర్రుకుంటూ మెల్లగా డ్రైవ్‌చేస్తున్నాడతను.

అంతలో- అతని కళ్లు ఆనందంతో ఒక్క




ట్యాంక్‌బండ్ 13 కథలు

సారిగా మెరిశాయి.

అల్లంత దూరంలో-

అనుష్కలాంటి పొడగరి యువతి లిఫ్ట్ అన్నట్లు బొటనవ్రేలు చూపుతూ కన్పించింది.. రెండోచేతిలోని హ్యాండ్ బ్యాగ్ తలతడవకుండా ఆమెను కాపాడు తోంది. అయినా అప్పటికే తను పూర్తిగా తడిసిపోయింది. వెంట్రుకల మీద నుంచి ముఖం మీదకి... అక్కడి నుంచి ఒంపు సొంపుల దేహంపైకి నీటి బిందువులు

ఆబగా జారిపోతున్నాయి. టైట్ జీన్స్‌లోకి వైట్ టీ షర్ట్ టక్ చేసి, ఎక్కడికక్కడ చెక్కిన శిల్పంలా కన్పిస్తున్న ఆమెను చూసి అప్ర యత్నంగా అతని నోటినుండి విజిల్ వెలు వడింది.

కారును ఆపి ఆమె ఎక్కడానికి వీలుగా డోర్ తెరిచాడతను. కానీ ఆమె ఎక్క లేదు..

సర్ ఎక్స్‌క్యూజ్ మీ!.. ఇద్దరూ టూ ఓల్డ్ సర్! ఆయనకు కాలు విరిగినట్లుంది విలవిల్లాడుతున్నారు.. ఆమె హైబీపీతో అల్లాడుతున్నారు.. ఆటోలు ఒక్కటీ రావ డంలేదు.. వచ్చినా ఆగడంలేదు.. ప్లీజ్ ఎలాగైనా మీరే కాపాడాలి సార్'... అంటోంది వేమన విగ్రహం వెనుకవైపుకు ఆందోళనగా చూస్తూ.

అతనికేం అర్థం కాలేదు..

'ఏమిటీ? ' అన్నాడు.

'ఎవరో ఇద్దరు ఓల్డేజి కపుల్ సార్! షికార్‌కు వచ్చినట్లున్నారు.. ఇందాక వానొ చ్చినప్పుడు ఆ విగ్రహం వెనుకవైపు కూర్చున్న ఆయన వేగంగా మెట్టుదిగ బోతూ కాలుజారి పడిపోయారు.. ఫ్రాక్చర్ అయినట్లుంది.. ఆయన స్థితి చూసి ఆమెకు...'

'స్టాప్ నాన్సెన్స్! ఎవరో కాలిరిగిన ముస లాళ్లను ఎక్కించుకోడానికి ఇదేం అంబు లెన్స్ కాదు.. యూ కాల్ ఒన్ జీరో ఎయిట్! మీకు లిఫ్ట్ కావాలంటే

ఎక్కండి..' అంటూ విసురుగా డోర్ వేసుకున్నాడు విశాల్ చిరాకుగా.

ఆమె ప్లీజ్ ప్లీజ్ అంటున్నా విన్పించుకోకుండా కారును ముందుకు కదిలించాడు.

'ఛ.. అనుకున్నట్టే అందగత్తె లిఫ్ట్ అడిగింది కానీ ఇలా అయిందేమిటి? అయినా ఆ ముసలి గోల తనెక్కడ పడగలడు?' అనుకున్నాడతను రెండు నిముషాలు గడిచాక.

తర్వాత తనే 'ఛ.. నిజంగా పొరపాటే చేశాడు తను. అలాంటి బ్యూటీ లిఫ్టడిగితే

**ఆమె ప్లీజ్ ప్లీజ్ అంటున్నా విన్పించుకోకుండా కారును ముందుకు కదిలించాడు.**

**'ఛ.. అనుకున్నట్టే అందగత్తె లిఫ్ట్ అడిగింది కానీ ఇలా అయిందేమిటి? అయినా ఆ ముసలి గోల తనెక్కడ పడగలడు?' అనుకున్నాడతను రెండు నిముషాలు గడిచాక.**

ఏ వెధవైనా ఇస్తాడు.. ముసలాళ్లను కార్లో ఎక్కించే సాకుతో ఆమెనుతాకుతూ ఆనందాన్నీ పొందుతాడు. ఆమె దృష్టిలో పరోపకారిగా మార్కులు కొట్టేస్తాడు. ముందు సీట్లో కూర్చుని ఆమె కుమిలిపోతుంటే మరేం భయంలేదు.. టెన్షన్ పడకండి అంటూ భుజంపై చేయివేసి ధైర్యం చెబుతాడు. దేవుడు మేలుచేస్తే ఈ ప్రథమ పరిచయమే వాళ్లిద్దరి మధ్య మరింత దగ్గరితనానికీ దారితీయొచ్చు. అనవసరంగా మంచి ఛాన్సు మిస్ చేసుకున్నానే' అనుకున్నాక విశాల్ కారు ఒక్కడుగు కూడా ముందుకు నడవనంది.

ఈ పాటికి ఎవడో తల మాసినవాడు ఆమెకు లిఫ్ట్ ఇచ్చేశాడేమో? తను కారు వెనక్కుతిప్పడానికీ లేదు.. రివర్స్‌లో వెళ్లడానికీ లేదు.. సరే ఇక్కడే కదా నడిచే వెళ్దాం అని కారును రోడ్డు పక్కన ఆపి దిగి వెనక్కు నడిచాడు.

అతను ఊహించినట్లే వేమన విగ్రహం వద్ద ఎవరిదో కారు ఆగి ఉంది. సికింద్రాబాద్ వైపు నుంచి వస్తున్న వాహనాల హెడ్‌లైట్ల కాంతిలో ఎవరినో ఇద్దరు ఒక మ్మాయి.. ఒకబ్బాయి.. భుజాలపై చేతులువేసి తీసుకొచ్చి అందులో ఎక్కిస్తున్న దృశ్యం కన్పిస్తోంది..

అర్రే.. ఛాన్స్ కొట్టేశార్రా వాడెవడో... ఆ ముసలాయన వీపుపై చేతులు వేసి నడిపిస్తోంది ఆ బ్యూటీక్వీనే కదూ! ఆ పక్కన ఉన్నవాడు ఆ అదృష్టవంతుడన్నమాట. ఛ ఎలాంటి ఛాన్స్ మిస్‌చేసుకున్నాడు తను. అతని మనసు బాధతో మూలిగింది.

అవును.. ఆ పెద్దాయన ఎవరో నడవలేక నడవలేక కాలు ఎత్తిపట్టి నడుస్తున్నాడు? అవును.. ఆ ఆకారం ఎక్కడో చిరపరిచితమైనదే! హైడ్‌లైట్ల వెలుగులో కీనీడలే తప్ప ఆనవాలు స్పష్టంగా తెలియడంలేదు.. మరింత దగ్గరకు వెళ్తే తప్ప అర్థంకాదనుకుంటా.

మరి కొంతదూరం ముందుకు నడిచాడు విశాల్. ఎవరో ఆడమనిషిని ఎత్తుకుని తీసుకువస్తున్నారు వాళ్లు.

పోనీ ఇప్పుడెళ్లి- రండి.. రండి! నా కారులో లిఫ్ట్ ఇస్తానంటే ఎలా ఉంటుంది? ఆ అందాల జీన్స్ సుందరి ఏమనుకుంటుంది? ఛఛ అస్సలు బాగోదు.. ఇవ్వాళ మన ప్రాప్తం ఇంతే.. తను దగ్గరకు వెళ్లేసరికి ముసలావిడ్నికూడా కారెక్కించేశారు..

ఆ వెధవ.. అదే ఆ అదృష్టశాలి తననుకున్నట్లే ముందుసీట్లో బ్యూటీక్వీన్‌ను కూర్చోబెట్టుకుని తుర్రుమన్నాడు.

రెండు నిముషాలక్కడే నిలబడి తన

# అలా నిర్ణయిస్తే ఎలా?



**ర**ష్యాలోని ఉల్యానోవ్‌స్క్ ప్రాంతంలోని అధికారులు తగ్గిపోతున్న జననాల నేపథ్యంలో సెప్టెంబర్ 12, 2008ను 'ఫ్యామిలీ కాంటాక్ట్ డే'గా పాటించారు. తర్వాత ఏడాది రానున్న రష్యన్ రాజ్యాంగ దినానికి ఇది సరిగ్గా తొమ్మిది నెలల ముందురోజు. రాజ్యాంగ దినానికి చాలా జననాలు కలగాలన్న కోరికతో ఆ ప్రాంత గవర్నర్ ఈ దినాన్ని ప్రకటించాడు. జూన్ 12న బిడ్డకి జన్మనిచ్చే తల్లిదండ్రులకు టీవీ, కారులాంటి అనేక బహుమతులను కూడా ప్రకటించారు.




ఇదిలా వుండగా స్థానిక మానవహక్కుల నేత ఒకరు, 'గవర్నర్ మనం ఎప్పుడు సెక్స్‌లో పాల్గొనాలో, ఎప్పుడు బిడ్డని కనాలో ఆర్డర్స్ జారీచేయడం బాగాలేదు' అంటూ సన్నాయి నొక్కులు నొక్కుతున్నాడట.

దురదృష్టాన్ని తిట్టుకుంటూ తన కారువైపు నడవబోయిన విశాల్ కాలికి ఏదో తగిలి కిందకు చూశాడు.

అదో చెప్పు..

లేడీస్ వాడేదే.. తను ఎన్నోసార్లు చూసిందే! అవును ఇది అమ్మదే కదూ? అవును మూడ్నెల్లక్రితం తను కాన్పూర్ వెళ్లినప్పుడు అమ్మ కోసం తెచ్చాడు.. అంటే-

అతని గుండె బద్దలైంది..

గొంతులోంచి 'అమ్మా..' అన్నకేక దిక్కులు పిక్కటిల్లేలా వెలువడింది. అంటే- ఆ ముసలాయన నాన్నగారా? వాళ్లసలు ఇక్కడికెందుకు వచ్చారు?

అయ్యో తనెంత పాపిష్ఠివాడు.. తల్లిదండ్రులు కష్టాల్లో ఉంటే తను అమ్మాయిల అందాలను కళ్లతో జుర్రేస్తూ.. ఛీఛీ!

★ ★ ★

రెండు గంటల తర్వాత-

కేర్ ఆస్పత్రిలో వేర్వేరు బెడ్‌ల మీద అపస్మారక స్థితిలో పడున్న తల్లిదండ్రులను చూస్తూ తల బాదుకుంటున్నాడు విశాల్. అతని కళ్లనుంచి నీళ్లు ధారాపాతంగా ప్రవహిస్తున్నాయి.

అల్లంత దూరంలో కుర్చీమీద కూర్చుని భావరహితంగా అతన్నే చూస్తోంది ఆ బ్యూటీక్వీన్..

ఐదునిముషాల తర్వాత ఆమె వద్దకు వచ్చిన విశాల్ సూటిగా ఆమె ముఖంలోకి చూడలేక తలదించుకున్నాడు. ఆమె ముందు నిలబడడం అతనికి అగ్నిలో నుంచున్నట్లుంది. ఆమె ముందు తనో మరుగుజ్జులా అన్పిస్తున్నాడు. తన చదువు, సంపద, అంద చందాలు ఆస్తులు అన్నీ దిగదుడుపేనన్పించింది. తనపై తనకే రోత, జుగుప్స కలుగుతున్నాయి. మరేంమాటాడలేక ఆమె పాదాలపై పడి బావురుమన్నాడతను.

*–చంద్రప్రతాప్*

# కథ వెనుక కథ



# ఆరునెలల్లో మూడు భాషలు! 'అక్షింతలు'

ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి

అక్షరాలు చిన్నవే. కడుపులో దాచుకున్న భావాలను వ్యక్తంచేసే సందర్భాల్లో అవే అక్షరాలు హిమశైల శిఖరాలంత సమున్నతాలు. అవి చెప్పే కథలూ అంతే! అన్నికథలూ ఒకేలా ఉండవు. కొన్ని అంతులేని ఆహ్లాదాన్ని అందిస్తూ సరదాసరదాగా సాగి కాలక్షేపానికి పనికొస్తే.. మరికొన్ని సామాజిక దర్పణంలా నిలిచి వాస్తవాలకు సరికొత్త ముఖాల్ని ఆవిష్కరిస్తాయి. ఇంకొన్ని అడ్డగోలు సంప్రదాయాలు, ఆచారాలపై కత్తులు దూస్తాయి. వ్యంగ్యాస్త్రాలు సంధిస్తాయి. అయితే ఏకొన్ని కథలో తప్ప పుట్టిన అన్ని కథలూ బతికి బట్టకట్టలేవు.. ప్రియపాఠకుల గుండెల్లో చోటు దక్కించుకోలేవు. అవడానికి చిన్నకథే అయినా 'అక్షింతలు' ఎందరి గుండెల్లోనో గూడు కట్టుకుంది.. కేవలం ఆరునెలల వ్యవధిలో మూడుభాషల్లోకి వెలువడి మూడు రాష్ట్రాల ప్రజల్ని అలరించింది. ఆ చిన్నికథ 'కథ వెనుక కథ' అంటే.. పుట్టుక, ప్రచురణ, స్పందన, ఇతరభాషల్లోకి అనువాదమైన తీరుతెన్నులపై ఇలా ఆసక్తికరంగా చెబుతున్నారు రచయిత్రి ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి..

విశ్వకథావేదిక 'విపుల' 2008 జనవరి సంచికలో 'అక్షింతలు' ప్రచురితమైంది. ఎందరో బాగుందని ప్రశంసించారు. సన్నిహిత మిత్రులు- మంచికథ రాశావని ఫోన్‌లో అభినందించారు. అప్పట్లో 'చిత్తగింపు' పేరిట కథలపై పాఠకుల సమీక్షలు వచ్చేవి.. అందులో భాగంగా ఈ కథావిశ్లేషకుడికి బహుమతి లభించడమూ నాకు గర్వకారణంగా తోచింది. ఒక చిన్నకథకు అంత స్పందన రావడం ఆనందంలో ముంచెత్తింది. అంతటితో అవలేదు.. ఒక సాహితీ సమావేశంలో కలిసిన ప్రముఖ రచయిత్రి శాంతాదత్ ఈ కథ చదివానని, తనకెంతో నచ్చిందని చెబుతూ తమిళభాషలోకి అనువదిస్తానని తెలియజేసారు. నేను సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతుం



జనవరి'08 విపులలో 'అక్షింతలు' కథకు వేసిన చిత్రం

డగా ఇదేకథ చదివిన కన్నడ రచయిత్రి సులోచన (శార్వాణి సోదరీమణి) ఎంత గానో మెచ్చుకుని 'విపుల' కార్యాలయానికి ఫోన్‌చేసి నా వివరాలు తెలుసుకుని నన్ను ఫోన్‌లో సంప్రదించారు. ఇంత మంచి కథను కన్నడ పాఠకులు తప్పకుండా చద వాలనీ, తానే కన్నడంలోకి అను వదిస్తానని ఆమె చెప్పారు. చా లా ఆనందం కలిగింది.. అం తేకాదు...'విపుల' ఘనత ఏమిటో కూడా అర్థమైంది. ఎందరో సాహిత్యాభిమానుల ప్రశంసలు చూరగొన్న 'విపుల' లో ఓ చిన్నకథ వస్తే ఇంత స్పందనా? ఇతర భాషలకు కూడా పాకడమా? ఆశ్చర్యపో యాను. చాలా సంతోష పడ్డాను. ఆరునెలలు తిరక్కుం డానే 'అక్షింతలు' తమిళ, కన్నడభాషల్లోకి అనువాదమై అక్కడి పాఠకుల ప్రశంస లను సైతం చూరగొంది. తమిళ పత్రిక 'మంజరి' జూన్ సంచికలో 'అచ్చాదై' పేరుతో, కన్నడ పత్రిక 'మయూరి' జులై సంచికలో 'అక్షతె' పేరుతో ఈ కథ ప్రచు రితమైంది.

***ఇదీ కథ:***

అన్నపూర్ణకి భక్తి ఎక్కువ. పూజలు, పునస్కారాలు చేస్తుంటుంది. పువ్వులు, పసుపు, కుంకుమ, అక్షింతలు... అన్నీ చేతి నిండుగా ఉంటేనే ఆమెకు సంతృప్తి. ప్రతి



తమిళ పత్రిక 'మంజరి'లో కథకు వేసిన చిత్రం

రోజూ ఎక్కువ మొత్తంలో బియ్యంతో అక్షింతలు కలిపి దేవతార్చన చేస్తుం టుంది. పనిమనిషి కూతురు రాగిణి తన తల్లి అనారోగ్యం కారణంగా అన్నపూర్ణ ఇంటికివచ్చి పనులు చేస్తుంటుంది. అన్న



పూర్ణ అక్షింతలను ఎక్కువమొత్తంలో కలుపుతుండడం చూసి ఆమె మనసు చివుక్కుమంటుంది. ఆ బియ్యమే ఉంటే రెండు గ్లాసుల నూకలో లేక మూడు గ్లాసుల పిండో అవుతుందికదా? తమ ఆకలి తీరుతుందికదా అని బాధపడుతుంది. బతికున్నన్నాళ్లూ తాగుడికి బానిసై తండ్రి ఇల్లుగుల్ల చేయడమే కాకుండా తమను దుర్భర దరిద్రంలోకి నెట్టేశాడు. ఇంట్లో ఆకలికి తాళలేక తమ్ముడు ఏడ్వడం ఆమెకు గుర్తొచ్చి కళ్లు చెమ్మగిల్లుతాయి. అన్నపూర్ణ కోవెలకు వెడుతూ పూజచేసిన అక్షింతలను చెట్లమొదళ్ల లో పోసిపోతుంది. ఆమె వెళ్లగానే ఇంట్లోనే ఉన్న రాగిణి మొక్కల మొదళ్లలో పోసిన ఒక్కో గింజని ఏరి భద్రంగా మూటగట్టుకుని ఇంటికి తీసుకెళ్తుంది. మట్టి, పసుపూ లేకుండా శుభ్రంగా కడిగి గంజికాస్తుంది. ఇంత ఉప్పువేసి తల్లికి, తమ్ముడికిచ్చి తానూ కొంత తాగుతుంది. మర్నాడు పనికివెళ్లిన రాగిణికి అన్నపూర్ణ కేవలం చెంచాడు బియ్యంతో మాత్రమే అక్షింతలు తయారుచేయడం ఆశ్చర్యం కలిగిస్తుంది. కొద్దిగా నిరాశ పడుతుంది కూడా!

అయితే అనూహ్యంగా యజమానురాలు గ్లాసులోని బియ్యాన్ని కవరులోపోసి ఆమెకు తీసుకెళ్లమని ఇస్తుంది. ఆశ్చర్యపోవడం రాగిణి వంతవుతుంది. ఈ మార్పు రావడానికి కారణం... మరిచిపోయిన అగరుబత్తీలు తీసుకునేందుకు వెనక్కివచ్చిన అన్నపూర్ణ తాను మొక్కల మొదళ్లలో పోసిన అక్షింతలను

## అక్టోబరు-08
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం - ఖైరతాబాద్, హైదరాబాద్
2. టి. దుర్గాసంయుక్త - శ్రీకాకుళం
3. పి.విజయలక్ష్మి - ఏలూరు, ప.గో జిల్లా
4. కె.శివశంకరరెడ్డి - అక్కాయపల్లె, కడప
5. పూకాటి ప్రవీణ - పొదలకూరు, నెల్లూరు జిల్లా



అసంఖ్యాకంగా స్పందనలు రావడంతో అందరి పేర్లు ప్రచురించలేకపోతున్నాం.

**సరైన జవాబులు**

1. చినలింగాయపాలెం 2. గోపాలరావు 3. టొబాకో 4. తౌఫిక్ 5. మాల్యాద్రి 6. ఆరో తరగతి 7. శ్రాద్ధం 8. 1991 9. అనసూయమ్మ 10. వెర్నర్

పనిపిల్ల అతిభద్రంగా ఏరుకుంటున్న దృశ్యాన్ని చూడడమే! ఆ తర్వాత పనిమనిషి ఇంటి పరిస్థితిని ఆరాతీసిన ఆమె 'తనపై చల్లేకంటే నీకిస్తేనే దేముడు ఎక్కువగా ఆనందిస్తాడని' చెబుతుంది. ఆకలి తీర్చే బియ్యాన్ని అక్షింతలుగా మార్చి దైవ కృప పొందేకన్నా, పేదలకిస్తేనే దేవుడు మరింత సంతోషిస్తాడనే సత్యాన్ని అన్నపూర్ణ గ్రహిస్తుంది.

నిడివి చిన్నదైనా కథలో ప్రస్తావించిన అంశం ఉదాత్తం కావడంతో చదువరులందరినీ ఈ కథ కదిలించింది. కథకురాలిగా నాకు మంచిపేరు తెచ్చిపెట్టింది.

*ప్రేరణ ఇదే!*

అంతకు క్రితం రోజు ఒకసారి బంధువుల ఇంటికి వెళ్లినపుడు ఆ ఇంట్లో మామ్మగారు అచ్చం కథలో అన్నపూర్ణలాగే ఒక పాత్రనిండా బియ్యం తీసుకుని ప్రతిరోజూ అక్షింతలు కలపడం గమనించాను. పూజ కోసం తయారుచేసే అక్షింతలు ఎవరూ నిల్వ ఉంచుకోరు కదా. ఏరోజుకారోజే వాడేసుకోవాలి. ఆ లెక్కన సదరు మామ్మగారు నెలకు సుమారు నాలుగు కిలోల వరకూ అక్షింతల కోసం బియ్యం కలపడం వృథా అన్పించింది. భక్తిపేరుతో వాటిని అలా వృథాచేసే కంటే కొద్దిమొత్తంలో అక్షింతలు తయారు చేసుకుని మిగిలిన బియ్యాన్ని ఏ ముష్టివాడికి వేసినా వాడి ఆకలి తీరుతుంది కదా అన్పించింది. లేదా.. ఇంట్లోనే వండి పనిమనిషికి పెట్టినా ఒకరి ఆకలి తీరుతుందనిపించింది. ఈ ఆలోచనల నుంచే 'అక్షింతలు' కథ ఊపిరిపోసుకుంది. థ్యాంక్స్ టు విపుల!" అంటూ నవ్వుతూ ముగించారు సుబ్బలక్ష్మి. తాను బర్కత్‌పురాలోని రీజనల్ ప్రావిడెంట్ ఫండ్ కమిషనరు ఆఫీసులో సెక్షన్ సూపర్‌వైజర్‌గా పనిచేస్తున్నట్లు సంభాషణల నడుమ ఆమె వెల్లడించారు.

సేకరణ: పివిడిఎస్ ప్రకాష్

కాలాతీతం




# ది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ

హెన్రీ జేమ్స్ కథల్లో పేదవాళ్లుండరు. పాత్రలందరూ విలాసవంతమైన జీవితాలు గడుపుతున్న సంపన్నులే. అమెరికా, యూరోప్‌ల మధ్య తరచుగా ప్రయాణిస్తూ, విశాలమైన కంట్రీహౌసెస్‌లో, లేదా ఇటాలియన్ విల్లాలు, పాలెస్‌లలో అనువంశికంగా సంక్రమించిన కళాఖండాల మధ్య కూర్చుని తీరికగా చర్చించుకునే కులీనులే.

ఒక యువతి తనేమిటో తెలుసుకోవటానికి చేసిన ప్రయత్నమే యిందులోని కథాంశం. ఇలాంటి కథల్లో సహజంగానే నాటకీయ సంఘటనలకన్న కథనం, పాత్ర చిత్రణ, అంతస్సంఘర్షణలు, తాత్విక దృక్పథాలను గురించిన చర్చలకే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుందని మనకు తెలుసు. అల్బానీ (న్యూయార్క్)లో ఉంటున్న యిరవై మూడేళ్ల ఇసాబెల్ ఆర్చర్ మంచి అందగత్తె. స్వతంత్ర భావాలుగల యువతి. ఈ జీవితం తనకోసం ఏం దాచింది? స్వేచ్ఛనా, బాధ్యతనా, నమ్మక ద్రోహమా అనేవాటిని అన్వేషించాలనుకుంటుంది. అవును, ఎవరి జీవితం వాళ్లకో సాహసయాత్రే!

1872 వేసవిలో తండ్రి మరణం తర్వాత, తన ఆంటీ లిడియా టూషెట్ వెంట



కొంతకాలం పాటు ఇంగ్లాండులో గడపటానికి అంగీకరిస్తుంది. అక్కడ అంకుల్ డేనియల్ టూషెట్, కజిన్ రాల్ఫ్ (లిడియా, డేనియల్‌ల సంతానం, జబ్బుమనిషి) ఇసాబెల్‌ను తమ గార్డెన్‌కోర్ట్ ఎస్టేట్‌కు ఆహ్వానిస్తారు. ఇసాబెల్ ధైర్యంగా, సూటిగా, కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడటం అతడికి బాగా నచ్చింది. ముఖ్యంగా ఆమెది మంచి మనసు. పొరుగున ఉన్న లాక్‌లీ ఎస్టేట్ యజమాని లార్డ్ వార్బర్టన్ యువకుడు, అందగాడు. ఒకనాడు మధ్యాహ్నం టీ పార్టీకి వచ్చి ఆమెతో ప్రేమలో పడతాడు. ఇసాబెల్‌కు కూడా అతడంటే యిష్టం లేకపోలేదుగాని, ప్రేమ కోసం స్వేచ్ఛను వదులుకోవాలా? లోలోపలే రాల్ఫ్ కూడా ఆమెను ఆరాధిస్తాడు. అయితే అది పెళ్లిగా పరిణమించే అవకాశం లేదని అతడికీ తెలుసు. జబ్బుమనిషిని చేసుకుని తన జీవితం నాశనం చేసుకుంటుందా! వీలైనన్నాళ్లు ఆమె సాంగత్యంతో గడపగలిగితే చాలు. ప్రపంచ నాగరికతకు కరదీపికలాంటి యూరోపియన్ సంస్కృతి, ఆచార వ్యవహారాల గురించి ఆమెకు సుదీర్ఘంగా బోధిస్తాడు.

ఇసాబెల్‌కు మరో ఇద్దరు అమెరికన్ మిత్రులున్నారు. ఒకరు జర్నలిస్టు హెన్రియెట్టా స్టాక్‌పోల్. స్నేహంకన్నా స్టేటస్ ముఖ్యమనుకుంటుంది. మరొకతను బోస్టన్ మిల్లు యజమాని కాస్పర్ గుడ్‌వుడ్. ఇతడు అమెరికాలో ఉన్నప్పుడే ఒకసారి ఇసాబెల్‌కు 'ప్రపోజ్' చేశాడు. ఆమె తిరస్కరించింది. అయినా ప్రేమ చావదు. ఇంగ్లండులోనైనా కరుణిస్తుందేమోనని గార్డెన్‌కోర్ట్‌కు వస్తాడు. తన మనసు మారలేదంటుంది ఇసాబెల్. మొదట స్వేచ్ఛకున్న పరిమితులేమిటో అవగాహన చేసుకోవాలి. ఆ తర్వాతే పెళ్లి గురించి ఆలోచిస్తుంది.




తండ్రి మరణశయ్య మీదున్నప్పుడు, వీలునామాలో ఇసాబెల్ పేర అరవై వేల పౌండ్లు రాయమని అర్థిస్తాడు రాల్ఫ్. ఆర్థిక భద్రత లేకపోతే ఆమె సత్యాన్వేషణ కొనసాగేదెట్లా?

అయితే ఆస్తి కలసివచ్చిన వెంటనే, ఇసాబెల్‌కు ఒక సొసైటీ లేడీ మదాం మెర్ల్‌తో పరిచయమవుతుంది. ఈవిడ కూడా అమెరికా నుండి యిక్కడికి వచ్చి స్థిరపడింది. అందంతో అందర్నీ ఆకర్షిస్తూ 'పారసైట్'లా బతుకుతున్నానని స్వయంగా చెప్పుకుంటుంది. "తన జాతికే చెందిన మరో వ్యక్తి ఉన్నాడు. ప్రస్తుతానికతడేమీ కాకపోవచ్చుగానీ త్వరలో చాలా పైకి వస్తాడు" అంటూ గిల్బర్ట్ ఆస్మండ్ గురించి చెబుతుంది.

ఆర్నెల్ల తర్వాత మదాం మెర్ల్ వ్యూహం ఫలించి, ఇసాబెల్‌కు ఆస్మండ్‌తో పరిచయమవుతుంది. అతడో ఆర్ట్ కలెక్టర్. కళాఖండాలు పోగు చెయ్యడం అతడి వృత్తి. వీళ్లిద్దర్నీ కలపటానికి మదాం మెర్ల్‌కు బలమైన కారణమే ఉంది. కొన్నేళ్ల క్రితం ఆస్మండ్‌తో వివాహేతర సంబంధం పెట్టుకోవటం వల్ల కూతురు పుట్టింది. ఆ పిల్లకిప్పుడు పదిహేనేళ్లు. పేరు పాన్సీ. తండ్రితోనే ఉంటున్నది. ఇసాబెల్, ఆస్మండ్‌ను చేసుకుంటే ఆర్థికంగా తన కూతురి పరి

# హెన్రీ జేమ్స్

## 1843 – 1916

**జీవితం ఒక కలగూరగంప. అక్కరకొచ్చేవీ, అనవసరమైనవి కూడా అందులో వుంటాయి. ఈ గందరగోళానికో అర్థం కల్పించేది కళ. సాహిత్యమే నా జీవితం, నా ప్రయత్నం, నా మార్గం, నా ఆదర్శం, సృజన**
–హెన్రీ జేమ్స్

ప్రముఖ అమెరికన్ నవలా రచయిత, వ్యాసకర్త, నాటకకర్త, విమర్శకుడు. 'కాస్మోపాలిటన్ నవల' అనే ధోరణికి ఆవిష్కర్త హెన్రీజేమ్స్. అతడు న్యూయార్క్‌లోని వాషింగ్టన్ ప్లేస్‌లో జన్మించాడు. ఇప్పుడక్కడ న్యూయార్క్ యూనివర్సిటీ భవనమున్నది. తండ్రి సీనియర్ హెన్రీ జేమ్స్ ఒక మేధావి, స్థితిమంతుడు. రచయిత అన్నగారైన విలియం జేమ్స్ ప్రముఖ అమెరికన్ తాత్వికుడు, అమెరికాలో సైకాలజీ అధ్యయనానికి ఆద్యుడు. 'ప్రాగ్మాటిజం' అనే లౌకిక దృష్టిని ప్రచారం చేసిన విలక్షణ మేధావి. అన్నదమ్ములు కలిసి ఖరీదైన స్కూళ్లలోనే విద్యాభ్యాసం కొనసాగించారు. హెన్రీజేమ్స్ అయిదేళ్లపాటు విదేశాలలో కూడా చదివాడు. అయితే జ్ఞానార్జనకు టీచర్లకన్న, లైబ్రరీల మీదే ఎక్కువ ఆధారపడ్డాడు. చిత్రకారుడు జాన్ లఫార్గ్, సాహిత్య విమర్శకుడు టి.ఎస్. పెరీల పరిచయం హెన్రీజేమ్స్‌లో రచనాభినివేశం పెంచింది. త్వరలోనే బాల్జాక్, జార్జ్ సాండ్, జార్జ్ ఎలియట్, నతానియెల్ హతార్న్‌లను అపోశనపట్టి సొంత రచనా పద్ధతులు, శైలి ఏర్పరచుకున్నాడు.

రచయితగా 1869-70లలో తొలిసారి యూరోప్‌లో పర్యటించి 'ఎ పాషనేట్ పిల్గ్రిమ్', 'వాచ్ అండ్ హెర్డ్' ప్రచురించాడు. ఆ తర్వాత పుస్తక సమీక్షలు, నాటక, కళా విమర్శలతో పేరుగడించాడు.

1875లో పారిస్ వెళ్లి రష్యన్ రచయిత తుర్గెనేవ్ (తండ్రులూ- కొడుకులూ)తో స్నేహం పెంచుకున్నాడు. ఆయన ద్వారా ఫ్రెంచి రచయితలు ఫ్లాబేర్ (మదాం బావరీ) ఎమైల్ జోలా, మపాసాలతో కూడా పరిచయం కలిగింది. కథలో మలుపులు, మెలికలకన్న సజీవమైన పాత్రలుండటం ముఖ్యమని జేమ్స్‌కు బోధించాడు తుర్గెనేవ్.

1876లో లండన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకుని, 1879లో 'డెయిసీ మిల్లర్' నవల ద్వారా అంతర్జాతీయ ఖ్యాతి గడించాడు. ఇక పుంఖాను పుంఖంగా రచనలు అచ్చ

స్థితి మెరుగు పడుతుంది. కాని ఇసాబెల్‌కీ రహస్యం తెలియదు. పైకి సౌమ్యుడిగా, సంస్కారం మూర్తీభవించిన మేధావిగా కనిపించే ఆస్మండ్‌ను యిష్టపడుతుంది. అతడు నయవంచకుడని, మేకవన్నె పులి అని హితవు చెబుతారు రాల్ఫ్, కాస్పర్. కాని ఇసాబెల్ ఎవరి మాటా వినదు. కొద్ది నెలల్లోనే ఇద్దరూ పెళ్లి చేసుకుంటారు. రోమ్‌లో ఆస్మండ్‌తో పాటు కాపురం మొదట్లో సజావుగానే సాగుతుంది.

పాల పొంగులాంటి ఆకర్షణ తగ్గిన తర్వాత రెండుమూడేళ్లకే ఆస్మండ్ నైజం తెలిసి వస్తుంది.

కూతురు పాన్సీ తాను ప్రేమించిన నెడ్ రోజియెర్‌ను వివాహం చేసుకోకుండా పరో

య్యాయి. 1880-1916ల మధ్య ఆయన సమగ్ర సాహిత్యం వంద సంపుటాలకు మించింది. నవలలు, కథలు, యాత్రా కథనాలు, సాహితీ మూర్తుల జీవిత పరిచయాలు, సమీక్షలు, నాటకాలు, ఆత్మకథా సంపుటాలు, యితరుల పుస్తకాలకు ఉపోద్ఘాతాలు, నోట్ బుక్‌లు, కళావిమర్శ- ఒకటేమిటి- ఆయన సాధించని సాహిత్య ప్రక్రియ లేదు.

హెన్రీజేమ్స్ సాహిత్య ప్రస్థానాన్ని మూడు దశలుగా విభజిస్తారు. మొదటిది అంతర్జాతీయ లేదా అమెరికన్ విమర్శకుల మాటల్లో కాంటినెంటల్ నవలలు. ఇవి 'రోడెరిక్ హడ్సన్', 'ది అమెరికన్', 'యూరోపియన్స్', 'వాషింగ్టన్ స్క్వేర్', 'పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ.' ఆ తర్వాత ఎమైల్ జోలా ప్రభావంతో వాస్తవికతే ప్రధానంగా రాసినవి- 'ది బోస్టోనియన్స్', 'ది ప్రిన్సెస్ కసామసిమా', 'ది ట్రాజిక్ మ్యూజ్.' 1890లో ఈ నవలా రచయిత నాటకాలు రాయాలనుకున్నాడు. కాని, ఎన్ని రాసినా తగిన గుర్తింపు రాలేదు. ప్రదర్శనలేవీ ప్రేక్షకుల మెప్పు పొందలేదు. 'ఈ ప్రక్రియలో అతడు పూర్తిగా విఫలం' అని తీర్మానించారు విమర్శకులు. పరాజయం నుండి పాఠాలు నేర్చుకుని, ఇంగ్లీషు జీవనసరళిని చిత్రించే ప్రయోగాత్మక నవలలకు శ్రీకారం చుట్టాడు జేమ్స్.

ఈ దశలో వచ్చిన 'ది అంబాసడర్స్,' 'ది వింగ్స్ ఆఫ్ ది డాక్,' 'ది గోల్డెన్ బౌల్' ఆయన ఉత్కృష్ట రచనలు. ఒక రకంగా యివి తరువాత వచ్చిన జేమ్స్ జాయిస్, వర్జినియా వూల్ఫ్‌లాంటి మహారచయితల చైతన్య స్రవంతి, యితర శైలీ విన్యాసాలకు దారి చూపించాయంటారు.

ఈయన నవలలు, కేవలం వినోదం కోసం, ఆషామాషీగా చదివి పారెయ్యటానికి వీలుపడదు. జేమ్స్‌ను ఆనందించాలంటే పాఠకుడు కూడా తన మేధస్సుకు, ఆలోచనాశక్తికి పదును పెట్టాలి. పాత్రల మానసిక జీవితానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తాడు జేమ్స్.

యాభైఏళ్లకు పైగా యూరోప్‌లోనే గడిపిన హెన్రీజేమ్స్ తన జీవిత చరమాంకంలో బ్రిటిష్ పౌరసత్వం కూడా స్వీకరించాడు.

'ది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ' ఇతని రచనలన్నింటిలోకి, అత్యుత్తమమైనదని సాహిత్యకారులందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు.

1880-1881లలో ఈ నవల అమెరికాలోని అట్లాంటిక్ మంత్లీ, ఇంగ్లండులోని మాక్మిలన్స్ మాగజైన్‌లలో ఏకకాలంలో సీరియల్‌గా ప్రచురితమై పాఠకులను ఆకట్టుకుని, వెనువెంటనే పుస్తకంగా కూడా వెలువడింది.

క్షంగా అడ్డుతగుల్తుంటారు ఆస్మండ్, మదాం మెర్ల్. రోజియెర్ మరీ పేదవాడేం కాదుగాని, పాన్సీ బాగా ధనికుడినే చేసుకోవాలని వాళ్ల ఆరాటం. రోమ్‌కు వచ్చిన లార్డ్‌వార్ బర్టన్‌ను చూసి అతడైతే బాగుంటుందనుకుంటారు. పాన్సీ, రోజియెర్‌ను ప్రేమించిందని తెలియని ఇసాబెల్, ఆస్మండ్ బలవంతం మీద వార్‌బర్టన్‌ను ఒప్పించటానికి ప్రయత్నిస్తుంది. అతడికి తనంటే యిష్టం గనక, తనమాటను గౌరవిస్తాడు.

ఈ సందర్భంలో ఇసాబెల్ అంతర్మథనం ఒక పెద్ద ఇంటర్నల్ మోనోలాగ్ రూపంలో చిత్రిస్తాడు రచయిత. మానసిక జీవితాన్ని ఆవిష్కరించటానికి చేసిన గొప్ప ప్రయత్నమిది. తరువాత కాలంలో వచ్చిన

చైతన్య స్రవంతికి మూలాలిందులో వున్నాయి.

ఆస్మండ్‌కూ, మదాం మెర్ల్‌కూ ఏదో సంబంధముందని పసిగట్టింది ఇసాబెల్. కాని అదేమిటో స్పష్టంగా తెలియదు. "అందరం బాధపడతాం. కాని కొందరి బాధలో ఉద్విగ్నత వుంటుంది. పాషనేట్‌గా బాధపడతారు. మరికొందరు ఆస్మండ్ లాగ పాషనేట్‌గా ద్వేషిస్తారు కాబోలు..."

వార్‌బర్టన్‌ను పాన్సీ యిష్టపడటం లేదని తెలిసి, వాళ్ల పరిచయానికి అడ్డుకట్ట వెయ్యాలనుకుంటుంది ఇసాబెల్. ఆస్మండ్‌ది పైకి కనిపించని కోపం. లోపల బుసకొడుతున్నా పైకి ప్రేమ ఒలకబోస్తాడు. ఇసాబెల్ అనుకున్నంత పని చేసింది- పాన్సీ, వార్‌బర్టన్‌లను విడదీసింది. ఇక ఆమె మీద ప్రతీకారం తీర్చుకోవటానికి మిగిలిన మార్గమొక్కటే. పాన్సీ, నెడ్ రోజియెర్‌ల వివాహం కూడా జరగటానికి వీల్లేదు. మదాం మెర్ల్‌ది కూడా వ్యాపార మనస్తత్వమే అయినా ఆస్మండ్ అంత క్రూరంగా వుండదు. అయితే ఇసాబెల్‌ను గాయపర్చటానికి మాత్రం వచ్చిన ఏ అవకాశాన్నీ వదులుకోదు. ఆస్మండ్‌తో పెళ్లి తన పన్నాగమేనని చెబుతుంది.

**"ఇది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ మాత్రమేకాదు. పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ సోసైటీ" అన్నారు విమర్శకులు.**

**అతి సాధారణమైన ఈ కథ, వ్యక్తుల ఆలోచనాక్రమాన్ని, ఆ సంక్లిష్టతను ఒక మానసిక శాస్త్రజ్ఞుడి నైపుణ్యంతో పరిశీలిస్తుంది.**

**విలక్షణమైన కథనం, అద్భుత విశ్లేషణా ప్రతిభతో వ్యక్తుల ప్రవర్తనకు మూలాలు వెదికిన క్రమం దీన్ని ఒక 'ట్రెండ్ సెట్టర్'గా నిలిపింది.**

రాల్ఫ్ టూషెట్ జబ్బు ముదిరిందని ఇంగ్లాండు నుండి కబురు వస్తుంది. ఇసాబెల్ ప్రయాణం చెయ్యటానికి వీల్లేదంటాడు ఆస్మండ్. కాని అతడి సోదరి కౌంటెస్ జెమిని ద్వారా పాన్సీ తల్లి మదాం మెర్ల్ అని తెలుసుకుని భర్త ఆంక్షలను ధిక్కరిస్తుంది ఇసాబెల్. రాల్ఫ్ యింక ఎక్కువ రోజులు బతకడని చెబుతారు డాక్టర్లు. తన అన్వేషణలోని చేదు అనుభవాలనతడికి వివరిస్తుంది. ధైర్యంగా, స్వేచ్ఛగా బతకాలనుకున్నది. కాని నయవంచకులు తనను వాడుకున్నారు. 'నీకు తెలుసో, తెలియదో నిన్ను ద్వేషించిన వాళ్లే కాదు, నువ్వే సర్వస్వమని ప్రేమించిన వాళ్లూ వున్నారు' అంటాడు రాల్ఫ్. ఆ వ్యక్తి ఎవరో ఆమెకు బాగానే తెలుసు. కాని పొరబాట్లను దిద్దుకోటానికి సమయం లేదు.

కాస్పర్ గుడ్‌వుడ్ మరోసారి తన ప్రేమను అంగీకరించమని వేడుకుంటాడు. ఇసాబెల్ బాధపడుతున్నదని అతడికి తెలుసు. దానికెవరు కారణమో కూడా తెలుసు. అడ్డుకునే శక్తి మాత్రం లేదు. తన పట్ల ఆమెకూ ప్రేమ లేకపోలేదు. ఆవేశంలో కావలించుకుంటాడు.

"ఇది అనుచితం" అంటూ అతడిని దూరంగా నెట్టి ఆస్మండ్ వద్దకే తిరిగి వెళుతుంది ఇసాబెల్.

"ఇది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ మాత్రమే

కాదు. పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ సొసైటీ" అన్నారు విమర్శకులు. అతి సాధారణమైన ఈ కథ, వ్యక్తుల ఆలోచనాక్రమాన్ని, ఆ సంక్లిష్టతను ఒక మానసిక శాస్త్రజ్ఞుడి నైపుణ్యంతో పరిశీలిస్తుంది.

ఆనాటి రొమాంటిక్ నవలా రచయితలకు అలవాటైన ప్రేమ పరిణామాలు, ఆస్తి కలసిరావటం, అమాయక హీరోయిన్, దుష్ట భర్త, ఒక వాంప్ హీరోయిన్, ఆరాధించే యువకులు ఇందులోనూ వున్నారు. కాని మేధావి పాఠకులను అలరించేది కథ కాదు. విలక్షణమైన కథనం, అద్భుత విశ్లేషణా ప్రతిభతో వ్యక్తుల ప్రవర్తనకు మూలాలు వెదికిన క్రమం దీన్ని ఒక 'ట్రెండ్ సెట్టర్'గా నిలిపింది.

వైరుధ్యాల వలలో చిక్కుకోని వారెవరూ వుండరు. మన హీరోయిన్ సత్యాసత్యాలను అన్వేషిస్తుంటే, పాఠకులు కూడా ఆమె ప్రస్థానంలో పాలుపంచుకుంటారు. పరిపూర్ణం, శాశ్వతసత్యం ఒక భ్రమ. పాక్షిక, తాత్కాలిక సత్యాల ఆధారంగానే మనం నిర్ణయాలు తీసుకుంటాం. ఈ నవలకు ఉపోద్ఘాతంలో జేమ్స్ "సమాజం ఒక జట్కాబండి లాంటిది. కొందరు చక్రాలు. కొందరు బండి. మరికొద్ది మంది అందులో సుఖాసీనులైన ప్రయాణికులు" అంటాడు. సంపదను వారసత్వంగా అనుభవించే వాళ్లు పరుల కష్టాలను అర్థం చేసుకోలేరు.

ఒకరకంగా ఇసాబెల్ అహంకారి. తన తెలివితేటల మీద ఆమెకు అపారమైన నమ్మకం. తన అభిప్రాయాల ప్రకారమే, లోకం నడుస్తున్నదనుకుంటుంది. చివరికి వంచనకు గురయి, రెక్కలు తెగిన సీతాకోక చిలుకలా నేల వాలుతుంది. ఇటువంటి 'మూర్ఖుల' పట్ల కూడా పాఠకులకు సానుభూతి కలిగించటం జేమ్స్ ప్రతిభ.

ఆమెది అనాలోచితమైన నిర్హేతుకమైన ఆదర్శవాదం. మేధావుల, తాత్వికుల కుటుంబంలో పెరిగిన జేమ్స్ ఆత్మగ్లాని గురించిన మీమాంసను హీరోయిన్‌కు ఆపాదించటంలో ఆశ్చర్యం లేదు.

ఇక ఆమెకు ఆస్తి కలిసి రాకపోతే ఈ కథ యిలా ముగిసేది కాదేమో. అంటే రాల్ఫ్ లాంటి ప్రేమికుడే ఆమె కష్టాలకు కారణమా?

మరోచోట, 'వెలకట్టలేని ప్రాచీన నాణెంలా వుంది ఆస్మండ్ వదనం' అంటుంది ఇసాబెల్. అవును భ్రమ, వాస్తవం ఒకే నాణానికి వున్న బొమ్మా బొరుసూ.

'కథ అర్థాంతరంగా ముగిసింది. ఇసాబెల్ యిష్టం లేకపోయినా, తిరిగి భర్త వద్దకు ఎందుకు వెళ్లిందో చెప్పలేదు' అంటూ పాఠకులడిగినప్పుడు రచయిత సమాధానం-

"రచయిత పాత్రలకు కొన్ని డ్యూటీలు కేటాయిస్తాడు. వాటి పని ముగించుకున్న తర్వాత అవి ఎక్కడికెళ్లాయి, ఏం చేశాయన్నది మనకనవసరం" అని జవాబిచ్చాడు జేమ్స్.

★ ★ ★

"ఒక గొప్ప ఆర్కిటెక్టు, తన మేధస్సునంతా వెచ్చించి రూపకల్పన చేసిన భవ్య హర్మ్యం -ది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ. ఇలాంటి బిల్డింగులకు ప్లాన్లు గీయటం ఎంత కష్టమో మరో రచయిత మాత్రమే అర్థం చేసుకోగలడు" అన్నాడు గ్రాహం గ్రీన్.

"ఇంగ్లీషు సాహిత్యంలో వేళ్లమీద లెక్కించదగిన గొప్ప నవలల్లో ఒకటి" అంటూ తన 'గ్రేట్ ట్రెడిషన్' గ్రంథంలో దీన్ని ప్రశంసించాడు ప్రముఖ విమర్శకుడు ఎఫ్. ఆర్. లీవిస్.

– ఎం. వసంత

## చతుర కతలు



# ఔరా... మగడా!

-విశ్వమోహిని

'యువర్ ఎటెన్షన్ ప్లీజ్! ట్రెయిన్ నంబర్ టు-సెవన్-టు-ఎయిట్... గోదావరీ ఎక్స్‌ప్రెస్ ఫ్రమ్ హైద్రాబాద్ టు విశాఖపట్నం... విల్ బీ లీవింగ్ షార్ట్‌లీ ఫ్రమ్ ప్లాట్‌ఫాం నంబర్ వన్...

దయచేసి వినండి! ట్రెయిన్ నంబర్ రెండు-ఏడు-రెండు-ఎనిమిది... హైద్రాబాద్ నుంచి విశాఖపట్నం వెళ్లు గోదావరీ ఎక్స్‌ప్రెస్... కొద్దిసేపట్లో ఒకటో నంబర్ ప్లాట్‌ఫాం నుంచి బయలుదేరుటకు సిద్ధముగానున్నది...

కృపయా ధ్యాన్‌దే! గాడీ సంఖ్యా దో-సాత్-దో-ఆఠ్... హైద్రాబాద్ సే విశాఖపట్నం జానేవాలీ గోదావరి ఎక్స్‌ప్రెస్... థోడీ దేర్ మే ప్లాట్‌ఫాం నంబర్ ఏక్ సే రవాణా హోనే కే లియే తయార్ హై...!

మూడు భాషలలో పెద్దగా వినిపించిన ఆ ఎనౌన్స్‌మెంట్‌కు తుళ్లిపడి లేచి కూర్చుంది జయ. కళ్లు నులుముకుని చుట్టూ చూసింది. తాను రైల్వేస్టేషన్‌లో లేదు. ఇంట్లో బెడ్ మీద వుంది. బెడ్ లాంప్ వెలుతురులో టైమ్ చూసింది. రాత్రి ఒంటి గంట కావస్తోంది.

పక్కనే నిద్రపోతున్న భర్త ఆనందరావు నిద్రలోనే ఆ రైల్వే ఎనౌన్స్‌మెంట్‌ని ఆగకుండా చేసేస్తున్నాడు గొంతు చించుకుని మరీ!

నిద్రమత్తు దిగిపోయింది జయకు. విషయం అర్థమైపోయింది. వారం రోజులుగా అదే వరుస అతను! అర్ధరాత్రి గాఢ నిద్రలో వున్న తరుణంలో- నిద్రలోనే రైల్వే ఎనౌన్స్‌మెంట్ చేసేస్తుంటాడు. బంగారం లాంటి నిద్రను చెడగొట్టేస్తూంటాడు.

చివాలున బెడ్‌మీంచి కిందికి వురికింది జయ. టెలిఫోన్ వద్దకు గెంతి అర్జెంటుగా ఏదో నంబర్‌కి డయల్ చేసింది. అటువైపు నుంచి రెస్పాన్స్ రాగానే "నా...న్నా...!" అంటూ ఓ గావుకేక పెట్టింది.

పొరుగూళ్లో వున్న వినాయక్‌రావ్, కూతురి మిడ్‌నైట్ ఎస్.ఒ.ఎస్. అందగానే మర్నాటి సాయంత్రానికల్లా వచ్చి వాలాడు, "ఏం జరిగింది చిట్టితల్లీ? " అంటూ కంగారుగా.

"నేనెప్పను. ఈ రాత్రికి నువ్వే స్వయంగా తెలుసుకుందువుగాని!" అంది జయ కోపంగా.

రాత్రి తమ బెడ్‌రూం గుమ్మం బైట సోఫా-కమ్-బెడ్‌ని వాల్చి తండ్రికి పక్కవేసింది జయ.

గాఢనిద్రలో వున్న వినాయకరావ్ చెవిలో ఎవరో మైక్ పెట్టి అరచినట్టవ డంతో అదిరిపడి లేచి కూర్చున్నాడు.

'లింగంపల్లి వెళ్లవలసిన ఎమ్మెమ్‌టిఎస్ లోకల్ కొద్దిసేపట్లో పదో నంబరు ప్లాట్‌ఫాం మీదకు వచ్చును...'

'ఎమ్మెమ్‌టిఎస్ లోకల్ ఫ్రమ్ ఫలక్‌నుమా టు లింగంపల్లి విల్ ఎరైవ్ షార్ట్‌లీ ఆన్ ప్లాట్‌ఫాం నంబర్ టెన్...'

'ఫలక్‌నుమా సే లింగంపల్లి జానేవాలీ ఎమ్మెమ్‌టిఎస్ లోకల్ థోడీ దేర్ మే దస్ నంబర్ ప్లాట్‌ఫాం పర్ ఆయేగీ...'

లౌడ్‌గా వినిపిస్తూన్న ఆ రైల్వే ఎనౌన్స్‌మెంట్‌ని ఆలకించి కంగారుపడ్డాడు వినాయక్‌రావు. తాను రైల్వేస్టేషన్‌కి ఎప్పుడు వచ్చాడా అనుకుని కళ్లు నులుముకుని చూస్తే ఇంట్లోనే వున్నాడు. కూతురు బెడ్‌రూం తలుపు బార్లాతెరచి వుంది. కూతురు గుమ్మంలో నిలుచునివుంది. ఎనౌన్స్‌మెంట్ అల్లుడి స్వరంతో బెడ్‌రూం లోంచి వినవస్తోంది!

"చూసావుగా, ఇదీవరస! ఇదంతా నీ నిర్వాకమే" అంది జయ నిష్ఠూరంగా. అయోమయంగా చూసాడతను.

"నిక్షేపంలా ఆయనకో మోటార్‌బైక్ కొనిచ్చేస్తే నాకు రోజూ ఈ అవస్థ తప్పేదిగా! ఇక నా వల్లకాదు. రేపే మీ అల్లుడికి విడాకులిచ్చేస్తాను" అందామె, విసురుగా వచ్చి తండ్రి పక్కలో కూర్చుంటూ.

ఆనందరావు, జయలకు పెళ్ళయి మూడేళ్లయింది. మావగారిచేత ఓ మోటార్‌సైకిల్ కొనిపించుకోవాలన్న ఆనందరావు కోర్కె, కోర్కెగానే మిగిలిపోయింది. వినాయక్‌రావు లేనివాడు కాదు, ఖర్చు చేయడానికి మనసు రానివాడు. భర్త రోజూ సిటీ బస్‌లో ఆఫీసు వెళ్లి రావడం కష్టంగా వుంటోందనీ, మోటార్‌బైక్ కావాలంటున్నాడనీ కూతురు చెబితే, 'మరి ఆ ముక్క నాకింతవరకు చెప్పలేదేం? అల్లుడి సమస్య నా సమస్యకాదూ?' అంటూ వినాయక్‌రావ్ అర్జెంట్‌గా బైటకు వెళ్తే, సాయంత్రానికల్లా హీరోహోండా ఇంట్లో వుంటుందని మురిసిపోయారు దంపతులు. ఆ రోజు ఆఫీసుకు డుమ్మా కొట్టేసి బైక్‌కోసం ఎదురుచూస్తూ ఇంట్లోనే వుండిపోయాడు ఆనందరావు.

ఓ గంట తరువాత, ఎమ్మెమ్‌టిఎస్ లోకల్‌లో సికింద్రాబాద్‌కి ఏడాదికి సరిపడా సీజన్ టికెట్ ఒకటి కొనుక్కొచ్చి అల్లుడి



చేతిలో పెట్టాడు వినాయక్‌రావు. "లోకల్ ట్రెయిన్‌లో ట్రావెల్ చాలా కంఫర్టబుల్. సిటీ బస్‌లకు బై బై చెప్పేయ్' అంటూ.

మావగార్ని ఏమీ అనలేక ఆముదం తాగిన ముఖం పెట్టిన భర్తను చూసి చాటుగా నవ్వుకుంది జయ.



స్తుందేమోనన్న భయం కూడా పట్టుకుంది. పిసినారి తండ్రిచేత మోటార్ బైక్ కొనిపించడానికే భర్తకు విడాకులు ఇచ్చేస్తానని బెదిరించింది.

వినాయక్‌రావుకి గత్యంతరం కనిపించలేదు. డబ్బుకోసం చూసుకుంటే కూతురి కాపురం కూలిపోయేటట్టుంది. కొత్తగా ఇంకో మొగుణ్ణి తేవాలంటే కట్నం తడిసి మోపెడవుతుంది. అంతకంటే మోటర్ బైకే చీప్ అనిపించింది.

ఇరవై నాలుగ్గంటల్లో హీరోహోండా కొనుక్కొచ్చి అల్లుడికి సమర్పించుకున్నాడు.

ఆనందరావుకు ఆనందం ఆగలేదు.

రెండు నెలలపాటు లోకల్ ట్రెయిన్స్‌లో ప్రయాణిస్తున్న ఆనందరావుకి సికింద్రాబాద్ స్టేషన్‌లో నిత్యమూ వినిపించే ట్రెయిన్ ఎనౌన్స్‌మెంట్స్ అన్నీ కంఠతా వచ్చేసాయి... ఆ మధ్య వారం రోజులుగా అతను నిద్రలో పెద్ద గొంతుకతో రైళ్ల ఎనౌన్స్‌మెంట్స్ చేసేస్తుంటే జయకు నిద్ర చెడిపోతోంది. లోకల్ ట్రెయిన్‌లో ప్రయాణించడంవల్ల వచ్చిన అనర్థం అదంతాను అని భర్త చెప్పడంతో నిజమేననిపించింది. మొగుడికి అది క్రానిక్ జబ్బుగా పరిణమి

'మామా! నీ ఎత్తుకు పై ఎత్తే- నా రైల్వే ఎనౌన్స్‌మెంట్స్! ఆఫీసుకు వెళ్లడానికి నేను కష్టపడుతున్నానంటే నీకు లెక్కలేకపోయింది. నీ కూతురి నిద్రకు ఇబ్బంది కలుగుతుందనేసరికి బైక్ వచ్చేసింది. నీ మీద, నీ కూతురి మీదా నా ట్రిక్ ఫలించింది. ఇంత మంచి సలహా ఇచ్చిన నా మిత్రుడికి ఈ రాత్రికే మందు పార్టీ ఇచ్చేస్తాను' అనుకున్నాడు మనసులో స్వగతంగా.

అప్పుడే గదిలో అడుగుపెట్టిన జయ అతని పలుకులు ఆలకించి తెల్లబోయింది. 'ఔరా... మగడా!' అనుకుంటూ ముక్కున వేలేసుకుంది. ©

# కరెంట్ కోత

- వాణిశ్రీ



చిలుమూరులో సుబ్బారావు ఎలక్ట్రికల్ డిపార్ట్‌మెంట్‌లో లైన్‌మేన్. ఉద్యోగంతో పాటు రేడియోలు, టీవీలు రిపేరు చెయ్యడం నేర్చుకున్నాడు. స్వంతవూరు భీమడోలు అయినా ఇక్కడ సౌకర్యంగా వుందని ఇల్లు కట్టుకుని సెటిలైపోయాడు.

ఆ రోజు డ్యూటీ నుంచి ఇంటికొచ్చేసరికి "మీ కోసం వెంకట్రామయ్య గారొచ్చి వెళ్ళారు. మిమ్మల్ని అర్జెంటుగా కలవమన్నారు" అన్నది భార్య జానకి.

"రాత్రికి వాళ్ళమ్మాయి పెళ్ళి వుందిలే. కళ్యాణమండపానికి డెకరేషన్ బల్బుల కోసమై వుంటుంది. రాజుగాడికి ఆ పని అప్పజెప్పానులే" అని భోజనానికి కూర్చున్నాడు సుబ్బారావు.

రాజు సుబ్బారావుకి అసిస్టెంట్. అతను డ్యూటీ మీద తిరుగుతుంటే వాడు షాపులో కూర్చుంటాడు.

సుబ్బారావు భోజనం చేసి కునుకు తీస్తుంటే వెంకట్రామయ్యగారి పాలేరు వెంకడు గావుకేకలు పెట్టాడు.

"సుబ్బారావు గోరూ! ఓ ... సుబ్బారావు

గోరూ!"

సుబ్బారావు వులిక్కిపడి లేచాడు. నిద్ర చెడగొట్టినందుకు ఒళ్ళు మండింది.

"ఏందయ్యా! నీ అరుపులు. బంగారం లాంటి నిద్ర చెడగొట్టావు" అని విసుక్కున్నాడు.

"పెద్దయ్యగోరు ఎంటవుండి పిల్చుకు రమ్మన్నారండీ" అన్నాడు వెంకడు.

"ఎందుకూ? కళ్యాణమండపం డెకరేషన్ కేగా? రాజుని పంపించా కదా! ఇంకేంది? " అని అడిగాడు సుబ్బారావు.

"ఏవోనండీ. నాకేం తెలుసుద్ది. ఎంటనే రండి. ఇందాకో పాలొచ్చి చెప్పొగదండీ" అని వెళ్ళిపోయాడు వెంకడు.

'వెంకట్రావయ్యకి అంతా హడావుడే. పని వెంటనే జరిగిపోవాలంటాడు. కళ్యాణ మండపానికి డెకరేషన్ కావాల్సింది రాత్రికి కదా! ఏంటో తిక్కమాలోకం. పని పూర్తయిందని చెప్తేగాని నిద్రపోడు.' అని గొణుక్కుంటూ బయల్దేరాడు సుబ్బారావు.

వెంకట్రామయ్య ఇంటి ముందు పందిట్లో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు. ఇల్లంతా బంధువులతో, ఆ పనీ ఈ పనీ చేస్తున్న పనివాళ్ళతో హడావుడిగా వుంది.

"కళ్యాణ మండపానికి డెకరేషన్ బల్బులు మా రాజు పెట్టేస్తున్నాడు లెండి. చెప్పారుగా మొత్తం పదివేలని. రాత్రికి ధగ ధగలాడిపోతాయ్. అందులోనూ కొత్తసెట్టు" అన్నాడు సుబ్బారావు వెంకట్రామయ్యని చూస్తూనే.

వెంకట్రామయ్య నవ్వి "అందుకు కాదు లేవయ్యా సుబ్బారావ్. నీతో పెద్ద పనిపడింది. ఎట్టాగైనా నువ్వే చెయ్యాలి" అన్నాడు.

"పెద్దపనా? అదేందండీ? " అని అడిగాడు సుబ్బారావు ఆశ్చర్యపోతూ.

"ఈ రోజు రాత్రి ఏడింటి కాడ్నుంచి పదింటి దాకా వూళ్ళో కరెంట్ పీకి పారెయ్యాల" అన్నాడు వెంకట్రామయ్య.

సుబ్బారావు షాక్ తిన్నాడు. తనని ఎవరైనా కరంటు కావాలని అడిగేవాళ్ళే గాని, పీకి పారెయ్యాలని అడిగినోళ్ళు ఇంతవరకు లేరు. అందులో వూరు మొత్తానికి కరంటు పీకమంటున్నాడు. ఇంతకీ వెంకట్రామయ్యకి పిచ్చిగాని ఎక్కలేదు గదా అని అనుమానం వచ్చింది సుబ్బారావుకి.

"అదేందండీ బాబూ! ఊరు మొత్తం కరెంటు లేకపోతే మీకేంటి లాభం? " అని అడిగాడు సుబ్బారావు ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ.

"ఇదుగో ఈ డబ్బు వుంచు. ఏడింటి నుంచి పదింటి వరకు వూళ్ళో కరంటు వుండగూడదు. ఎవరడిగినా ఏదొకటి చెప్పు. కళ్యాణమండపానికి మాత్రం కరంటు వుండాలి. నువ్వేం చేస్తావో నాకు తెలీదు" అని ఐదొందల నోటు సుబ్బారావు జేబులో కుక్కాడు.

"సర్లేండి, ఏదొకటి చేస్తాగాని. మీకీ వింత కోరికకి కారణం ఏంటో చెప్పండి" అన్నాడు సుబ్బారావు నవ్వుతూ.

"నా కోరిక నీకు పిచ్చిలా అనిపిస్తే అనిపించొచ్చు గాని అసలు సంగతేంటంటే, పోయిన్నెలలో గోరంట్ల గోపరాజు కూతురు పెళ్ళికి వూళ్ళో సగంమంది రాలేదు. వండినవన్నీ అట్లాగే వుండిపోయినయ్. ఎందుకో తెలుసా? ఈ ఆడోళ్ళంతా టీవీల ముందు కూర్చుని కదలకపాయె. ఆడోళ్ళు కదలకపోతే పిల్లలు, మగాళ్ళు ఏం వస్తారు చెప్పు. అందుకే అసలు కరంట్ పీకితే చచ్చినట్లు వస్తారు. ఏందంటావు? ఎట్టావుంది నా ఐడియా!" అని పకపక నవ్వాడు వెంకట్రామయ్య.

"నిజవేనండోయ్! భలే ఐడియా వేశారే" అంటూ సుబ్బారావు వెంకట్రామయ్య నవ్వులో శృతి కలిపాడు. ©

# మనసున ఉన్నదీ...



★ అనుక్షణం అణచివేతకు గురయ్యే ఆడది తలచుకుంటే పురుషహంకారి భర్తకు ఎలా గుణపాఠం చెప్పగలదో తెలియచెప్పారు రచయిత మాచిరాజు కామేశ్వరరావుగారు తన 'దిశానిర్దేశం'నవలలో. పితృకర్మల గురించి 'ఇదీవేదం' చర్చించిన తీరు బాగుంది.

**–అనుముల శివాణి, కిషన్‌పుర,** హన్మకొండ

★ డ్రాలో బహుమతి రాకపోయినా చతుర 'ప్రవేశిక'కు సరైన జవాబులు రాసి పంపిన వారిపేర్లు ప్రచురిస్తే వారు సంతోషిస్తారు కదా? అవసరమైతే రెండుపేజీలు పెంచయి నాసరే ప్రయత్నించాలని మనవి.

**–యు.విజయశేఖరరెడ్డి,** కూకట్‌పల్లి

★ అక్టోబరు చతురలో వచ్చిన కామేశ్వరరావుగారి నవల 'దిశానిర్దేశం' చాలా బాగుంది. కథ నడిపిన తీరు బాగా ఆకట్టుకుంది.

**–ఇలపావులూరి శేషతల్పశాయి, స్వర్ణలత,** కరీంనగర్

★ 'లయ' ముఖచిత్రంతో అక్టోబరు చతుర మనోహరంగా ఉంది. మాచిరాజు కామేశ్వరరావుగారి 'దిశానిర్దేశం' ప్రారంభం నుంచి ముగింపు దాకా ఎక్కడా బిగిసడలకుండా ఆసక్తికరంగా చదివించింది. 'చతుర ప్రపంచం', ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయం బాగున్నాయి. 'వారెవ్వా'కు మరిన్ని పేజీలు కేటాయించండి. యర్రంశెట్టి 'అపార్ట్‌మెంటాలజీ'కి అభినందనలు.

**– నేమాన సుభాష్‌చంద్రబోస్,** శ్రీకాకుళం

★ అక్టోబరు చతురలో కొత్తగాలి శీర్షికన ప్రచురించిన తమిరిశ జానకి 'భూమి గుండ్రంగా..' చాలా బాగుంది.

**–డాక్టర్ రాజేష్,** హైదరాబాద్

★ అక్టోబరు చతుర నవల 'దిశానిర్దేశం' ఆద్యంతం ఆసక్తికరంగా చదివించింది. సంప్రదాయవాదాన్ని సమాధిచేస్తూ, తనకు నచ్చిన విధంగా జీవితాన్ని మలుచుకున్న నీరజ పాత్రను తీర్చిదిద్దిన తీరు అమోఘం. 'ప్రవేశిక' విజేతలను ఐదుగురుకాక, పదిమందిని ఎంపికచేసి బహుమతులు ఇస్తే బాగుంటుందని నా మనసున ఉన్నదీ.. చెప్పాలనున్నదీ చెప్పాను.. మంచి నవలలు అందిస్తున్నందుకు ధన్యవాదాలు.

**–ఇమ్మానేని,** మచిలీపట్నం

★ అక్టోబరు చతురలో 'చావువిందు' కథ వెనుక కథ చదివాక ఆ కథను నేరుగా చదవాలని ఉంది. వీలుంటే ప్రచురించరాదూ? పనిలేని టీవీ శ్రోతలు ఇతరులకు ఇబ్బంది కలిగించే తీరుపై 'దిశానిర్దేశం'లో బాగా చర్చించారు. ప్రస్తుతం అదేజాఢ్యం ఎఫ్‌ఎం రేడియో ఛానల్స్‌లో నడుస్తోంది. యర్రంశెట్టిసాయిగారి శీర్షికలో ప్రస్తుతంవచ్చే సినిమాలను బాగా దుయ్యబట్టారు. పజిల్ సరిగా పూర్తిచేసిన వారందరి పేర్లూ ప్రచురించాల్సిందిగా మనవి.

**–శోభ,** తిరుపతి

★ 'దిశానిర్దేశం' చక్కగా ఉంది. అనుమానించే మొగుడితో వేగలేక అల్లాడుతున్న ఆడపడుచుల దైన్యాన్ని మాచిరాజు కామేశ్వరరావు కళ్లకు కట్టారు. అలాంటి మొగుడికి నీరజ పాత్రతో సరైన గుణపాఠం చెప్పించినపద్ధతి బాగుంది. మంచి నవల ప్రచురించినందుకు 'చతుర'కు అభినందనలు. ఇలాంటి నవలలు మరిన్ని రావాలి.

**–ఎ.ఉమాశంకర్,** యు.కొత్తపల్లి

★ సంధ్యావందనం లక్ష్మీదేవిగారి వ్యాసం "పితృకర్మలు", అందులో వివరించిన సత్యాలు అన్ని కులాలు, మతాల వారికి కనువిప్పు కలిగించే అంశం. వివేచనా శక్తిని పెంపొందించే ఇలాంటి వ్యాసాలు మరిన్ని "చతుర" పాఠకులకు అందించి వారికి ధర్మమార్గాన నడిపించే వెలుగును చూపాలని మనసారా కోరుకుంటున్నాను.

**– నడవపల్లి వెంకటేశ్వర్లు,** హైదరాబాద్

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



## నవంబరు - 08

నవంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం.

1. లక్ష్మికి సాయం చేయాలనుకున్న జర్నలిస్ట్?
2. ఆటోవాలా లక్ష్మిని ఎక్కడ దింపాడు?
3. గొలుసు దొంగ ఎవరు?
4. మోహన్ స్నేహితుడి పేరేంటి?
5. హాస్టల్‌లో చనిపోయిన బాలిక?
6. కత్రినా మోడలింగ్‌లో ఎన్నోఏట ప్రవేశించింది?
7. బ్రాందీ, విస్కీలను ఉచితంగా ఇస్తానన్న పార్టీ ఏది?
8. 'అక్షింతలు' రచయిత్రి పేరు?
9. వినాయకరావు అల్లుడెవరు?
10. ది పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ లేడీ నవలారచయిత?

పంపినవారి పేరు: ---------------------------------- వయసు (   )

చిరునామా: ------------------ ------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# విపుల ఆహ్వానము

## అనువాద కథలకు

సుతిమెత్తని సంవేదనలు
అనురాగభరిత ఆత్మ నివేదనలు
ఉత్కంఠభరిత కథన వేగాలు
ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

### ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన
అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే**
**విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

రచనలు పంపవలసిన చిరునామా

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78